# శివపురాణము

(నాలుగవ సంపుటము.)

మూర్తిత్రయ ప్రణీతము.



నడకుదుటి వీరరాజు పంతులు

సంపాదకుఁడు.

వెల రు ౧-౮-౦.

# విషయసూచిక.





## వాయవీయసంహిత.

# స్వవిషయము.



దీనితో శివపురాణము నాలుగుసంపుటములైనది. పాఠకులకు విభిన్నంబు లగునూతనాభిరుచులను గల్పించువంటి విచిత్రకథావిలసితంబును, విమలతీర్థక్షేత్రమాహాత్మ్యవిరాజితంబును, భగవల్లీలామయంబును, బరమపురుషార్థదాయకంబునగు బ్రహ్మపురాణమునుగూడ నాంధ్రీకరింపఁ బ్రారంభించి యందొకభాగమును రాఁబోవుసంపుటముగాఁ బ్రకటింపఁదలఁచితిమి. ఈవిధముగా శివపురాణ మొకసంపుటమును, బ్రహ్మపురాణ మొకసంపుటమునుగా నొకదానివెనుక నొకటి ప్రకటించుచుందుము. ఈవిధముగాఁ జేసినచో నించుమించుగా శివపురాణము పూర్తియగునప్పటికి బ్రహ్మపురాణమును సంపూర్ణముగాఁ గలదు. పిమ్మట గరుడపురాణమును, అగ్నిపురాణమును, వాయుపురాణమును, విష్ణుపురాణమును బ్రారంభించి యిట్లే ప్రకటింప నిశ్చయించితిమి.

సనాతనధర్మపరాయణులును దేశభాషాభిమానులు నగునాంధ్రసోదరులెల్లరును గష్టసాధ్యంబును, గాలోచితంబును దేశభాషాభివృద్ధికిఁ బరమోపయోగంబు నగుమాయుద్యమము నాదరించి మాకెల్లవిధంబులఁ జేయూఁత యొసఁగి యవశ్యకరణీయంబగునీఘనకార్యమును మాచే నిర్వహింపఁజేయఁగలరని విశ్వసించుచున్నాము. అచిరకాలముననే పలువురు పుణ్యపురుషులు చందాదారులుగాఁ జేరి మాకుఁ బరమోత్సాహమును గల్పించి స్వధర్మనిర్వహణమును గావించుచుండుటచే వారి నెంతయు నభినందించుచున్నాము.

సంపాదకుఁడు.

శ్రీ రామైనమః.

# శివపురాణము.



## సనత్కుమారసంహిత.



### —. ఓంకారక్షేత్రమాహాత్మ్యము. .—

సనత్కుమారుం డిట్లనియెను. వ్యాసమునీంద్రా! వేదసమ్మితము, దివ్యంబును, పురాతనంబు నగునీచరిత్రము నాలకింపుము. దేవి యగు గిరిరాజకన్య కాళికానామముచే విఖ్యాతయై పరమేశ్వరునకు భార్య యయ్యెను. శీలవృత్తగుణంబులచే సత్కృత్తములాలగు నయ్యర్ధాంగియెడల నతిప్రియుండై మహాదేవుండు స్వర్గశ్రేష్ఠంబగు నవిముక్తపురంబున నామెతోఁగూడ యుండెను. ఆపంచాయతనక్షేత్రమునం దీపికముగాఁ జాలకాలము గడచిపోయెను. లోకసంగ్రహముకొఱకు కాలఁపు నిత్యము నుభయసంధ్యలయందు నోంకారేశ్వరు నుపాసించుచుండెను. అప్సరలు, గంధర్వులు, విద్యాధరులు, చారణులును నృత్యగీతవాద్యంబులఁ గావించుచుండిరి. అట్లు లక్షవర్షంబులు వారితోఁ గలసి నృత్యముగావించుచున్న మహేశ్వరునిశరీరమునందలి ఘర్మజలంబునుండి ప్రమథగణంబులును, భూతగణంబులును నావిర్భవించి మహానందముతో నృత్యము గావించుట కారంభించిరి. ఆతాండవావేశముచే జారిపోవుచున్నవస్త్రములనుగూడ వారు లక్ష్యము సేయుట లేదు. ఆవిధముగనే నాట్యతత్పరుండై యున్నమహాదేవుం గాంచి పార్వతీదేవి యిట్లనియెను.

ఓవిరూపాక్షా! ఇదియేమినాట్యము! నాకిదియంతయు నతివిచిత్రముగా నగపడుచున్నది. నేనిదివఱకు మందరపర్వతమునందును, కైలాసాచలమునందును, మఱియు నితరమహీధరంబులయందును నీయానందనర్తనముం గాంచియుంటిని. కాని యిప్పటినటనమేమో విలక్షణముగాఁ దోఁచుచున్నది. నేను నీప్రేమకుఁ బాత్రురాలనే నైనచో నాకీయుత్సాహకారణమును దెలుపుము. అని పార్వతీదేవి ప్రార్థించుటయుఁ బరమేశ్వరుండు మందహాసంబు చేయుచు నద్దేవివదనకమలంబును దనకరంబుతో నల్లనఁ బైకెత్తి సాంత్వనస్వరంబున నిట్లనియెను.

ఓగిరిరాజకుమారీ! ఇచ్చట నేనిట్లు నృత్యంబు గావించుటకు విశేషకారణ మున్నది. పరాత్పరుండును, సాక్షీభూతుండు నగునేదేవుఁడునాదాఖ్యచేఁ బరికీర్తితుం డగుచుండునో యాదేవుం డీపవిత్రక్షేత్రంబున వెలసియున్నాఁడు. ఈబ్రహ్మాండగర్భమునం దెన్నితీర్థము లున్నవో యన్నిటికంటెను నీపంచాయతనక్షేత్రమే యుత్తమమైనది. నేనీక్షేత్రము నింతయధికముగా నేల ప్రేమించుచుంటినో చెప్పెదను వినుము. జగదంబ యగునిందిరాదేవి కేళీమందిర మగుపద్మవనము బ్రహ్మదేవున కెంతపరమానందకర మైనదియో, నాకీస్థాన మంతటియానందదాయకమైనది. ఈక్షేత్రమున నివసించు జనాత్ములకు దివ్యదృష్టి లభించును. ఆదృష్టిప్రభావముచే వారు చతుర్భుజుం డగుపురుషోత్తముని దర్శింపఁగలుగుదురు. పూర్వము పంచాయతనక్షేత్రమునందుండు మానవులు ప్రత్యక్షముగఁ ద్రినేత్రుండును, త్రిశూలధారియు, వృషభవాహనుండు నగుమహాదేవుని దర్శింపఁగలుగుచుండిరి. పంచాయతనంబున శివలోక సంచార మగుచుండును. ఈరహస్యము విషయలోలు రగుదుర్వివేకులకు విదితము గానేరదు. శాస్త్రవిరుద్ధకర్మాచరణు లగువారైనను పంచాయతనక్షేత్రసేవనమువలన శమదమాదిసంపన్నులై సద్భావభావితులు గాఁ

గలరు. వారికిఁ బరమేశ్వరసాక్షాత్కారము లభింపఁగలదు. ఈయవి
ముక్తక్షేత్రము సర్వోత్తమం బైనదని పూర్వజన్మమున శివారాధనముం
గావించినపుణ్యాత్ములకుమాత్రమే తెలియఁగలదు. ఈప్రపంచమునంద
లి సాధువు లందఱును వైశాఖశుద్ధచతుర్దశినాఁడు వారాణసీక్షేత్రమున
కుఁ బోయి పంచాయతనస్థితుం డగుమహాదేవుని దర్శించుచుందురు.
ఓంకారేశ్వరునకుఁ జతుర్దిశలందును, దేవతలును, ఋషులును, రుద్ర
గణంబులును, పాశుపతగణంబులును నివసించి యుందురు. ఈపంచా
యతనక్షేత్రమునకుఁ బూర్వభాగమున నాదిదేవుండును, స్వయంభువు న
గుకేశవుండు నివసించి యుండును. దక్షిణభాగమునఁ గోటిరుద్రగణం
బు లోంకారేశ్వరచింతాపరాయణులై యుంగురు. ఉత్తరభాగమున
వామదేవుఁడు, సావర్ణి, అఘోరుఁడు, కపిలుఁడు మొదలగువా రోం
కారధ్యానాసక్తులై యుందురు. పశ్చిమంబునఁ గృత్తివాసదేవుండు
విరాజిల్లుచుండును. ఈదేవతలందఱును, మనస్సు, బుద్ధి, అహంకార
ము, కామము, లోభము మొదలగువానినుండి సనాతనంబగు నీదివ్య
క్షేత్రమును రక్షించుచుందురు. ఓంకారేశ్వరసందర్శనమువలన లోక
దుర్లభం బగునుత్తమపదలాభంబు సిద్ధించును.

## —♦ పుష్పవాహనచరిత్రము. ♦—

పూర్వము రథంతరకల్పమునందుఁ బుష్పవాహనుం డను నొక
రాజుండెను. అతఁడు త్రిభువనములయందును సుప్రసిద్ధుండును, సూ
ర్యసన్నిభతేజోమయుండు నై యుండెను. అమ్మహావరుని తపంబునకు
సంతుష్టుండై మహాదేవుం డాతనికిఁ గామగమం బగుకాంచనకమల
మును బ్రసాదించెను. ఆసువర్ణకమలప్రభావముచే నారాజేంద్రుండు
స్వర్గమర్త్యపాతాళలోకంబులయందును, సప్తద్వీపములయందును యథే
చ్ఛాసంచారము గావించుచుండెను. పుష్కరవాసి యగునాభూపాలుని

నామముచేఁ గల్పాదియం దాతఁడు నివసించినద్వీపమునకుఁ బుష్కర ద్వీపమని పేరు గలిగెను. బ్రహ్మదేవుం డానృపాలునకు మనోవేగసంపన్నం బగు దివ్యవిమానమునుగూడఁ బ్రసాదించెను. ఆకారణముచే దేవతలును మానవులునుగూడ నాతని బుష్పవాహనుఁ డని పిలుచుచుండిరి. త్రిలోకములయందు నాతని కగమ్యం బగుస్థాన మేదియును లేకుండెను. ఆతని సతీమణి యప్రతిమానరూపలావణ్యసంపన్నయు, సతీలోకగుణవతియు, నంగనాజనశిరోమణియు నై యుండెను. పార్వతియందుఁ బరమేశ్వరునకునుంబోలి ననన్యాసక్తి యగు నాసతీరత్నమునం దాతఁడు బద్ధానురాగుఁడై యుండెను. ఆదంపతులకు ధర్మాత్ములును, ధనుర్ధరులయం దగ్రగణ్యులు నగుపదివేలమందితనయులుండిరి. ఆమహారాజు తనవైభవము నంతను జూచుకొని తనలోఁ దానే విస్మయుఁ డగుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు ప్రచేతసుం డనుమునీంద్రుఁడు తనచెంతకరుదెంచుటయు నారాజేంద్రుం డాతని నుచితరీతిని సన్మానించి, మహాత్మా! పరమేశ్వరుండు నాయల్పతపంబునకే సంతుష్టుండై నిర్మలైశ్వర్యంబును, లోకవిఖ్యాతకీర్తిని, సుందరీశిరోమణియగుభార్యను, గామగమనం బగుపద్మగృహంబును బ్రసాదించుటకుఁ గారణమేమి? ఈ పద్మగృహము వివిధమణివసరప్రపూర్ణంబులగువీథులచే విరాజిల్లుచున్నది. చతురంగబలసమేతులై శతకోటిమహీపతు లిందుఁ బ్రవేశించినను నిరాఘాటముగ నిదియాకాశసంచారము సేయఁ గలదు. ఇట్టియసాధారణంబగువైశ్వర్యము నాకేజన్మాంతరసుకృతవిశేషంబుచే లభించినదో దయయుంచి యానతీయవలయు నని ప్రార్థించెను.

అప్పు డమ్మునివరుం డిట్లనియెను. మహారాజా! నీజన్మాంతరవృత్తాంతమును దెలిపెద నాకర్ణింపుము. నీవు పూర్వజన్మంబునఁ గిరాత

వంశమునందు జనియించితివి. అందుచే నీహృదయము దయావిరహితంబును, నీకరంబులు లోకహింసాకరంబులును, నీశరీర మకార్యకరణమూలంబున నతికర్కశంబును, గునఖబహుళంబును, వికృతంబు నై యుండెను. నీకుఁ దల్లిదండ్రులుగాని, పుత్రికాపుత్రకులుగాని, బంధుమిత్రులుగాని యెవ్వరునులేకయుండిరి. కేవల మొక్కభార్యమాత్రమే యుండెను. అట్లుండ నొకప్పు డతిసంతాపకరం బగుననావృష్టి యగుటయు నాహారాభావముచే నీవధికక్షుధార్తుండవై యనేకస్థలంబులఁ బరిభ్రమించి వెదకియు నొక్కఫలమ్మైనను బడయఁజాలకపోయితివి. నీ వావిధముగాఁ బోయిపోయి కమలకుసుమశోభితం బగునొకసరోవరమును గాంచి యందుఁ బ్రవేశించి మోయఁజాలినన్ని తామరపువ్వులను గోసి నెత్తిని బెట్టుకొని యవిముక్తనామకం బగుపురంబునఁ బ్రవేశించితివి. ఆనగరమునం దాపూవులను విక్రయించి కొంతధనమును సంపాదింపవలయు ననునాశతో నూరంతయును దిరిగి ప్రయత్నించితివి గాని యెంతమాత్రమును లాభము లేకపోయెను. అట్లు తిరిగి తిరిగి వేసరి తుదకు నీవు నీభార్యతోఁ గలసి రుద్రావాసమును జేరుకొంటివి. అందు మీరిరువురును మంగళధ్వనుల నాకర్ణించుచు మహావైభవసంపన్నులగు పార్వతీపరమేశ్వరులను సందర్శించితిరి. ఆపవిత్రస్థానమునందుఁ దద్భావగతసంకల్పులును, ఓంకారేశ్వరచింతాతత్పరులు నగు దేవగంధర్వసిద్ధకిన్నరులును, వేదశాస్త్రజ్ఞులగుబ్రాహ్మణులును, పాశుపతవ్రతులును దమహృదయకమలములందుఁ బరమేశ్వరునిచరణకమలములను ధరించి నిటలతటఘటితాంజలులై యోంకారేశ్వరుని ధ్యానించుచుండిరి.

ఆపంచాయతనక్షేత్రసేవనంబునను, సాధుజనసందర్శనంబువలనను నిశ్చయముగా నప్పుడు నీకును, నీభార్యకును బరమేశ్వరునియందు భక్తి కలిగెను. అప్పుడు నీవు నీయొద్దనున్న తామరపూవులతోఁ బరమే

శ్వరు నలంకరింపవలయు నని సంకల్పించి యాపుష్పముల నన్నిటిని మ హాదేవునకు సమర్పించితివి. మాహాత్మ్యవశంబున మరల నీవాపుష్పము లను దీసికొనఁజాలకపోయితివి. మఱియుఁ బ్రసంగవశంబున నీవారా త్రి యచ్చటనే జాగరణంబు గావించి ప్రాతఃకాలమునందు యాదృచ్ఛి కముగా నాదేవుని సందర్శించి మనంబున నాశ్చర్యంబు నొందుచు భా ర్యతోఁగూడ నీవాస్థలమును బరిశుభ్రముగఁ దుడిచి యలికి పరిష్కృ తముం గావించితివి. మఱికొంతసేపటికి నీవాస్థానమునందే క్షుద్బాధ చేఁ బంచత్వంబు నందితివి. అప్పుడు నీభార్య యగ్నిప్రవేశంబు గావిం చెను.

ఓమహారాజా! ఆసత్కర్మముచేతనే నీకీజన్మమునం దింతటిమై శ్వర్యము లభించినది. నీవు వ్యాధుండవయ్యును మహాదేవునకుఁ బుష్ప సమర్పణంబు గావించి సేవించుటవలన నిప్పుడు మహీనాథుండవై జ న్మించితివి. నీపూజ స్వల్పంబైనను, ఓంకారేశ్వరమాహాత్మ్యముచే న ది కోటిగుణితంబైనది. నీకు దివ్యవిమానమును బ్రసాదించినబ్రహ్మదే వునికివలెనే బ్రహ్మస్వరూపి యగునీశ్వరుఁడును నీయెడల సంతుష్టుండై యుండె నని యెఱుంగుము. కావున నీవిప్పు డీపుష్కరద్వీపమును విడి చి యవిముక్తక్షేత్రమునకుం బోయి యోంకారేశ్వరు నాశ్రయింపు ము. ఆదేవునియనుగ్రహంబున నీకీశ్వరసందర్శనంబు లభింపఁగలదు. అని యమ్మునిచంద్రుం డానతిచ్చుటయు నాభూపాలచంద్రుం డమం దానందహృదయుండై యోబ్రహ్మకులతిలకా! మీరు దయతో నా పూర్వజన్మవృత్తాంతముం దెలిపితిరి. మహాపుణ్యవశంబునఁగాని మీ వంటిమహనీయులసందర్శనము లభింపదు. అని యనేకవిధంబుల నా మునీంద్రుని వినుతించి భార్యాసహితుండై పుష్పవాహనభూపాలుఁ డాక్షణంబుననే వారణాసీక్షేత్రమునకుఁ బ్రయాణ మయ్యెను. క్రమ

ముగా నాతఁడు కాశికి వచ్చి మహోన్నదరీతీర్థప్రాంతమున నున్న రు ద్రావాస మనుసరోవరమున కుత్తరమున శివప్రియతమంబగుపంచాయత నమునందు దక్షిణామూర్తిస్థితుం డగునోంకారేశ్వరుని సేవించెను. పూర్వకాలమునం దీస్థానమునందు దేవహ్రద ముండెడిది.

ఈదివ్యస్థలము పుణ్యము సేయనివారికి దుర్లభమైనది. సకలజీవులకును బుణ్యప్రదమైనది. స్వర్గవాసులును, దదితరక్షేత్రవాసులును గూడ నాదివ్యస్థలమును గాంక్షించుచుందురు. రుద్రావాసమున స్నానము చేసి పంచాయతనవాసి యగునీశ్వరుని దర్శించువారికిఁ బునర్జన్మంబు లేదు. ఆదేవుని సందర్శించుటవలన సర్వాభీష్టములును సిద్ధించును. కలికల్మషదూషితులగువా రీస్థలమును స్మరింపనైనఁజాలరు. వారి కీదివ్యక్షేత్ర మగమ్యమైనది. అట్లగుటకు వారి యజ్ఞానమే కారణము. కాని నిశ్చలబుద్ధు లగువారి కాక్షేత్రసేవనము లభింపఁగలదు. ఓవ్యాసమునీంద్రా! ఆదివ్యతీర్థమును స్వయముగాఁ బరమేశ్వరుఁడే స్థాపించి యున్నాఁడు. అందు గంధర్వులు, కిన్నరులు, యక్షులు, అప్సరలు, ఉరగులు, దైత్యులునుగూడ నదృశ్యులై పరమేశ్వరుని బూజించుచుందురు. రాజర్షి యగుపుష్పవాహనుం డాస్థానమునందుఁ బరమభక్తియుక్తుండై శాంతమూర్తి యగుపంచాయతనేశ్వరు నారాధించి పరమపదమును సందర్శించెను. ఈవిశ్వ మంతయును బరమాత్మునిచే వాక్కుచేతనుంబోలి వ్యాప్తమై యున్నది. ఆస్థానమునందు జపంబులఁ గావించుచు యోగులు ముక్తు లగుచుందురు.

ఓదేవీ! పార్వతీ! నీవునన్నడిగినప్రశ్నంబునకుత్తరం బిచ్చితిని. వారణాసియందలి పంచాయతనక్షేత్రమునం దున్నయోంకారేశ్వరుని దర్శించువారికి విజ్ఞానవిభవంబులు లభింపఁగలవు. ఆస్థానమునందలిదుర్లభపదము తపస్వులకుఁగూడ నసాధ్యమైనది. దానంబులలో దుర్ల

భదానంబును, వ్రతంబులలో దుర్లభవ్రతంబు నగునీస్థానము సాధారణదుర్లభంబని పరమేశ్వరుం డానతిచ్చి యుండెను. నిశ్చల మగుభక్తితో శంకరు నారాధించువా రమ్మహాదేవునియందు విలీను లగుదురు. అట్టిమానవమూర్తులకు ప్రమథగణస్వరూపములు సిద్ధించును. ఓసుందరీ! సిద్ధయోగసంపత్తి కిదియే యేకమాత్రసోపానము! వారాణసియందలిప్రధానక్షేత్రము లన్నిటిలోనను, ఓంకారస్థానమే శ్రేష్ఠంబును ప్రథమంబు నై యున్నది. ఓంకారేశ్వరదర్శనంబున సకలక్షేత్రదర్శనఫలంబును సిద్ధించును.

అని చెప్పి మహేశ్వరుం డో దేవీ! పూర్వము నాచే నిర్మింపఁ బడినయుద్యానమును దర్శింతువుగాని రమ్ము! దానితో సమానమగు నది దేవలోకమునందుఁగూడ నెందును లేదు. దానిని గాంచి యాశ్చర్యముం గాంచనిజీవు లెవ్వరు నుండరని ప్రశంసించుటయుఁ బార్వతీదేవి, నాథా! నీవు చెప్పినట్లే చేయుదును. నాకిఁక నేమియును బనిలేదు. అక్కడకే పోవుదము రమ్మనియెను.

## కపిలాహ్రదాదులవృత్తాంతము.

అనంతరము వృషభధ్వజుం డగుమహాదేవుండు పూర్వదిగ్భాగంబున నసితీర్థమునకు సమీపమునం దున్న మనోహరోద్యానమును దేవియగుహిమాచలతనయకుఁ జూపించెను. అచ్చటఁ గిన్నరులతిమనోహరముగ గానము సేయుచుండిరి. నలుదెసలయందును బుష్పించినతరులతాదులు రమణీయములై యుండెను. కలవిహంగములమధురకూజితము లెల్లయెడల శ్రవణానందముం గూర్చుచుండెను. చంపకపున్నాగాశోకప్రియంగుకదంబాశ్వత్థవటోదుంబరాదివృక్షపంక్తులు పల్లవకుసుమఫలభరితములై కన్నులపండువుగా నుండెను. సుగంధకలితంబు లగుజాతీవకుళాదిపుష్పగుచ్ఛంబులపై మధుపానాసక్తంబు లగుమదభృంగము

లు ఝంకారస్వనంబులతోఁ దిరుగాడుచుండెను. అట్టి సర్వసంపన్నం బగునుద్యానవనరాజమధ్యమునఁ బ్రవేశించి దేవదేవుండు పార్వతీదేవిం గూర్చి యిట్లనియెను.

ఓ దేవీ! అదిగో! చూడుము! కిన్నరులు విమానారూఢులై యంబరతలంబున సంచరించుచున్నారు. ఇవి పారిజాతభూరుహములు. ఇయ్యవికల్పలతాకుంజములు. పవిత్రంబులగునీసకలవృక్షలతలును బ్రహ్మవిష్ణుశివలోకంబులయందుమాత్రమేయుండును. అవి యన్నియు నిండియున్నవి చూడుము! ఈవారణాసీదేవి శివలోకము నాశ్రయించి యున్నది. ఈభాంతోద్యానమునందు దేవదేవుం డగుజనార్దనుండును, ఆతనినాభికమలమునుండిజనియించినబ్రహ్మదేవుండును నివసించియున్నారు. మఱియు నీయోంకారేశ్వరుని సకలదేవతలును బరివేష్టించి యున్నారు. దీనికూర్ధ్వంబున గోలోకమున్నది. అందు బ్రహ్మాదిదేవతలు గోవులకు స్వయముగా ఘాసము నొసగుచుందురు. ఈస్థానమునందొక్కప్పు డేకవర్ణముగల యాగోగణంబులదుగ్ధధారలు నాపైఁబడియెను. ఆసమయమునందు నేను తలయెత్తి పైకిఁ జూచితిని. యాజ్ఞికగణంబుల కుపకరణంబు లగుగోసమూహములు పైభాగమునందు నాకగపడియెను. నాదృష్టితాఁకినంతనే యవియన్నియును భయభ్రాంతములై పోయెను. ఆచూపువేఁడిచే నవి క్రమముగా దగ్ధము లగుచుండెను. ఆగోవు లన్నియును బూర్వము కపిలవంశమునందు జన్మించిన వగుటచే నన్నిటికి నొక్కటేరంగు గలిగి యుండెను. నాదృష్టి సోఁకినంతనే వానియందు వివిధవర్ణములు పొడకట్టుచుండెను. అప్పుడు లోకమాతలగుగోవులన్నియును నాశరణముం గోరి నన్నాశ్రయించెను. అనంతరము బ్రహ్మదేవుం డాగోరక్షణంబుకొఱకు నన్నుఁ బ్రసన్నుం గావించుకొని యిట్లనియెను.

ఓపరమేశ్వరా! ఈధేనుగణంబులకు వినాశంబు గలుగకుండునట్లు నీవు ప్రసన్నుండ వగుము. వీనికిభద్రంబు గలుగునట్లనుగ్రహింపుము. ఇట్లు బ్రహ్మదేవుండు ప్రార్థించుటయు నేను శాంతుండనై స్వస్థలంబును జేరితిని. ఆకారణంబుచే నాకు గోప్రేక్షకుం డనునామము గలిగెను. గోప్రేక్షకేశ్వరమును దర్శించి మహాదేవుని బూజించువారికి దుర్గతిభయంబు గలుగదు. అట్టివారు సర్వపాపములనుండియు విముక్తులగుదురు. అప్పుడు నేనుప్రసన్నకటాక్షములం దిలకించినంతనే యాగోవులన్నియును బ్రశాంతచిత్తముతో సంచరించుచు గ్రమముగా వచ్చి యీహ్రదమునందు స్నానము సేయ నారంభించెను. ఆగోవులభక్తిం గూర్చియు, నుపయోగముంగూర్చియు, బ్రహ్మదేవుండు నాకు విన్నపంబు గావించుటంజేసి గోవులు నాయాజ్ఞచే జగంబునఁ బూజనీయంబులును, గణనీయంబులు నయ్యెను. నాఁటుమొదలుగా నీహ్రదము కపిలాహ్రదనామంబున విఖ్యాతం బయ్యెను. ఈస్థానమునందు నేను వృషధ్వజనామముతో నుండి సాధువులకు సాక్షాత్కరించుచుందును. సుప్రసిద్ధం బగునీకపిలాహ్రదము దేవతలకుఁగూడ దుర్లభమైనది. స్వయముగా బ్రహ్మదేవునిచే నిది ప్రదర్శింపఁబడినది. తీర్థయాత్రార్థులగుపుణ్యాత్ములతాపశాంతికై యిందలిజల మమృతస్వరూపమై యుండును. ఆధేనుదుగ్ధంబులచేతనే యీహ్రదం బుత్పన్నం బయ్యెను. దీనికి రుద్రహ్రద మనియు, దేవహ్రద మనియు నామములు గలవు. ఈస్థానమునందు సకలదేవతలును నన్నుఁ బ్రసన్నుం గావించుకొనిరి. నేనును సకలజీవులకు మంగళవిధాతనై శివస్వరూపముతో నిందధిష్ఠించియుందును. ఈహ్రదం బధికపుణ్యప్రదమైనది. నిశ్చలభక్తియుక్తుఁడై యీహ్రదమును దర్శించువానికి దేవలోకావాసంబు సిద్ధించును.

పరమేష్ఠి యగుబ్రహ్మదేవుం డీస్థానమునందు నన్నుఁ బ్రతిష్ఠించె

ను. అనంతరము విష్ణుదేవుండుగూడ మరల నన్ను స్థాపించుటం గాం చి పితామహుం డుద్విగ్నహృదయుండై నారాయణు నుద్దేశించి నీవు మదానీతంబగు నీశివలింగమును మరల నిచ్చట నేల ప్రతిష్ఠించితివని యడిగెను. విష్ణుదేవుండును క్రోధముచే నసలసదృశుండై నాకతితరం బగుభక్తి కలుగుటవలన నేనిట్లు ప్రతిష్ఠించితిని. ఈశివలింగమింతటినుం డి హిరణ్యగర్భనామంబున విఖ్యాతంబు గాఁగలదనియెను. దేవీ! అ ప్పటినుండి నేనిందు సమాహితుండనై యుంటిని. నన్నిందు దర్శించు వారికి శమనసందర్శనంబు లేదు. అనంతరము లోకపితామహుండును మరల యథావిధిగ శివలింగప్రతిష్ఠాపనముం గావించి ప్రహృష్టహృద యుండై యాశివలింగమునకు మహాదేవస్వరూపప్రాప్తి కావలయు నని సంకల్పించెను. అనంతరము నేను సకలదేవతాసమక్షంబున బ్రహ్మావి ష్ణునియోజితుండనై వారిగౌరవముకొఱకు లింగమధ్యమున సూక్ష్మ రూపముతోఁ బ్రవేశించియుంటిని. అప్పటినుండియు నేనిచ్చట సునీలే శ్వరరూపముతో భక్తులకు సాక్షాత్కరించుచుందును. ఆకారణముచే నీపుణ్యక్షేత్రము సునీలంబనునామముచేఁ బ్రఖ్యాతం బయ్యెను. ఇం దుఁ బ్రాణత్యాగంబు గావించినవారికిఁ బునర్జన్మంబు లేదు. అప్పు డు లోకపితామహుం డగుబ్రహ్మయును, మహాత్ముం డగువిష్ణుదేవుం డును గూడఁ బ్రసన్నచిత్తులైరి.

ఈస్థానమునందు దైత్యులు నివసించి దేవతాకంటకులై సంచ రించుచుండుటచే నేను వ్యాఘ్రమూర్తినై వారినందఱను వినాశముం గావించితిని. అందుచే నేనీస్థానమునందు వ్యాఘ్రేశ్వరనామంబునఁ బ్రసిద్ధుండ నైతిని. వ్యాఘ్రేశ్వరసందర్శనంబున దుర్గతులు దూరము లై పోవును. పూర్వకాలంబున బ్రహ్మదేవుం డుత్పలుండును, విమలుం డు ననునిరువురుదైత్యులను సృజియించెను. వారు సకలదేవతలను నవ

ధ్యులై విక్రమించుచుండిరి. దేవీ! నీవారాక్షసులను సంహరించితివి. అప్పుడు నీయాజ్ఞచే నిందు సురాసురపూజితంబును, నిర్వాణనామకం బునగుహాద్రిదంబు కల్పింపఁబడియెను. ఈహ్రదమును దర్శించువారు సర్వబంధవినిర్ముక్తు లగుదురు. నేను ముందుగా నిచ్చటికి వచ్చి ప్రమ థగణంబులతోఁ గలసి ప్రయాణము చేయుచుందును. ఈయుత్తమస్థా నము పుణ్యదర్శనం బని నేను భావించుచుందును. ఇందలివినిర్మలశివ లింగమును దర్శించువారు జననమరణబంధంబులనుండి విడివడి దుఃఖ దూరు లగుదురు. ఇందు నలుదెసలను మదీయంబు లగుశివలింగములు ప్రతిష్ఠితములై యున్నవి. నిశ్చలభక్తితో వీనిని దర్శించువారికి దేహా త్మవిభేదజ్ఞానము లభియింపఁగలదు. ఇప్పుడు నేనిందువచ్చి నివసించి యుంటిని. ఎప్పటికిని నేను దీనిని విడిచియుండను గావున దీని కవిము క్తక్షేత్రం బనునామము గలిగెను.

పూర్వకాలంబున సకలసురాసురసమూహంబులును వివిధంబు లగుస్తోత్రంబులతో నన్నిందుఁ గీర్తించి యుండిరి. అప్పుడు నేను భూ తలమును భేదించుకొని లింగస్వరూపమున వారికి సాక్షాత్కరించితిని. ఆసమయంబున దేవతలందఱును నన్ను మహాదేవుం డనిప్రశంసించుచు ధ్యానపరతంత్రులై యీవారాణసియందు నన్ను బహుప్రకారంబులఁ బూజింప నారంభించిరి. పవిత్రం బగునీవారాణసీక్షేత్రము ముక్తిదా యకం బైనది. అవిముక్తేశ్వరు నిందు సందర్శించినపుణ్యాత్ము లెందు మరణించినను శివలోకగాము లగుదురు. ఈస్థానమునఁ బ్రాణత్యాగ ము గావించువారి కుత్తమగతిలాభంబు గలుగును. దేవీ! పూర్వకాల మున నీజనకుం డగు హిమాచలేంద్రుండు స్వయముగా నాకుఁ బ్రియ తమం బగునీస్థానమునందు శివలింగప్రతిష్ఠాపనముం గావించియున్నాఁ డు. ఆశైలేశ్వరలింగ మిదిగో చూడుము! ఈశివలింగదర్శనంబున శివ

లోకప్రాప్తి యగును.

పుణ్యభాగయగు వారాణసీదేవి పరమానందముతో జాహ్నవీ సహితయై యీక్షేత్రము నలంకరించి యున్నది. ఇందు వరణ, గంగ, అసి యనునదీత్రయము విరాజిల్లుచున్నది. ఈనదీత్రయసంగమస్థానమునందు బ్రహ్మదేవుం డుత్తమం బగుశివలింగమును బ్రతిష్ఠించి యుండెను. ఆలింగము సంగమేశ్వరనామంబునఁ బ్రకీర్తితం బగుచున్నది. ఈస్థానమునందు శుచియై స్నాన మాచరించి భక్తితో సంగమేశ్వరు నర్చించువాఁడు భవవిముక్తుం డగును. ఈయద్భుతక్షేత్ర మతిశ్రేష్ఠంబును యోగిజననివాసయోగ్యంబు నై విరాజిల్లుచుండును. ఈక్షేత్రమునకు మధ్యస్థలంబున నేను స్వయంభువునై సాక్షాత్కరించితిని. ఆ లింగమును సురాసురు లందఱును మధ్యమేశ్వరుం డని ప్రశంసించుచుందురు. శివవ్రతావలంబులు, మోక్షాభిలాషులగు సిద్ధులు, యోగీంద్రులు మొదలగువారి కిది నివాసస్థానము. ఈస్థానమును సేవించువారికి జననమరణాదిదుఃఖంబులు గలుగవు. ఈలింగము భృగుపుత్రుం డగుశుక్రునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. ఈశుక్రేశ్వరలింగము పూర్వము సకలసిద్ధులచేతను బూజింపఁబడియెను. ఈలింగముం దర్శించినమానవులు సర్వపాపవిముక్తు లగుదురు. ఈక్షేత్రమున మరణించువారికి మరల జన్మగ్రహణంబును, సంసారబంధంబును లేదు.

తొల్లి బ్రహ్మదేవుండు జంబుకరూపమును ధరించి నదీతటంబున దేవతలతోఁ గలసి దేవకంటకు లగునిరువురుదానవులను సంహరించెను. అప్పుడు గోమాయువధశంకితు లగుదేవతలంగూర్చి "నేనును సృగాలరూపంబున ననేకదానవులను బరిమార్చితిని." అని చెప్పితిని. వారందఱు నాసమయమున నాయాజ్ఞచే నచ్చట ననేకలింగములను బ్రతిష్ఠించిరి. ఆలింగముల నన్నిటిని దర్శించుటవలన బహుపుణ్యఫలంబు లభిం

చుటే కాక సకలమనోరథంబులును సిద్ధించును. దేవీ! ఈస్థానమున సూర్యదేవునిచే స్థాపింపఁబడిన గంభీరేశ్వరలింగ మున్నది. ఇది కల్పాంతమునందైనను శిథిలంబు గాక సర్వశుభదాయకమై యుండును. మఱియు యమునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన యమభయనివారకం బగునింకొక లింగము గలదు. దానిని దర్శించువారు ముక్తు లగుదురు. ఈశానప్రతిష్ఠితం బగులింగమును దర్శించి యారాధించువారు పాపవిముక్తులై భవదూరు లగుదురు. సకలదేవతారాధ్యం బగునీశానలింగము సర్వశ్రేష్ఠమైనది. దేవీ! ఈపవిత్రస్థానము లన్నిటింగూర్చియు నీకుఁ దెలిపితిని. ఇఁక నీమహాక్షేత్రంబున నతిగోప్యం బగుస్థానముంగూర్చి చెప్పెదను వినుము. ఇందు నలుదెసల నేకైకక్రోశంబుగా యోజనపరిమితం బగుపుణ్యస్థానమున మరణించువారికి మోక్షంబు లభించును. గంగాసహితంబగు హిమాలయమునందును, కేదారంబునందును సుప్రతిష్ఠితుండనై యున్న నన్ను సేవించువారికి గాణపత్యలాభంబును మోక్షప్రాప్తియు నగును. గాణపత్యప్రాప్తియే ముక్తి. గాణపత్యప్రాప్తిచే ముక్తి లభియించును గావున కేదారము ముక్తికారణం బయ్యెను.

## —♦ నందీశ్వరచరిత్రము. ♦—

ధర్మాత్ముండును, వీర్యవంతుండు నగుశిలాదుం డనునొకఋషి యుండెను. అతఁడు శిలవృత్తిచే జీవించుచుండెను. ఒకప్పు డాతఁడు శివలోకమునకుఁ బోయి వచ్చుచు మార్గమధ్యమున భయంకరనరకము పై వ్రేలాడుచున్నతనపితృదేవతలం గాంచెను. వారందఱును శిలాదుం గాంచి, వత్సా! సంతతివిచ్ఛేదంబువలన నరకపతనంబు గలుగును. కావున నీవు పుత్రలాభంబుకొఱకు దేవాదిదేవుండును, అవ్యయుండు నగుమహాదేవు నారాధింపుము. మమ్ములను దరింపఁజేయు సమర్థుం

డగుచున్నదేవుండు నీకుఁ బుత్రలాభమును బ్రసాదింపఁగలఁడు. అని బోధించుటయు శిలాదుండు మహాదేవు నుద్దేశించి వేయిసంవత్సరంబులు తపంబు గావించెను. అంతఁ ద్రిశూలధారియగు దేవుండు ప్రసన్నుండై యోమునిసత్తమా! నేను నీతపంబునకు మెచ్చి నీకు వరప్రదానము గావించుటకై వచ్చితి నని యానతిచ్చెను. శిలాదుం డట్లుసాక్షాత్కరించిన మహాదేవుని దర్శించి సాష్టాంగప్రణామంబు గావించి హర్షగద్గద స్వరంబున నిట్లు వినుతింపందొడంగెను.

పరాత్పరా! మహాత్మా! మహేశ్వరా! నీవు సురశ్రేష్ఠుండవు. బ్రహ్మాదులకుఁ బ్రభుండవు. కామాంగనాశకుండవు. కైలాసనివాసుండవు. ధ్యానగమ్యుండవు. విధాతవు. సకలదేవతలకును, ఋషులకును బ్రభుండవు. వేదనాథుండవు. యోగిగణేశ్వరుండవు. ప్రధానుండవు. పరమతత్త్వస్వరూపుండవు. భక్తాభీష్టదాయకుండవును, సర్వవ్యాపకుండవును, సృష్టికర్తవు, జగత్పతివి, ప్రకృతీశ్వరుండవు నగునీకు నమస్కారము. ఈశ్వరుండవును, యోగగమ్యుండవును, జన్మమృత్యువినాశకుండవును, వరదాతవు నగునీకు వందనములు. భస్మాంగరాగుఁడవు, యోగమూర్తివి, తేజఃపతివి, సూర్యచంద్రాగ్నినేత్రుఁడవు, బాలశశాంకభూషణుఁడవు, నిత్యుండవు, త్రిభువనవిధాతవు నగునీకు నమస్కారము. జగదుత్పత్తిప్రళయంబులకుఁ గారణుండ వగుటచే నీవు సర్వజీవస్తవనీయుండవు. మావంటిదీనులకు శరణ్యుండవు. ఓవిశ్వకర్తా! నీవు నాయెడలఁ బ్రసన్నుండవై వరప్రదానంబు గావింపుము.

అని శిలాదమునీంద్రుం డనేకవిధంబులఁ బ్రార్థించుటయు, దేవదేవుం డగుత్రిలోచనుండు మునిశ్రేష్ఠుం డగు నాతనిం గాంచి యోఋషివరా! నేను వరదాతను. భక్తితో నీవుగావించిన యీస్తోత్రమును బ్రాతఃకాలమున శుచియై నిర్మలచిత్తంబున బఠియించువారు భూత

పిశాచరాక్షసపన్నగాదిబాధలనుండి విముక్తు లగుదురు. పూతనాగణం
బువలన వారికెట్టియనిష్టంబులును గలుగవు. అని యానతిచ్చి నీయభీ
ష్టంబు నెఱింగింపు మనుటయు శిలాదుండు మహాదేవున కిట్లనియెను.
మహాత్మా! నీవు నాయెడల ననుగ్రహించి నాకు వరప్రదానంబు
గావింప నిచ్ఛగింతువేని నీవలె నమరుండును, నయోనిజుండు నగునొక
పుత్రుని నాకుఁ బ్రసాదింపు మనికోరెను. మహాదేవుండును బ్రీతుండై
యట్లే యగుఁగాక యని వరంబిచ్చి యంతర్హితుం డయ్యెను. అనంత
రము పరమపూజ్యుం డగునమ్మహర్షికులతిలకుండు తనయాశ్రమంబు
నకు వచ్చి యచ్చటిమునీంద్రులకు సకలవృత్తాంతమును నివేదించి వారి
చేఁ బ్రస్తుతుం డయ్యెను.

ఇట్లు కొంతకాలము జరగినపిమ్మట శిలాదుం డొకప్పుడు యజ్ఞ
భూమిని దున్నించుచుండఁగా లాంగలమార్గమునందు సూర్యాగ్నిసదృ
శతేజోమయుం డగునొకకుమారుం డాతనికి దృష్టిగోచరుం డయ్యెను.
ఆకస్మికముగ నాబాలకునిం గాంచి యది రాక్షసమాయ యనుభయం
బుచే శిలాదుం డక్కుమారుని సమీపింపఁజాలక దూరముగఁ దొలఁగి
యుండెను. అప్పుడు తేజోనిధానుండగు నాబాలకుండు తండ్రీ యని
పిలుచుచు దీనభావముతో శిలాదుని సన్నిధి కేతెంచెను. కాని శిలా
దుఁడు భయసంశయములపాలై యాదారకు నభినందింపఁజాలకపోయె
ను. అప్పు డాకాశమునుండి వాయుదేవుండు “ఓసాలంకాయనా!
ఈతఁ డయోనిజుం డగునీపుత్రుఁడు. పరమేశ్వరుఁడు పూర్వము నీకు
వరమిచ్చెనుగదా! నీవిక్కుమారుం గైకొని యుపలాలింపుము. నీకుఁ
బరమానందకరుం డగుటచే నిక్కుమారుండు నందినామంబున విఖ్యా
తుండు గాఁగలఁడు” అని తెలుపుటయు శిలాదమునీంద్రుండు మహా
నందముతోఁ బుత్రు నాలింగనంబు గావించుకొని సంతోషముతోఁ

దనయాశ్రమంబునకుఁ దీసికొనిపోయెను. క్రమముగా నిష్కాముం డగు సుకు-
మారునకుఁ జూడోపనయనాదికర్మంబులఁ గావించి సద్యఃప్రాణంబు
గా వేదచతుష్టయంబును, ఆయుర్వేదంబును, ధనుర్వేదంబును, గాంధ
ర్వశాస్త్రంబును, శిల్పవిద్యయు, శకునవిద్యయు, భూతచికిత్సయు, మా
తృచరితంబును, భుజంగచరితంబును, సకలధర్మశాస్త్రంబులును, అష్ట
విధవ్యాకరణంబులును, పురాణములును, ఇతిహాసములును, పంచయ
జ్ఞంబులును, జ్యోతిశ్శాస్త్రంబును, మాతృతత్త్వంబును, మంత్రిశా
స్త్రంబును, యోగశాస్త్రమునుగూడ నధ్యయనంబు సేయించెను. ఆ
బాలకుం డీసమస్తవిద్యలను బంచదివసంబులలో నభ్యసించి ముగించె
ను. తేజస్సంపన్నుం డగుసుకుమారుండు కార్యదక్షుండును, సవిత్రా
త్ముండును, ప్రసన్నహృదయుండును, ప్రియవాదియు, అహింసావ్రతుం
డును, సకలహృదయనయనానందకరుండు నై విరాజిల్లుచుండెను.

ఆబాలకున కేడుసంవత్సరములవయసు వచ్చినసమయమునం
దొకనాఁడు శిలాదునియాశ్రమంబునకు మహాతేజోనిధు లగునిరువురు
తాపసులు విచ్చేసిరి. శిలాదమునీంద్రుండు వారిని యథోచితంబుగఁ
బూజించి వారి యాసతిం గాంచి సుఖోపవిష్టుండై యోగబలసమన్వి
తులును, సర్వజీవాభిజ్ఞులు నగుమిత్రావరుణు లనునాయిరువురుమును
లను ననేకవిధంబుల వినుతించుటయు వారు శిలాదుం గాంచి "మునీం
ద్రా! నీకుమారుండు నీకు సంతుష్టిం గూర్చుచుండెనుగద? అతఁడు ధా
ర్మికుఁడును, స్వాధ్యాయతత్పరుండునై మెలంగుచుండెనా? ప్రియవచ
నంబులచే నాతఁడెల్లర నానందింపఁజేయునా?" అని ప్రశ్నించుటయుఁ
బుత్రివత్సలుం డగుశిలాదుండు "మునివరులారా! సద్గుణసంపన్నుఁ
డగునిక్కుమారుండు నావంశవర్ధనుఁడై యున్నాఁడు" అని చెప్పుచు
నవినశ్వరుండు, ననిందితుండు నగునిసపుత్రిచే వారిపాదములకు

సాష్టాంగప్రణామము చేయించెను. అప్పు డమ్మునికులతిలకు లిరువురు నేకవాక్యముగా ‘‘నీకుధర్మవృద్ధి యగుఁగాక! నీవు గురుసేవారతుండ వయ్యెదవుగాక! సకలలోకములు నక్షయంబు లగుఁగాక’’ అని యాశీర్వదించిరి.

శిలాదుండు వారియాశీర్వాదము నుపలక్షించి కుమారుం డగు నందిని లేవఁదీసి యమ్మునులం గాంచి మహాత్ములారా! మీరు తపస్సిద్ధు లగుసత్యవాదులు. సకలజీవగతులును మీకు సువిదితంబులు. అట్టిమీరు నాకుమారుని దీర్ఘాయురుక్తునిగా నేల యాశీర్వదింపకైతిరి? అని ప్రశ్నించుటయు మిత్రావరుణు లోమునీంద్రా! నీపుత్త్రునిపరమాయు వష్టవర్షంబులుమాత్రమే. అష్టమవర్షమునం దీతఁడు మృతుం డగు నని చెప్పిరి. ఆమాట విని శిలాదుండు శోకాకులితహృదయుండై యమ్మునివరుల నంపించి యేకాకియై విలపింప నారంభించెను. జనకుని దుఃఖస్వరము నాలకించి పుత్త్రుం డాతనిచెంతకు వచ్చి తండ్రీ! మీ రేల దుఃఖకుపితు లగుచున్నారు? మీయీదుఃఖమునకుఁ గారణమేమో యానతీయవలయు నని ప్రార్థించెను. అప్పుడు శిలాదుండు కుమారా! నీవు సంవత్సరములోపల మరణింతు వని సత్యవాదు లగుమునులు చెప్పి యున్నారు. ఇంతకంటెను దుఃఖకారణ మింక నాకేమున్నది? అనుటయు నందీశ్వరుండు తండ్రీ! ఎంతప్రయత్నించినను దేవతలుగాని, దానవులుగాని, యముండుగాని నాకు మృత్యువును గల్పింపఁజాలరు. అందుకై మీరూరక దుఃఖింపవల దని యూఱడించెను. అంత శిలాదుండు కుమారుం గౌఁగిలించుకొని తండ్రీ! నీవేతపంబుచే నేయోగముచే, నేవిద్యాలాభము నెవ్వని నాశ్రయించి దారుణమృత్యువదనమునుండి విడివడఁగలవు? నాకేమియుం దోఁచుట లేదని విచారింపఁ దొడంగెను. నందీశ్వరుం డప్పుడు మృదుమధురస్వరముతో తండ్రీ!

ఎట్టివిద్యలైనను, దపంబులైనను మృత్యువును దప్పింపఁజాలవు. కేవలము మహాదేవానుగ్రహముచేతనే మృత్యుదేవతను జయింపవలయును. ఈవిషయంబునఁ బినాకియగు మహాదేవునియనుగ్రహంబుదక్క నన్యోపాయంబులేదు. నేనమ్మహాదేవుని బ్రసన్నుంగావించుకొని యాతని దయవలన మృత్యువును జయింతు నని చెప్పుటయు శిలాదుండు పుత్రా! నేను వేయివత్సరంబులు తపంబు గావించి మహాదేవునిసాక్షాత్కారముం గాంచి యాతనికృపచే నిన్నుఁ బుత్రునిగాఁ బడయఁగలిగితిని. నీవొక్కసంవత్సరములో నద్దేవునెట్లు ప్రసన్నుం గావించుకొనఁగలుగుదువు? అట్టిసామర్థ్యము నీకేతపంబుచే లభించును? ఏయుపాయముచే నీవిమృత్యువును జయింతువో నాకుఁ దోఁచుట లేదనియెను.

అప్పుడు నందీశ్వరుండు నాయనా! తపంబులచేఁగాని విద్యలచేఁగాని పరమేశ్వరసాక్షాత్కారము దుర్లభమైనది. విశుద్ధచిత్తంబున భక్తిమూలముననే యాతని దర్శింపవలయును. ఆతనిం బ్రసన్నునిగాఁ జేసికొనునుపాయము నేనెఱుంగుదును. నేనిప్పుడు మీకడ సెలవుగైకొని యచిరకాలముననే యమ్మహాదేవునిసన్నిధికిఁ బోయెదను. ఈవిషయమున మీరెంతమాత్రమును సంశయింపవలదు. సంపూర్ణముగఁ గృతకృత్యుఁడై వచ్చినమీకుమారుని మీరచిరకాలముననే చూచి యానందింపఁగలరు. నాకిఁక నెంతమాత్రమును జననమరణంబులు లేవు. నాకెవ్వరు ననిష్టముం గూర్పఁజాలరు. నాకెట్టిసమయములందైనను మృత్యువు గలుగదను దృఢసంకల్పముతో మీరు నాకు సెలవొసగుఁడు. సహస్రమృత్యుదేవతలును, శతకోటియములునుగూడ నాయుధధారులై యతిక్రోధముతో ముట్టడించినను నన్నేమియుఁ జేయఁజాలరు. కావున మీరెంతమాత్రమును భయపడవలదు. వారు నాకెంతమాత్రమున్ కకైన నపాయముం గల్పింపఁజాలరు. విశుద్ధచిత్తముతో జలంబులయం

దుపవసించి శతరుద్రీయమును జపించుచు మృత్యుంజయుం డను, వర
దాతయు నగుమహాదేవుని బ్రసన్నుం గావించుకొందును. నేను యో
గము నవలంబించి జపంబు సేయుచు రుద్రభావరతుండనై యున్నప్పుడు
మృత్యువుగాని, కాలుఁడుగాని, యముఁడుగాని యెవ్వరును నాకనిష్ట
ముం గూర్చుటకు సమర్థులు గాఁజాలరు. అని ధైర్యము చెప్పెను.

విశుద్ధంబులును, మధురంబులును, శాంతిదాయకంబులు నగు
కుమారునివచనంబుల నాలకించి యదీయుండును, మహాతపుండు నగు
శిలాదుం డతికష్టముతోఁ గుమారునకు సెలవొసంగుటయు మహాశ
యుండగు నందీశ్వరుం డవనతమస్తకుండై తండ్రిచరణంబులకుఁ బ్రి
ణామంబు గావించి ప్రదక్షిణంబు సేసి ప్రయాణమై సకలార్తిహరుం
డగుమహాదేవుని నిశ్చలచిత్తంబున ధ్యానంబు గావించుచు బయలుదే
ఱిపోయెను.

## నందీశ్వరునితపశ్చరణము.

నందీశ్వరుం డిల్లువెడలి పోయి లోకవిఖ్యాతంబును, సర్వజీవ
నసుఖదాయకంబును నగుభువనాసదిం జేరి యందుఁ బ్రవేశించి జలని
మగ్నుండై యేకాగ్రచిత్తంబునఁ బరమకారుణుండగురుద్రుని ధ్యానిం
చుచు శతరుద్రీయమును జపింపనారంభించెను. అతఁడిట్లు కోటిజపం
బు గావించునప్పటికి జటాజూటధారి యగుమహాదేవుండు సంతుష్టుండై
యాతనికి సాక్షాత్కరించి నందీశ్వరా! నీయెడలఁ బ్రిసన్నుండనైతిని.
నీకు శుభంబగుఁగాక! నీయిచ్చవచ్చినవరంబును గోరుకొనుమనియెను.
నందీశ్వరుం డప్పుడు ప్రణతుండై పరమకారుణా! నేనింకను నొకకోటి
జపంబు సేయవలయునని కుతూహలపడుచున్నాను. అని చెప్పెను. ఈ
శ్వరుం డట్లయగుఁగాక యని యంతర్ధానుం డయ్యెను. నందీశ్వరుండు
మరలనీశ్వరధ్యాననిమగ్నుండై కోటిజపంబు గావింపనారంభించెను. ఆ

జపము పూర్తి యగునప్పటికి దేవదేవుండు మరల సాక్షాత్కరించి వత్సా! నేను నీకువరప్రదానంబు చేయవచ్చితి ననియెను. నందీశ్వరుండు మూఁడవకోటికూడఁ బూర్తియగువఱకు జపంబు సేయనిమ్మనికోరెను. శివుం డట్లేయని దేవీసహితుఁడై యంతర్హితుం డయ్యెను. నంది మూఁడవకోటిజపంబు గావించి యుగాంతసూర్యునివలెఁ దేజోమూర్తి యయ్యెను. ఆతనిదేహము జ్ఞానముచే జాజ్వల్యమాన మగుచుండెను.

మహాదేవుం డప్పుడు సకలభూతగణసహితుండై సాక్షాత్కరించి తనకరంబులచే నాతనిం గ్రహించి శిరంబును బైకెత్తి దక్షిణహస్తముచే నాతని స్పృశించుచు, ఓశిలాదతనయా! నీతపంబునకు నేను సంతుష్టుండనైతిని. వరంబు గోరుకొనుము. ఓధీమంతా ! నీవుత్తమజపంబు గావించితివి. నీయుద్దేశమేమో తెలుపుము. అనుటయు, నందీశ్వరుండు, ప్రభూ! నీవు నాయెడలఁ బ్రీతుండ వైతివేని నన్నింకను జపంబుఁ జేసికొననిమ్మనియెను. అప్పుడు, మహాదేవుండు, కుమారా! నీకిఁక జపంబుతోఁ బ్రయోజనంబు లేదు. నాకు సంపూర్ణముగ సంతృప్తి గలిగినది. నీవేమికోరిన దానిని బ్రసాదించెదను. బ్రహ్మవిష్ణులోకంబుల నభిలషించినను, రుద్రాదిత్యరూపంబుల వాంఛించినను, మోక్షము నపేక్షించినను నిశ్చయముగా నీమనోరథము సిద్ధింపఁగలదు. అని హెచ్చరించుటయు నందీశ్వరుండు శివచరణంబులకుఁ బ్రణతుండై జరాశోకనిహంత యగుపరమేశ్వరు నిట్లు వినుతింప నారంభించెను.

ఓదేవాదిదేవా! మహాదేవా! త్రైలోక్యసంహారా! హరా! నీకు నమస్కారము. దేవా! నీవు కామాంగనాశకుఁడవు; ఉగ్రదండధారివి; కాలశాసకుఁడవు; సహస్రమస్తకుఁడవు; సహస్రకరుఁడవు ; సహస్రచరణుఁడవు; నీపాణిపాదంబులును, నయనవదనంబులును, శ్రవణంబులును,

సర్వతోముఖంబులై యున్నవి; నీవు సర్వవ్యాపకుఁడవు. అతీంద్రియా! కపర్ది! సూర్యచంద్రులు నీనేత్రములు. నీవు యోగీశ్వరుఁడవు. పినాకశూలముద్గరధరుండ వగునిన్నెవ్వరును జయింపఁజాలరు. పరశుదండగదాఖడ్గమహాధనుర్ధారి వగునీకు నమస్కారము. రుద్రుండవగునీవు దేవతాదుల కధీశ్వరుండవు. సహస్రచక్షుండవు, సహస్రబాహుండవు నగునీకు వందనములు. నీవాదిత్యవసుప్రముఖులకుఁ బ్రభుండవు. సర్వలోకమహాలోకేశ్వరుండ వగునీకుఁ బ్రణామంబులు. యోగగమ్యుఁడవు, యోగప్రియుఁడవు, ధ్యానశీలుఁడవు, ధ్యేయుఁడవు, ధ్యానపరాయణులచేఁ బ్రస్తుతుండవు నగు నీకు జోహారు. మృత్యువును, కాలదండంబును, యముండును నీస్వరూపములు. దేవదేవా! నీవు దివ్యశరీరధారివై విరాజిల్లుచుందువు. నీవు దానసహితయజ్ఞస్వరూపుఁడవు. స్వర్గజన్మప్రదాయకుఁడవు. బహుజన్మప్రదాయకుఁడవు. బహునేత్రుఁడవు; ధర్మమూర్తివి; దేవతారక్షకుఁడవు; మోక్షస్వరూపుఁడవు; ఉమారుద్రనారాయణస్వరూపుఁడవు. బ్రహ్మశిరంబునకును, ఇంద్రయజ్ఞంబునకును బరిపంథి వగునీకు నమస్కారము. త్రిపురహంతయు, ఉగ్రచరుండును, సర్వాశుభహరుండును, లలాటాంకితనేత్రుండును, ఊర్ధ్వలోకోత్పాదకుండును, యమహంతయు, బ్రహ్మగురుండును, కార్తికేయజనకుండును, వరదాతయు నగునీకు వందనము. హలధరుండవు, ముసలధారివి; మహాహాసుండవు, మృత్యుపాశోగ్రహస్తుఁడవు, నక్షత్రలోకాధారుఁడవు, మందాకినీధరుండవు, వృషభవాహనుఁడవు, హిమాలయ వింధ్య సుమేరు కైలాసగిరినివాసుఁడవు, విష్ణుదేహార్ధసంస్థితుండవు, విష్ణువరదాతవు నగునీకు నమస్కారము. ఓసర్వభూతస్వరూపా! చైతన్యమూర్తీ! నీవు సకలభూతదయాపరుఁడవు. సకలభూతాంతర్నివాసుఁడవు. సకలజీవస్వరూపుఁడవు. వాక్యమూర్తివి, వక్తవు, సూక్ష్మశరీరుఁడవు నగు

నీకు నమస్కారము. పశుపతియు, ఆత్మయు, విటంకుండును, విష్ణుండును, [illegible]యు, [illegible]యు, [illegible]రూపుఁడును, సప్తర్షిస్వరూపుఁడు ను, [illegible], [illegible]దాయకుండును, విశుద్ధబ్రాహ్మణస్వరూ పుఁడు [illegible]గు నీకు నమస్కారము. దేవా! నీవు శిల్పివి, శిల్పనాశకుఁడవు, విశ్వకర్మవు. విద్వాంసుఁడవు. సాధుమూర్తివి. ధర్మమూర్తివి. భూత మూర్తివి. భూతనాథుఁడవు. పిశాచపతివి. స్థావరజంగమస్వరూపుఁడ వు. గాయకుఁడవు. నర్తకుఁడవు. అవశ్యుఁడవు. అవధ్యుఁడవు. నీకుఁ జరామరణంబులు లేవు. క్షయవృద్ధులు లేవు. నీవప్రతిహతుండవు. అనాథనాథుఁడవు. పుణ్యమూర్తివి. సూక్ష్మాతిసూక్ష్ముండవు. సర్వ గతుండవు. ఓమహాత్మా! త్రిలోచనా! పరమేశ్వరా! సర్వలోకేశ్వ రా! సర్వజనకా! విశ్వనాథా! బ్రహ్మస్వరూపా! నీకు నమస్కా రము.

దేవా! నేను విష్ణుపదమును గాని, దేవపదమును గాని, ఇంద్ర పదమును గాని వాంఛించుట లేదు. భవనివృత్తి నపేక్షించుచున్నా ను. నిత్యమును నీశరణము నభిలషించుచున్న నాయెడల నీవు ప్రస న్నుండవై నీదివ్యమూర్తిని సాక్షాత్కరింపఁజేయుము. నీవు మాపూర్వ గతివి. నాకుఁ బరమాశ్రయుఁడవు. నీ వెవ్వనిఁ బరిత్యజింతువో వానికిఁ దప్పక మృత్యు వగును. నీసేవకంటె నాకుఁ బరమోపాయంబు లేదు. అదియే నాకుఁ బరమసుఖకరమైనది. దుస్తరం బగు నీసంసారమునందు నేను నీయందనురక్తుఁడను, భక్తుఁడను నై మెలంగునట్లనుగ్రహింపుము. మహాదేవా! ఇదియే నాప్రార్థనము.

## — నందీశ్వరోత్పత్తి. —

ఇట్లు పరమభక్తిసంపన్నుండును, దీనభావావాసన్నుండునై సా [illegible]ప్రణయంబులతోఁ జరణసన్నిధానమునఁ బ్రణతుఁడై పడియున్నసం

దీశ్వరు సమ్మహాదేవుండు నిజకరకమలంబులతో లేవనెత్తి యాతనిమొగంబును దువుచుచు మృదుమధురస్వరంబునఁ గుమారా! నీకు భయములేదు. భయము లేదు. నాయనుగ్రహంబుచే నీవు జన్మమృత్యుజరావిరహితుండ వైతివి. వత్సా! నీనిర్మలభక్తిని నేను గ్రహించితిని. నీవు నీజననితోడను, బాంధవులతోడను జననమరణాదిదుఃఖవిహీనుండవై శివలోకగమనంబు గావింపుము. నీవు మత్సమానబలపరాక్రమసంపన్నుండవై నాకుఁ బ్రధానగణనాయకుండవై సర్వదా నాపార్శ్వమునం దుండి యోగబలసంపన్నుండవై మత్సదృశంబగురూపముతో విహరింపఁగలవు. మహైశ్వర్యసమంచితంబు లగుస్వీపంబులచే విలసిల్లు క్షీరసాగరమును నీకుఁ బ్రసాదించితిని. నీవాప్రదేశమున నివసించియుండుము. అని యనుగ్రహించుచు స్వయంభువగుమహాదేవుండు సుందరంబగుసురభికమలమాలికను, దేవస్వరూపుఁ డగునందీశ్వరునకుఁ బ్రసాదించెను. ఆకమలకుసుమదామమును గంఠమునఁ దాల్చినంతనే పరమతేజోమయుండగునందీశ్వరుండు త్రినేత్రుండును, దశభుజుండును, సుందరశ్రీసంపన్నుండునై రెండవశంకరునింబోలి ప్రకాశించుచుండెను.

అప్పుడు భగవానుం డగుశంకరుం డాతని దనకరంబులతో గ్రహించి సమాదరపూర్వకంబుగా, కుమారా! నీకేమికావలయునో కోరుకొనుము. నీవు సముత్కటంబుగాఁ దపంబు సేసినయియ్యాశ్రమము జాప్యేశ్వరనామంబునఁ బ్రసిద్ధమై యతిపవిత్రంబు గాఁగలదు. ఇది చతుర్దిశల నేకయోజనపర్యంతము మోక్షప్రదంబగును. ఇందప్సరోగణంబులును, సిద్ధచారణులును నివసించి యుందురు. ఈసిద్ధక్షేత్ర మతిగోప్యమైనది. మనోవాక్కర్మంబులచే మానవులుగావించినశుభాశుభకర్మంబు లిందు భస్మీభూతంబులై పోవును. ఇందు జపంబు గావించువాఁడు శివసముం డగును. ఈక్షేత్రమున మరణించువాఁడు శివలోక

ముం జేరును. అని ప్రశంసించుచు నానందమయుండగు, మహాత్ముం
డు నగుమహాదేవుండు హరనిర్మలంబగుజపసలిలము సఫమంత్రింబు
గావించి విసర్జించెను. అప్పు డాదివ్యోదకము పుణ్యంబును, గర్వితుల
కశుభదాయకంబును, హంసకారండవచక్రవాకాదిజలవిహంగశోభితం
బును నగుమహానదీరూపంబును గాంచెను. తోడనే యాదివ్యనది క
మలదళసుందరవిలోచన యగుస్త్రీమూర్తిం దాల్చి బద్ధాంజలియై యవ
నతమస్తకంబుతో మహాదేవు నెదుటం నిలువంబడియెను.

అప్పు డీశ్వరుం డాపుణ్యవాహినినుద్దేశించి యోశుభాననా! నీజ
లంబులు యజ్ఞోద్భూతంబులు, గావున నీకు యజ్ఞోదకినామంబు సుప్ర
సిద్ధం బగుంగాక! శుచియై నియమంబున నీయం దవగాహన మాచరిం
చువాని కశ్వమేధసమఫలంబులభింపఁగలదు. అట్టివాఁడు రుద్రలోక
పూజితుం డగును. అని యనుగ్రహించి మహాదేవుం డప్పుడు నందీ
శ్వరుని, దేవియగుపార్వతి చరణకమలంబులకుఁ బ్రణతుంగావించి యో
ప్రియా! నీవిక్కుమారునియెడలఁ బుత్రవాత్సల్యముం జూపుమని వచి
యించెను. అద్దేవియు నక్కుమారునిమూర్ధాఘ్రాణంబు గావించి కర
కమలంబుచే నాతనిశరీరమును స్పృశించుచుఁ బుత్రస్నేహంబుచేఁ గలి
గిన స్తన్యధారలచే నాతనినభిషిక్తుం గావించుచుండెను. అప్పు డామె
శ్రోత్రములనుండి మూఁడునాళలతో నొకనది యుత్పన్నం బయ్యెను.
అందుచే దానిని త్రిస్రోత యను నామంబు గలిగెను. నందీశ్వరుం
డాపుణ్యవాహినిం గాంచి పరమానందముతో మహాధ్వానంబు గావిం
చెను. ఆమహానాదమునుండి యొకదివ్యనది యుదయించుటయు మహా
దేవుండు మహాహర్షంబున నందీశ్వరునకు సువర్ణమయకిరీటంబును,నమృ
తసంభవంబు లగుకుండలంబులును బ్రసాదించి ప్రభాకరునివలె నప్రమే
యతేజోనిధియగు నాతనిని రాజ్యాభిషిక్తుం గావించుటయు నక్కుమా

రుండు మరల నధికోచ్చస్వరంబున మహానాదముం గావించెను. అప్పు
డయ్యభిషేకపుణ్యోదకంబు వాహినీరూపముం గాంచుటయు మహాదే
వుం డిది సువర్ణకిరీటమునుండి ప్రవాహితంబయ్యెనుగావున సువర్ణా
నామంబునను, జాంబూనదకిరీటపరివృత్తంబుగావున జాంబూనదీనామం
బునను విరాజిల్లఁగలదని యానతిచ్చెను. దానిని దర్శించి యటఁ ద్రి
రాత్రోపవాసంబు గావించి యందవగాహనంబు సేసి మహాదేవు నర్చిం
చి బ్రాహ్మణసమారాధనముం గావించువారు నంద్యనుచరులై క్షీరో
దకంబున నిత్యనివాసంబు గాంచఁగలరు. వారు నందీశ్వరతుల్యులై
శాశ్వతులు నక్షయులును గాఁగలరని మహాదేవుం డానతిచ్చినందీశ్వ
రుం గాంచి వత్సా! నీకుఁ బ్రియులగువారు నాకుఁ బ్రియపాత్రులగు
దురు. ఈజాప్యేశ్వరమునందును, బంచనదంబునందును దేహత్యాగ
ముం గావించువారు మద్గణపతులై నీవలెనే రమణీయమూర్తు లగుదు
రని యానతిచ్చెను.

## నందీశ్వరాభిషేకసంకల్పము

పిమ్మట మహాదేవుండు నందీశ్వరు నలంకరించి యభిషిక్తుం గా
వించి దేవిం గాంచి యోమంగళదాయినీ! నేనీనందీశ్వరునకు గాణప
త్యప్రదానముం గావింపఁదలఁచితిని. నీయుద్దేశ మేమని ప్రశ్నించుట
యుఁ బార్వతీదేవి నాథా! ఈతఁడు మీతనయుఁడు. సప్తలోకంబుల
కును, సకలగణాధ్యక్షులకునుగూడఁ బ్రభుత్వం బీకుమారునకుఁ బ్రసా
దింపవచ్చు ననియెను. అనంతర మమ్మహాదేవుండు సిద్ధసురప్రమథ
గణపరివృతుండై పూర్వాభిముఖంబుగఁ గూర్చుండి నిజానుచరులును,
దిగంబరులు నగురుద్రగణంబులను స్మరింప నారంభించెను. అట్లు తలం
చినంతనే గణాధ్యక్షు లెల్లరును బ్రహృష్టహృదయములతో దశదిశల
నుండియు శివసన్నిధానమునకుఁ జేరుకొనఁదొడంగిరి. అందు శూల

ధరులును, నిషంగధరులును, నీలకంఠులును, కృష్ణగ్రీవులును, విశుద్ధో జ్జ్వలనయనులును, బర్హిణాంగదావరణులును, కపాలహస్తులును, శతనే త్రులును, వాయువేగులును, శతపాదులును, శతాననులును, సర్వలో కేశ్వరులు నగుగణనాయకులు ముందుగ నేతెంచిరి. అనంతరము కరా ళవదనుండును, భ్రుకుటీభూషితముఖుండును, పంచయోజనదీర్ఘవిస్తీ ర్ణుండును, చతుర్ముఖుండును, శుక్లవర్ణుండును, పంచజిహ్వుండును, ఊర్ధ్వకర్ణుండును, పాశహస్తుండును, మనోవేగుండు నగుభవభూతినామక గణాధ్యక్షుండు నిజతుల్యపరాక్రములగు భూతగణశతంబులచేఁ బరివృ తుండై చనుదెంచెను. మఱియు మహాయోగబలుండును, ఖడ్గధరుం డును, ధ్యానయోగపరాయణుండు నగుసోమవర్ణుం డనుగణపతి తనతో సమానులగు కోటిమందియధికులతో శివునిచెంత కరుదెంచెను. పిమ్మట సురాసురపూజితుండును, యుగాంతానలసదృశుండును, శూలధారియు, నర్ధచంద్రాలంకృతుఁడును, చతుర్భుజుండును, రక్తవర్ణుండు నగునంబా శివుండను శివపార్షదుం డేకపాదులును, మహాకాయులు నగుశతకోటి శూలపాణిగణంబులతో విచ్చేసెను. తరువాత విశాలోదరుండును, సహస్రపాణిపాదనయనుండును, విస్తృతవదనుండును, మహాఫణిభూష ణుండును, త్రిలోచనుండును, చంద్రావతంసుండును, ముండమాలా లకృతుండును, బ్రీసస్కుంతలుండును, హ్రస్వపాదుండును, శుచియు నగు హరనామకగణాధిపతి యాత్మతుల్యులగుకోటిగణంబులతో నేఁగు దెంచెను. ఆవెనుకఁ జతుర్వేదనుండును, జతుర్వింశతిలక్షణంబులచే మహాతేజస్సంపన్నుండును, మహాబలశాలియు, వరదాతయు నగుసోమ నామక గణనాథుండును, నావెనుక సహస్రబాహుండును, విశాలకరాళ వదనుఁడును, శంఖకర్ణుఁడును, శతపదుండును, కృశోదరుండును, విద్యు త్కేశుండు నగునూర్ధ్వవాహనుండను గణపతియు, నాతనిపిమ్మటఁ బ్ర

శస్తవదనుండును, ఉభయతోగతియు, నజేయుండును బ్రిముఖగణకోటి పరివృతుండు నగు నజైకపాదుం డనుగణప్రభుండును, వానియనంతరము సర్వతోముఖుండును, సర్వతఃకరచరణుండును, మహాబలుండు నగు నొకగణనాయకుండును విచ్చేసిరి. హ్రస్వబాహుండును, అశనిధరుండును నగునపాదుం డనుగణేశ్వరుం డష్టోత్తరశతకోటిగణసహితుండై యేంగుదెంచెను. చంద్రమౌళియు, పుష్పమాలాలంకృతుండును, సహస్రహస్తుండును, జక్రిదండధరుండును, శంఖవర్ణుండును నగునికుంభుం డను గణశ్రేష్ఠుం డరుగుదెంచెను. సర్పమాలాలంకృతుండును, మహాదేవుని కతిప్రియుండు నగు సూర్యాస్యాయనుండును, సర్వజ్ఞుండగు మహాతేజుండును, షట్సహస్రకోటిగణంబులతో మహాతేజుండును, చంద్రాయుధధారియు, చక్రహస్తుండు నగుకటాకటుండును, కోటిగణంబులతో మహాబలుండగు శంఖకర్ణుండును, పదిమందిగణపతులతో నందితుండును, అష్టగణంబులతోఁ బిశంగాక్షుండును, చతుష్షష్టిశతకోటిగణంబులతో వినాయకుండును, షట్ఛతకోటిగణంబులతో సువర్ణవర్ణుండు, నేకపాదుండు నగు కూష్మాండుండును, ద్వాదశశతకోటిగణంబులతో ధూమ్రకేశుండును, దశశతకోటిగణంబులతోఁ బతాకియు, పంచశతకోటిగణంబులతో శతముఖుండును, షట్ఛతకోటిగణంబులతో సహస్రశీర్షుండును, దశశతకోటిగణంబులతో వీరుండును, అష్టకోటిగణంబులతోఁ గుంభకర్ణుండును, సహస్రకోటిగణంబులతో విశ్వబలుండును, శతకోటిగణంబులతో మనువును, అష్టకోటిగణంబులతో నశనినాదుండును, సప్తకోటిగణంబులతోఁ జంద్రవక్త్రుండును, సహస్రకోటిగణంబులతో మహీంధరుండును, కోటిగణంబులతోఁ బ్రణవాదిత్యుండును, శతకోటిగణంబులతో సంతోషుండును, అష్టకోటిగణంబులతోఁ గరుడుండును, పంచదశకోటిగణంబులతోఁ గుంభుండును, కోటిభూతగణంబులతో నమోఘుండు

ను, అష్టమేఘుండును, భూతికుండును, అష్టషష్టికోటిగణంబులతో నేకపాదుండును, సప్తశిరుండును, దశకోటిగణంబులతో మహాబలాపస్మారులును, సప్తతికోటిగణంబులతో నీలోద్భవ, దేవేశ, కణ్వభద్రి, వికృతులును విచ్చేసిరి. ఈవిధముగా వింశతిశతసహస్రకోటిగణంబులతోఁ జతుర్దిశలనుండియు గణాధ్యక్షు లెల్లరును వచ్చి చేరుకొనుచుండిరి.

కోటిసహస్రభూతంబులతోడను, గోటిప్రమథగణంబులతోడను వీరభద్రుఁడు వచ్చెను. మఱియు నవకోటిభూతగణంబులతో మేఘసౌదామనియు, వింశతికోటిగణంబులతోఁ బ్రభాకరుండును, విద్యుత్తును వచ్చిరి. మృత్యువు, యముఁడు, కాలుఁడు, విషధరుఁడు, శతమాయుఁడు, పర్వతాభరణుఁడు, ఏకశృంగుఁడు, మహాబలుఁడగు భృంగిరిటి మొదలగు గణనాథులు హర్షాన్వితులై ముఖ్యవాద్యములను బ్రయోగించుచుండిరి. అందఱును రథములు, గజములు, అశ్వములు, భల్లూకములు, మర్కటములు, వ్యాఘ్రములు, సింహములు, విమానములు, సర్పములు, పక్షులు మొదలగు తమతమవాహనముల నధిరోహించి నానారూపధారులై యుండిరి. పుష్పక, విమానంబుల నధిరోహించి యున్నకిన్నరోరగగణంబులచే నాకాశమండలమంతయు నాచ్ఛన్నమై పోయెను. ఏకపుష్పక, భేరీ, శంఖ, మృదంగ, పణవ, గోముఖ, పటహానకప్రభృతివాద్యంబులును, గంభీరంబు లగుడమరు, డిండిమ, వేణు, వీణా, దర్దుర, కరతాళాదిమంగళవాద్యయంత్రంబులను బ్రయోగించుచు మహాఘోరగణంబులు మహాదేవుని సన్నిధిని జేరియుండిరి. అచ్చట నొకదివ్యాసనముపైఁ బద్మగర్భుండగు పితామహుం డాసీనుఁడై యుండెను. నలుదెసలను సిద్ధమునిగణంబులు పరివేష్టించియుండిరి. దివ్యకుండలధారి యగుబుగ్వేదుండు దక్షిణభాగంబునను, నానారూప

విరాజితుం డగుసామవేదుండు పశ్చిమంబునను, వహ్నిసదృశుం డగు నథర్వవేదుం డుత్తరంబునను, విద్యుత్తుల్యమూర్తి యగుయజుర్వేదుండు పూర్వభాగంబునను, ఎట్టయెదుట వివిధరూపంబులతోఁ బురాణేతిహాసంబులును, పార్శ్వములందు సకలదేవతలు నుపస్థితులై యుండిరి.

అప్పుడు యక్షరూపధరుం డగుమహాదేవుండు లోకభావనుం డగు నారాయణుం గాంచి గంభీరస్వరంబుతో సర్వదేవతాధీశ్వరా! నీకుఁ బ్రియం బయ్యెనేని నాకును నందీశ్వరునకును నభిషేకంబు గావింపు మనుటయు, విష్ణుదేవుండు మందహాసంబు సేయుచుఁ బ్రభూ! నీవెట్లాజ్ఞాపించిన నట్లే నేను గావించుటకు సిద్ధముగా నున్నాను. నీవు దేవాదిదేవుఁడ వనుట నిశ్చయము. అనియెను. అంతలో నైరావతారూఢుఁడై మహేంద్రుండును, ప్రత్యేకవిమానారూఢులై వసుగణంబులును మహాదేవునికడకు విచ్చేసిరి. వారితోఁ గలసివచ్చిన భాస్వన్మూర్తులగు విశ్వకర్మాదిదేవత లతుయుండును శాశ్వతుండు నగువిశ్వేశ్వరు నుద్దేశించి గంభీరస్వరంబున జయధ్వానములం గావింప నారంభించిరి.

## —♦ నందీశ్వరాభిషేకము. ♦—

మహాసత్త్వులగు ప్రమథులందఱు నప్పుడు దేవదేవుండగుమహేశ్వరునకుఁ బ్రణామంబు గావించి యోపరమేశ్వరా! సర్వభూతనమస్కృతా! నీవు మమ్ముఁ బిలిపించుటకు నిమిత్తమేమో యానతిమ్ము! సముద్రముల నింకింపవలయునో, పర్వతసమూహములఁ బెకలింపవలయునో, దిశలఁ దెరలింపవలయునో, సబాంధవంబుగ సమవర్తిని సమయింపవలయునో, యెవ్వరెని ఘోరవిపన్నులం గావింపవలయునో, యెవ్వరియుత్సాహైశ్వర్యములను ధ్వంసములుగఁ జేయవలయునో యాజ్ఞాపింపు మని ప్రార్థించిరి. అప్పుడు భక్తవత్సలుం డగుమహాదేవుండు

వారి నభినందించుచు, మీరు సకలభువనహితకారులు. మిమ్ముఁ బి ప్పించుటకుఁ గారణము వినుండు! పిమ్మట నిస్సంశయముగా నాయాజ్ఞ ననుసరింపుఁడు! ఈనందీశ్వరుఁడు నాపుత్త్రుఁడు. సర్వశ్రేష్ఠుఁడగు నీతఁడు నాకుఁ బ్రియతముఁడు. మీరీతని సకలదేవతాగ్రణిగాఁ జేసి సేనానాయకపదంబున నభిషేకింపవలయును. ఇది మొదలుగ నీనందీశ్వరుండు మీయందఱకును బ్రభుండు గాఁగలఁడు. అని భగవానుం డగురుద్రుం డాదేశించుటయుఁ బ్రమథనాయకులందఱు నంగీరించి యభిషేకోపకరణములను సంపాదించుట కారంభించిరి.

సువర్ణమయంబును, మేరుసదృశంబును, దివ్యంబును, సుందరం బు నగునొక పీఠమును, జతురంగశోభిత మగునొకమండపమును నిర్మిం పఁబడియెను. అందున్న వైడూర్యస్తంభములు, ముక్తామణిజాలంబు లచే నలంకరింపఁబడియెను. ఆమణిమండపము చతుర్ద్వారశోభితమై యుండెను. అందమూల్యాసనముపై నందీశ్వరు నాసీనుం గావించి మహాదేవుండు స్వయముగా నాతనికి దివ్యవస్త్రయుగ్మంబును, గంధద్ర వ్యంబులును, కేయూరకుండలకిరీటహారంబులను, పట్టిస, శూల, వజ్ర, రశనా, చ్ఛత్ర, చామరంబులను సమర్పించెను. అప్పుడు బ్రహ్మాది దేవతలును, మునిగణంబులును, నందీశ్వరు నిట్లు స్తుతింప నారంభించిరి.

ఓకూష్మాండరాగా! సాలంకాయనపుత్రా! వజ్రహస్తుఁడవగు నీకు నమస్కారము. శిలాదపుత్రా! నీవు హాలమార్గమునుండి యుద్భూ తుండవై రుద్రజాప్యపరాయణుండ వైతివి. దేవా! నీవు రుద్రభక్తుం డవు. జలశాయివి. గణాధిపతివి. మహాయోగీశ్వరుండవు. నీదంతము లతిప్రచండములైనవి. నీ వేకాకివయ్యు నేకాదశశతస్వరూపుఁడవు. అక్షయుఁడవు, అమృతుఁడవు, అజరుఁడవు, అవ్యయుఁడవు నగునీకు నమస్కారము. ఓపశుపతీ! రుద్రస్వరూపా! నీయాకార మతిభయంకర

మైనది, నీవు సర్వజ్ఞుఁడవు, అజేయుఁడవు, అనేకమస్తకుఁడవు, కిరీటకుండలమహాపరిఘధారివగునీకు నమస్కారము. సకలభూతగణరక్షకుండవగునీకు వందనములు.

అని యిట్లు దేవతలందఱును బ్రణతులై యమ్మహాత్ము ననేకవిధంబుల వినుతించుచు జయధ్వనులం గావింపఁదొడంగిరి. అప్పుడు బ్రహ్మేంద్రాదిదేవగణంబులును, అసురగణంబులును, దక్కిన యఖిలజీవగణంబులును జయధ్వానములం గావించిరి. యక్షాసురనాగభూతగణంబులు శంఖభేరీమర్దళాదివాద్యయంత్రసహస్రంబుల నొక్కుమ్మడిన బ్రయోగించుచు జయనినాదంబులు గావింప నారంభించిరి. దేవకీర్తితంబగునీనందీశ్వరస్తోత్రమును నిరంతరమును బఠించువానికి శివలోకావాసంబు సిద్ధించును. "నమోనందీశ్వరాయ" అని యెవ్వఁడు జపించునో యాతని కెన్నఁడును భూతభయంబు గలుగదు. నిత్యమును బ్రాతఃకాలంబున లేచి భక్తిపూర్వకముగా నీస్తవమును బఠించువానిపూజలకు మహాదేవుండు సంతుష్టుండై యాతని కభిమతవరప్రదానముం గావించును. ఆతని కెన్నఁడు నెట్టిభయంబును గలుగదు. నందీశ్వరునకుఁ బ్రతిదినమును బ్రణతుండగువాని సర్వేంద్రియములును సుప్రసన్నములై విశుద్ధంబులగును. ఆతఁ డీశ్వరునకుఁ బ్రీతిపాత్రుఁడై విశిష్టపదప్రాప్తుం డగును.

## నందీశ్వరపరిణయము.

అనంతరము దేవదేవేశ్వరుం డగుహరుండు నందీశ్వరపరిణయంబునకుఁ గన్యను సంగ్రహించునుద్దేశముతో దేవతలంగాంచి యోమహాతేజులారా! మీలో నెవ్వరియొద్దనైన దివ్యరూపసంపన్నయు, శుభలక్షణవిలసితయు నగుకన్య యున్నచో నాకుఁ గోడలుగాఁ జేయుట కంగీకరింపవలయు నని కోరెను. అంత దేవత లోత్రిలోకనాథా! సర్వ

జగంబులకును, సర్వజీవులకును బ్రహ్మ భుండ వగునీవిట్లు యాచించుట యు
చితము గాదు. పరాత్పరా! నీవు మాకుఁ బ్రధానాధారుఁడవు. శ్రీమం
తుఁడగుకశ్యపుఁడు మాజనకుఁడు, మరీచిమాపితామహుఁడు. ఆతని
తండ్రి బ్రహ్మదేవుఁడు. అట్టి బ్రహ్మకుఁగూడ నీవు జనకుండవు. కా
వున నీవు మాకు వృద్ధప్రపితామహుఁడవు. అట్టినీవు మమ్ము యాచిం
చుట యోగ్యము గాదు. అని విన్నపంబు సేయుటయు మహాదేవుండు
సురలారా! మీరు యథార్థమునే వచించితిరి. నేను కన్యకొఱకు యా
చించుట లేదు. లోకహితార్థమై నేనిట్లు యాచించితిని. అదత్తం
బగువస్తువును నేను సంగ్రహింపనొల్లను. మునీంద్రులకుఁగూడ నిదియే
సనాతనధర్మమైయున్నది. అని చెప్పుటయుఁ బ్రధానదేవతలు మనం
బున ధ్యానంబు గావించి యాక్షణంబున నొకదేవకన్యకం దెచ్చి యా
దేవునకు సమర్పించిరి.

లోకపితామహుండగుబ్రహ్మదేవుండు స్వయముగ హోతయై
యాపాణిగ్రహణకార్యమును సంపన్నంబు గావించెను. చారణసహితు
లగుగంధర్వులును, బర్వతనారదులును, సానుచరుండగుచిత్రసేనుండును
సర్వావశ్వుండును, సురుచియు, హాహాహూహువులును, మఱియు నితర
గంధర్వులును మధురస్వరములతో గానముసేయఁ దొడంగిరి. రంభా
ద్యప్సరోగణంబులు దేవమనోహరంబుగా నృత్యము సేయుచుండిరి.
ఈవిధముగా ధీమంతుండును, గణశ్రేష్ఠుండు నగునందీశ్వరునివివాహ
మహోత్సవ మప్రతిమానముగా సంపన్నం బయ్యెను. అనంతరము
కృతదారుం డగునందీశ్వరుండు శిలాదకులంబునకు శ్రీసంపాదకుండై
మహాత్ముండగు దేవదేవునకును, దేవియగుపార్వతికిని, జగత్పితయగు
విష్ణుదేవునకును, లోకపితామహుండగుబ్రహ్మకును వందనంబులఁ గా
వించెను. అప్పుడు మహాదేవుండు పుత్రుంగాంచి కుమారా! ఈనా

కోడలు నీకుఁ బ్రియురాలగుంగాక! నేనిప్పుడు సంతుష్టుండనై నీకు వర మీయవలయునని వేడుకపడుచున్నాను. నీయభీప్సితముం దెలుపుము. అనుటయు నందీశ్వరుండు ప్రభూ! జగత్కారణుండవగునీకు నాయెడల ననుగ్రహంబు గలదేని నాకు నీయెడల సర్వదా దృఢభక్తి వర్ధిల్లునట్లును, సర్వదా నీవు నాయెడల సంతుష్టుండవై యుండునట్లును వరంబు దయచేయఁగోరెదను. మఱియు నోజగన్నాథా! వరదా! నాజనకుని యెడలఁగూడ నించుకయనుగ్రహముం జూపఁగోరెదను. అని వేడుకొనియెను.

అప్పుడు దేవదేవుండు వత్సా! గణేశ్వరా! దేవియు, నేనును సర్వదా నీయెడలఁ బరమసంతుష్టులమైయుండెదము. నీపితృపితామహాదులు పరమైశ్వర్యసంపన్నులై మదీయంబగుస్థానంబును జెందఁగలరు. మీరజేయులును, సర్వపూజ్యులును, మహాసత్వులును గాఁగలరు. నీవున్నచో నేనును, నేనున్నచో నీవును గూడి యుండెదముగాక! నీవంశీయు లెల్లరును నీపితృపితామహులతోఁగూడ మద్గణాధ్యక్షులై మల్లోకంబున నివసింపఁగలరు. సర్వాభీష్టదాయకంబును, గామగమంబును, దివ్యవృక్షశోభితంబును, జలాశయవిలసితంబు నగునై భ్రాజంబనుపర్వతమును నీకుఁ బ్రసాదించితిని. అనుచుండగాఁ బార్వతీదేవి వరప్రదానాభిలాషతో నందీశ్వరునిచెంతకువచ్చి కుమారా! నీకేమికావలయునో కోరుకొమ్మనియెను. అప్పుడు నందీశ్వరుండు దేవీ! నాకు సర్వదా నీయెడ భక్తివర్ధిల్లునట్లనుగ్రహింపు మని కోరుకొనియెను. ఆసమయంబున మరుత్పుత్రియగునందిపత్ని యాదేవిసన్నిధికేతెంచి ప్రణామంబు గావించి తన్నుఁ దెలుపుకొనుటయు నుమాదేవి సంతుష్టయై కుమారీ! నీవు జన్మవర్జితవై మత్సమాన వగుము. మఱియుఁ బుత్రపౌత్రసంపత్తిం గాంచి నాయెడలను, నీభర్తయెడలను భక్తిమతివై నిరంతరమ

చ్చింతాపరాయణ వయ్యెదవుగాక! బ్రహ్మవిష్ణులు నీకు వరప్రదు ల య్యెదరుగాక! అనియనుగ్రహించినంతనే బ్రహ్మవిష్ణువులు "తథాస్తు" అనిరి. అనంతరము మహాదేవుండు హరిబ్రహ్మలం గాంచి దేవతావరులారా! ఇదిమొదలుగ నందీశ్వరుండు పుత్రులగుమీచేఁ బూజితుం డగుఁగాక! ఈతఁడు దేవతలకుఁ బ్రభుండై నాద్వారపాలకుం డగుఁ గాక! అనుటయు బ్రహ్మవిష్ణు లట్లే యగు ననిరి. అంత నందీశ్వరుం డెల్లవారిం గనుంగొని నాకు మీయెడల భక్తి వర్ధిల్లుఁగాక! మీవచనం బులచే నాకిష్టైశ్వర్యంబు లభించుఁగాక! మఱి మనోభీష్టప్రియుల మయ్యెదము గాక! మఱి కెన్నఁడును విచ్ఛేదంబు గలుగకుండుఁగాక యనియెను.

అప్పుడు రుద్రగణంబు లిట్లుచెప్పం దొడంగిరి. దేవా! నీవు మాకును, సకలదేవతలకును, ఋషులకును, మహాదేవపార్శ్వవర్తులగు రుద్రగణంబులకును, ప్రమథగణంబులకునుగూడ గతివి, విచారణకర్తవు, నియంతవు నై యున్నాఁడవు. నీవు మహాశక్తిసంపన్నుఁడవు. మహాయోగీంద్రుండ వగునీవు మాప్రభులకుఁ బ్రభుండవు. నాయకుండవు. దేవసేనానాయకుండగు కార్తికేయునితో సమానుఁడవు. అమరపూజితుం డగునారాయణునితోడను, బ్రహ్మాగ్నులతోడను, దేవయుగవాయ్వతితోడను గలసి యుందువు. నీవు జాప్యేశ్వరాశ్రితుఁడవును, సన్మానితుఁడవును, వరదాతవు నై యున్నావు. నీవు నిఖలభువనాధీశ్వరుఁడవు. అనియిట్లు సకలాభీష్టదాయకులగు దేవతలెల్లరును బ్రశంసించుటయు నందీశ్వరుం డందఱిం గాంచి నేనేమి గావింపవలయునో యాజ్ఞాపింపుఁ డనియెను. అంతగణపతిగణంబులును, రుద్రగణంబులును మహేశ్వరు నిసన్నిధిని దివ్యజ్ఞానసంపన్నుం డగునందీశ్వరుం గాంచి దేవా! నీవు మహేశ్వరునిచే సన్మానింపఁబడి, యాదరింపఁబడి సర్వగణాధ్యక్షుం

నైతివి. మేమును నిన్నభిషేకించితిమి. కావున నీవు మాకు సాయకుఁ
డవు, మోక్షప్రదాతవు నైతివి. అట్టినీవు బాలుండ వయ్యును సౌ
మ్యుఁడవు. నిర్గుణుండవయ్యును సద్గుణవంతుండవు. క్షమాశౌచదమో
పేతుండవు. విశేషించి మాకుఁ బ్రియకరుండవు. అని సమాదరపూ
ర్వకంబుగఁ గీర్తించుటయు నందీశ్వరుండు నిటలతటఘటితాంజలియై
సకలగణాధ్యక్షుల నిట్లు వినుతింప నారంభించెను.

ఓగణనాథులారా! యోగులును, మహాయోగులు నగుమీకు
నమస్కారము. జటాధరులు, రుద్రమూర్తులు, విశ్వరూపులు, విశ్వర
క్షకులు, వల్కలచర్మపరిధానులు, బహురూపులు, దేవతాధీశ్వరులు,
మునులు, విప్రమూర్తులు నగుమీకు నమస్కారము. మీరు శతసహ
స్రరూపంబుల విరాజిల్లుచుందురు. సంయతరూపులును, వాయురూపు
లును, మార్జాలరూపులును, కాలరూపులును, దేవాసురమానవాప్యా
యితులు నగుమీకు నమస్కారము. దేవదేహులును, అగ్నివాయు
వరుణాదిత్యమూర్తులును, వామనులును గామరూపులు నగు మీకు
నమస్కారము. ఓశుభులారా! జలస్వరూపులును, సర్వగతులునగుమీకు
నమస్కారము. మీరందఱును సమానులు. కాని మీతో సమాను
లేక నెవ్వరును లేరు. మీరు సౌమ్యపర్వతస్వరూపులు. సురసిద్ధపూ
జితులును, శక్తిసంపన్నులు నగుమీకు నమస్కారము.

గణనాయకు లిట్లు మధురవాక్యంబులచేఁ బ్రస్తుతులై దేవా!
మాబలవీర్యసుఖంబులు యుగాంతంబులవఱకును సుస్థిరంబు లగునట్లను
గ్రహింపు మని ప్రార్థించిరి. నందికృతం బగునీస్తోత్రమును నిత్యమును
బఠించువాఁడు సకలపాపవిముక్తుండై యశ్వమేధఫలప్రాప్తుం డగును.
మఱియు నాతనికి దినంబులయందును, బూర్వాపరసంధ్యలను, రాత్రు
లయందును గావించినపాపములు నశింపఁగలవు:—అనంతరము సకల

గణపతులును, నందీశ్వరసహితులై మహాదేవునకు నమస్కారంబులు గావించి సెలవు గైకొని వెడలిపోయిరి. దేవతలును, మహర్షులును దేవదేవీసహితముగా నాకాశమార్గమున నభిమతస్థానంబులకుం బోయిరి. ఈనందిజన్మంబును, వరదానంబును, అభిషేకంబును, వివాహంబును బఠించినను, ఇతరులకు వినిపించినను నందీశ్వరలోకప్రాప్తి యగును. సంయతాత్ములై భక్తిపూర్వకంబుగ నీచరిత్రమును బఠించువారును వినువారును నందీశ్వరసమానులై మహాదేవానుచరులు గాఁగలరు.

## —♦ నీలకంఠస్తవము. ♦—

సనత్కుమారుండిట్లనియెను. మునులారా! భగవానుం డగు శంకరునకు నీలకంఠత్వము సంఘటిల్లినవృత్తాంతమును గోటివత్సరంబులకిందట జగత్ప్రాణుండగు వాయుదేవునివలన నేను వినియుంటిని. ఆచరిత్రమునుయథారూపముగఁ దెలిపెదను వినుండు. కైలాసపర్వతంబున కుత్తరదిగ్భాగంబున సరోవరములయందును, నదీతీరములందును, పవిత్రోద్యానములందును, తీర్థసమూహములందును, దేవతాయతనములందును, సమున్నతగిరిశృంగములందును, శంకరోపవనంబులయందును వ్రతానుష్ఠానపరాయణులై యున్న మునిగణంబులు యథావిధిని భక్తిపూర్వకంబుగ ఋగ్యజుస్సామాథర్వవేదాత్మకంబు లగువాక్యంబులతో మహాత్ముం డగుసదాశివుని స్తోత్రంబు సేయుచు, ఓంకారహుంకారనమస్కారంబులచే నిరంతరము నర్చించుచుండిరి. ఒకనాఁడు జ్యోతిశ్చక్రంబున భగవానుండగుసూర్యదేవుండు మధ్యాకాశమున విరాజిల్లుచున్నసమయంబున సకలదేవతలును సంయతచిత్తులై యుండఁగాఁ గొంతసేపటికి నియమావసానసమయంబున సకలభూతజీవనుండగువాయుదేవుండు «నీలకంఠాయనమః» అని యుచ్చరించెను.

అప్పుడు నియతవ్రతులును, సూర్యానుగాములును, వాయు

పర్ణాంబుభోజనులును, నగునష్టాశీతిసహస్రవాలఖిల్యమునిగణంబులు వాయుదేవుం గాంచి ప్రభంజనా! నీవు పావనుఁడవు. పుణ్యాత్ములలోఁ శ్రేష్ఠుఁడవు. నీవిప్పు డుచ్చరించిన నీలకంఠశబ్దము పుణ్యదాయకంబును బరమగుహ్యంబు నై నది. కావున నంబికానాథుం డగుమహాదేవునకు నీలకంఠనామ మెట్లుగలిగెనో యాచరిత్రమును సవిశేషముగ నీవలన వినవలయునని కుతూహలపడుచున్నాము. మానవులవాక్ప్రవృత్తికి నీవే యేకమాత్రప్రేరకుఁడవు. నీవు విద్వాంసుఁడవు. నీవు వ్యాపనగతుండవై నంతనే మానవులకు వాక్యప్రవృత్తి యగుచుండును. సర్వజనులకును, జ్ఞానపూర్వకంబు లగుక్రియ లన్నియును నీవలననే యగుచుండును. నీ నుండియే సకలవర్ణంబులును నిష్పన్నంబు లైనవి. వాక్పథంబున కగమ్యంబగు స్థానంబునఁగూడ నీసద్భావంబు గలదు. నీవు సర్వగతుఁడవు. ఇట్లు సర్వగతులగు దేవతలు నీకంటె నన్యు లెవ్వరును లేరు. సర్వప్రాణులును నీవు సకలజీవకారణుండ వని ప్రత్యక్షముగ నెఱుంగుదురు. నీవు స్మృతిస్వరూపుఁడవును, మేధారూపుఁడవును గావునఁ బాపనాశకంబులును, మంగళకరంబులు నగువాక్యములచే మాకీవిషయము నెఱింగింపు మనిప్రార్థించిరి.

అంత లోకపూజితుండును, మహాతేజుండు నగువాయుదేవుం డిట్లనియెను. వేదవేదాంగవిదు లగుబ్రహ్మర్షులారా! వినుండు. బ్రహ్మమానసపుత్రుం డగువసిష్ఠుం డనునొకధర్మాత్ముండు గలఁడు. ఆతఁడొకనాఁడు మయూరవాహనుండును, క్రౌంచభేదియు, మహిషాసురవధూనయనాంజనతస్కరుండును, గౌరీహృదయానందకరుండును, మేఘమంద్రస్వరుండును, మహాత్ముండును, స్వేచ్ఛాబాలకస్వరూపుఁడును నగుకార్తికేయుంగాంచి మహాసేనా! లోకమంగళకరంబును, ప్రియకరంబును, బవిత్రంబు నగునీలకంఠచరిత్రమును నాకెఱింగింపుము. నీభక్తుఁ

డను, విశ్వస్తుఁడను, దాంతుఁడను నగునాప్రార్థనమును మన్నింపుము. అనుటయు నగ్నితేజుండును, దైత్యసంహర్తయు, మహాత్ముండు నగు కార్తికేయుం డిట్లనియెను. మునీంద్రా! నేను మాక్రోడంబున నివసించి యాకర్ణించినపార్వతీపరమేశ్వరసంవాదమును జెప్పెదను వినుము.

నానాధాతుకాంతివిభూషితం బగుటచే నతిరమణీయంబును, దరుణాదిత్యసంకాశంబును, వజ్రసోపానవిరాజితంబును, స్ఫటికద్వార వినిర్మితంబును, సువర్ణమయదివ్యశిలాకుట్టిమశోభితంబును, వివిధఫల పుష్పతరులతాసమాకీర్ణంబును, హంసకారండవాదిజలవిహంగసంకులం బును, కోకిలాలాపపరివ్యాప్తంబును, సిద్ధచారణగణసేవితంబును, మేఘ గంభీరంబులగువృషభనినాదములచే నిరంతరశబ్దాయమానంబును నగు కైలాసపర్వతము వినాయకభయంబునఁ గిన్నరులచే విడువంబడినకంద రంబులచేతను, మనోహరవంశధ్వనులచేతను, డోలావిహారంబు గావిం చు సురగణంబులచేతను, జతుర్దిశలఁ బ్రతిధ్వనించుచున్నధ్వజఘంటా నినదంబులచేతను, వాణిజ్యపరులగువణిగ్వరులచేతను, మంగళవాద్యం బులచేఁ బ్రతిధ్వనితంబులగుకందరంబులచేతను విరాజిల్లుచుండెను. అందు భయంకరాట్టహాసులును, విచిత్రవర్ణులును, గరాళవదనులును, వ్యాఘ్రసింహముఖులును, మృగమేషవదనులును, గజాస్యులును, హ యాననులును, బిడాలసృగాలవానరముఖులును, వామనులును, దీర్ఘా కారులును, కృశాంగులును, స్థూలకాయులును, సర్పోదరులును, జం ఘాలంబితహస్తులును, లంబోష్ఠులును, స్థూలనితంబులును, గోకర్ణులును ఏకకర్ణులును, మహాకర్ణులును, వికర్ణులును, ఏకచరణులును, త్రిశస్తచర ణులును, బహుచరణులును, చరణహీనులును, ఏకమస్తకులును, చతు ర్మస్తకులును, బహుమస్తకులును, మస్తకవిహీనులును, ఏకచక్షులును, మహాచక్షులును, బహుచక్షులును నగుప్రమథగణంబులు పరమానంద

ముతో విహరించుచుండిరి. అట్టికైలాసగిరిశిఖరంబున విచిత్రరత్నభూషణాలంకృతంబును, హేమమయంబును, మనోహరంబు నగుశిలాతలంబున భూతగణపరివృతుండై సుఖోపవిష్టుండై యున్నమదనవైరిం గాంచి పార్వతీదేవి యిట్లనియెను.

ఓదేవదేవా! వృషభవాహనా! నీకంఠదేశమునందు నీలమేఘఖండమువలె, విశుద్ధనీలాంజనరాశివలె విరాజిల్లుచున్నయీచిహ్న మేమి? ఓజగదీశ్వరా! అట్లగుటకుఁ గారణమేమి? నీకీనీలకంఠత్వ మెట్లుగలిగినది? ఈసకలవృత్తాంతమును సవిశేషముగ వినవలయు నని కుతూహలముగానున్నది. అని ప్రార్థించుటయుఁ బార్వతీప్రియుండు మృదుమధురవచనంబులతో నిట్లనియెను. వరాననా! పూర్వము దేవాసురులు క్షీరసాగరమును మథించినప్పుడు ప్రప్రథమమునఁ బ్రళయానలసదృశంబును, భయంకరము నగుకాలకూటవిషం బుత్పన్నం బయ్యెను. దానింగాంచి దేవాసురులు భయంబుచే విషణ్ణవదనులై పోయి బ్రహ్మదేవునిశరణముం గాంచిరి. ద్యుతిమంతుం డగుబ్రహ్మదేవుండు భయభ్రాంతులగువారిం గాంచి యోమహాభాగులారా! మీరిట్లుద్విగ్నహృదయులై యేతెంచుటకుఁ గారణ మేమి? అష్టైశ్వర్యములను మీకు నేను ప్రసాదించితిని. విగతజ్వరు లగుమీరు త్రైలోక్యంబును బరిపాలించుచు విమానచారులై స్వచ్ఛందవిహారముం గావించుచున్నారు. మీరాధ్యాత్మికంబులు, నాధిభౌతికంబులు, నాధిదైవికంబులు నగువ్యసనంబులను గర్మానుసారంబుగా జీవులకుఁ గల్పింపఁగలసమర్థులు. అట్టిమీరు సింహపీడితమృగంబులవలె నుద్విగ్నచిత్తులై వచ్చుటకుఁ గారణమేమో తెలుపుఁ డని యడిగెను. అప్పుడు ఋషిగణసహితు లగుదేవాసురగణంబులు దేవదేవా! మేము క్షీరాంబుధిని మథించుచుండఁగా ఘోరమేఘాకారంబును, నీలాంజనసదృశంబు నగుమహావిషం బుద్భవించినది.

ప్రళయానలసదృశంబగు దానిభయంకరతాపమునకు మేనుదలఁచుమును భీతిల్లి నీశరణంబు గోరి వచ్చితి మని చెప్పుటయు బ్రహ్మదేవుండు పర మేశ్వరుం దలంచి యిట్లు స్తుతింపఁదొడంగెను.

ఓవిరూపాక్షా! దివ్యచక్షూ! పినాకవజ్రధారి వగునీకు నమస్కారము. సాంఖ్యయోగస్వరూపుఁడవు, మహాభూతస్వరూపుఁడవు, త్రైలోక్యనాథుఁడవు, భూతనాథుఁడవు, దానవసంహారివి, చంద్రసూర్యాగ్నినయనుఁడవు నగునీకు నమస్కారము. బ్రహ్మవిష్ణురుద్రస్వరూపుఁడవు, మదనదమనుండవు, కాలకాలుఁడవు నగునీకు నమస్కారము. శంకరా! హరా! రుద్రమూర్తీ! వసురేతుండవును, దేవదేవుండవును, జటాజూటధరుండవును, గపాలివి, శివుండవు నగునీకు నమస్కారము. దేవా నీకు రూపము లేదు. నీవు సర్వమంగళవిధాతవు. ఓమఖఘ్నా! త్రిపురాసురధ్వంసకారీ! మంత్రపతీ! నీకు నమస్కారము. బుద్ధుండవు, పవిత్రుఁడవు, ముక్తుఁడవు, అద్వితీయుఁడవు, దిగంబరుఁడవు, శిఖండివి, కమలహస్తుఁడవు, శ్రేష్ఠుఁడవు, ఉగ్రుఁడవు, విప్రుఁడవు, బహునేత్రుఁడవు, సత్త్వరజస్స్వరూపుఁడవు, అవ్యక్తుఁడవు, అనిత్యుఁడవు, నిత్యుఁడవు, నిత్యానిత్యుఁడవు నగునీకు నమస్కారము. అచింత్యుఁడవును, చింత్యుఁడవును, చింత్యాచింత్యుఁడవును, భక్తార్తినాశకుండవును, నారాయణప్రియుండవును, ఉమాప్రియుండవును, శర్వుండవు నగునీకు నమస్కారము. దేవదేవా! నీవు పక్షమాసఋతువత్సరస్వరూపుఁడవు. బహుస్వరూపుఁడవు. దండవల్కలధారివి. ఋగ్యజుస్సామస్వరూపుఁడవు. ప్రధానపురుషుఁడవు. ఈశ్వరుఁడవు. లోకక్షయనిపాతనుండవు. ఇంద్రుండవు. వరుణుండవు. నీచరిత్రం బతిప్రధానమైనది. ఓపృథ్వీపతీ! స్తవనీయుండ వగునిన్ను నీప్రసాదంబు లేక యెవ్వరును దర్శింపఁజాలరు. దేవా! నీవు నాయెడలఁ బ్రసన్నుండవై నాకు భక్తిజ్ఞానంబు

లను బ్రసాదింపుము.

అని యిట్లు వేదవేదాంగసంభవంబులగువివిధస్తవంబులచే వీరిం
చి నన్ను నుతించుటయు నేసంతుష్టుండనై యాతనియెదుట సాక్షాత్క
రించి యోజీవమంగళనిదానా! భూతాధిపా! మహాతపా! నేనిప్పు డి
ట్టికార్యంబును దీర్పవలయునో చెప్పుమని యడిగితిని. అప్పుడు పద్మగ
ర్భుండు నన్నుం గాంచి యోత్రికాలాధినాథా! దేవాసురులు క్షీరాంబు
ధిని మథించుచుండఁగా నతిభయంకర మగుమహావిషంబుద్భూతం బై
నది. అది ప్రళయాదిత్యునివలె నతిభయంకరతేజోమయమై యున్నది.
ఆదారుణజ్వాలలచేఁ ద్రిలోకములు నాచ్ఛన్నము లై పోయినవి. దా
నిం గాంచి యెల్లవారును భయకంపితులై నీశరణంబు గోరియున్నవా
రు. లోకహితంబుకొఱకై నీవిషమును బానంబు సేయవలయును. నీ
వే యేకమాత్రభోక్తవును, సర్వదేవతావరప్రదాతవు నై యున్నావు. ఇ
ట్టిఘనకార్యమును నిర్వహించుసమర్థుఁ డీత్రిలోకములయం దింకెవ్వఁ
డును లేఁడు. ఆవిషజ్వాల యుదయించినతోడనే జనార్దనుండు కృష్ణవ
ర్ణుఁడై పోయినాఁడు. ఇకమావంటివార మేమిచేయఁగలము? అని చెప్పు
టయు నేనట్లే చేసెద నని చెప్పి యంతకసదృశంబును, దేవపీడాకరంబు
ను, భయాకరంబునగునమ్మహావిషమును బానము చేసితిని. అంత లో
కపితామహుండగుజలజాసనుండు మహాదేవా! నీనీలకంఠ మిప్పు డతిర
మణీయముగా నున్నదని ప్రశంసించెను.

ఓపార్వతీ! అప్పుడు సకలదేవాసురయక్షగంధర్వపిశాచోరగగణ
సమక్షంబున నతిఘోరంబగువిషంబును గంఠధారణంబు గావించుటచే
నాకు శ్రీకంఠత్వము గలిగినది. అత్యుగ్రతేజం బగుకాలకూటవిషంబు
ను నేనట్లు పానముచేయుటవలన నఖిలదేవాసురగణంబులును బ్రహృ
ష్టహృదయులై యతివిస్మయాక్రాంతచిత్తులై పోయిరి. ఓమదగజగామి

నీ! అనంతరము సకలదేవతాగణంబులును నన్నుద్దేశించి మహేశా! మందాకినీజలప్లావితకేశపాశా! నీబలవీర్యపరాక్రమంబు లత్యద్భుతంబులైనవి. ఏమియీదేహకాంతి! ఏమియీమాహాత్మ్యము! దేవా! నీవు బ్రహ్మవిష్ణుయమకుబేరవహ్నిస్వరూపుఁడవు. పరమపురుషుఁడవు. సూక్ష్మాతిసూక్ష్మస్వరూపుఁడవు. ఈచరాచరప్రపంచమునందు భోక్తవును, నిత్యుండవును నీవుమాత్రమే. ప్రళయమునందును రక్షకుఁడవు. యోగాభిగమ్యుఁడవు. అట్టినీకు నమస్కార మని నుతించుచుఁ దమతమస్థానంబులకుం జనిరి. వారెల్ల విమానారూఢులై స్వర్గంబున కేఁగియు స్తోత్రపాఠంబులఁ గావించుచునే యుండిరి. ఇది యతిగుహ్యం బగు చరిత్రములలో గుహ్యతమంబైనది. ఈనీలకంఠచరిత్రము త్రిలోకప్రసిద్ధమైనది. పాపనాశనం బగునీశుభచరిత్రము స్వయంభువగుబ్రహ్మదేవునిచే నుద్గీతంబైనది. ఈచరిత్రమును వ్రాసి ధారణంబు గావించువాని కిహపరలోకసుఖంబులు గలుగును. ఆతనికి స్థావరజంగమాదివిషబాధలు గలుగవు. ఆతనియశుభంబులు శాంతించును; దుస్స్వప్నంబులు దొలంగును; ఆతనికి విజయంబులు లభించును. యుద్ధంబున శౌర్యంబును, మార్గంబున మంగళంబులును, నెల్లయెడల నిర్భయంబును గలుగును. అట్టివాఁడు దేహావసానంబున నంది తుల్యుండగును. మఱియుఁ ద్రిశిరుండును, త్రిలోచనుండును, త్రిశూలధారియు నై దివ్యవాహనమునధిరోహించి సప్తలోకములను సంచరించుచుండును. ఆకాశవాయువులంబోలి యాతని కప్రతిహతగతి లభించును. ఆతఁడు కల్పాంతపర్యంతమును మత్సమానుండై యుండును. భక్తితో నీచరిత్రము నాకర్ణించువారికి సహస్రగోదానఫలంబు గలుగును. ఇందొకశ్లోకమునుగాని, శ్లోకార్థమునుగాని ధరించువారికి రుద్రలోకనివాసంబు సిద్ధించును. అని మహాదేవుం డానతిచ్చెను.

## —♦ త్రిపురోపాఖ్యానము. ♦—

సనత్కుమారుం డిట్లనియెను. వ్యాసమునీంద్రా! త్రిపురదహన వృత్తాంతము నాలకింపుము! పూర్వకాలంబున దైత్యశ్రేష్ఠుండగుహిరణ్యకశిపుండు నృసింహదేవునిచే నిహతుండగుటయు సకలదైత్యదానవబలంబును విభిన్నంబై పోయెను. అప్పుడు మయుండను రాక్షసుండు దుఃఖితుండై విశ్వకర్త యగురాక్షసేశ్వరుండు రతివిహీనుం డగుమకరధ్వజునింబోలి లక్ష్మీవిహీనుఁడై యున్నవాఁడని విచారించుచు విష్ణుసమప్రభావుండగువిద్యుత్ప్రభునిం జేరి తారకసహితంబుగా నత్యుగ్రతపంబు గావింపఁదొడంగెను. ఆముగ్గురును శీతకాలమున హిమాలయమునందును, గ్రీష్మకాలమునఁ బంచాగ్నిమధ్యంబునను, వర్షాకాలంబున జలమయస్థలంబునను నిలిచి దృఢప్రయత్నములోఁ దపంబు గావించుచుండిరి. వారిట్లు తపంబు సేయుచుండ దివ్యవర్షసహస్రంబులును, యుగసహస్రములును గడచిపోయెను. అప్పటికి వారిశరీరము లస్థిచర్మమాత్రావశిష్టంబు లయ్యెను సూర్యాగ్నిప్రభలచే విరాజిల్లుచుండెను. అంతఁ జతురాననుండు వారికి సాక్షాత్కరించి ప్రియమధురస్వరముతో దృఢవ్రతులారా! మీరు బహుపాపనాశకం బగుతపంబు గావించితిరి. మీయభిమతవరంబులఁ గోరుకొనుఁడని యానతిచ్చెను.

అప్పుడు మయాసురుండు జలజాసనునెదుట మోకరించి భక్తివినయపూర్వకంబుగాఁ గృతాంజలియై దేవదేవా! అవధ్యత్వమును, అపారబలంబును, అనంతసుఖంబును, అమరత్వమును, దివ్యపురంబులును మాకుఁ బ్రసాదింపుము. మాపురంబులు దివ్యవిమానసదృశములై, యితరులకగమ్యములై, కామగమనంబు గలిగియుండవలయును. అని ప్రార్థించుటయు విరించి పుత్రా! నేనింతటివరంబు నీయఁజాలను. ఏదేనించుకయవకాశంబు జూపి మరలఁ బ్రార్థింపుము. నేనిట్లంటినని

మానంబున నన్యథా భావింపకుమనియెను. అప్పుడు మూఢుం డగుమ యుం డట్లే యని స్వామీ! నేనిదివఱకుఁ గోరినకోరిక లన్నియు నట్లే సిద్ధింపవలయును. కాని వేయిసంవత్సరములకొకసారి యొకయరనిమిష మమాత్రము మాపురంబులుమూఁడును గలిసికొనుచుండును, ఆసమయ మున నెవ్వఁడైన నొకమహాబలుఁ డేకబాణంబున మూఁడుపురంబుల ను గొట్టఁగలిగినచో నప్పుడు మాత్రిపురంబులును సజీవముగ దగ్ధము లగుటను మేమంగీకరింతుమని కోరుటయు బ్రహ్మదేవుండు ప్రహృష్ట హృదయుండై యట్లే యగునని వరంబిచ్చి వెడలిపోయెను. అనంతర ము మయుండు జగద్విఘాతంబుకొఱకు లోహరజతస్వర్ణమయంబులగు త్రిపురంబులను నిర్మించెను. అవి సుమేరుశృంగంబులం బోలి సమున్న తంబులై మనోహరద్వారవలభీగవాక్షంబులచేతను, హేమమయవీథ్యం గణంబులచేతను విరాజిల్లుచు దివ్యం బగుస్వర్గసౌందర్యము నపహసిం చుచుండెను. అందలిహర్మ్యంబులతమంబు చంద్రకిరణంబులచే దూరీ భూత మగుచుండెను. అందు శీతలవాయువులు ప్రవహించుచుండుట చే సుఖప్రవేశయోగ్యంబులై యుండెను. ముక్తాప్రవాళమణిఖండచిత్రి తంబులును, తటిత్ప్రకాశంబులును, పవనోచ్చలితంబులును, వజ్రభూ షితంబులు నగుకేతనంబులచే శోభితంబులగుసమున్నతప్రాసాదపంక్తు లున్నతతోరణసహితంబులై మణికాంతులతో విరాజిల్లుచుండెను. వానికి నలుదెసలను సర్వకాలములందును ఫలపుష్పసమన్వితంబులగు మనోహరవృక్షశ్రేణులచే నొప్పుమీఱు శతశత రత్నోద్యానములు చెలువందుచుండెను. మఱియు నాపురంబులు ప్రఫుల్లకమలశోభితంబు లగు జలదీర్ఘికలచేతను, కలవిహంగమధురగీతంబులచేతను, నఖక్షత విభిన్నపయోధరలును, ఆకర్ణరక్తాంతవిలోచనలును, లజ్జాచపలేక్షణలు నగురమణీమణులచేతను విలసిల్లుచుండెను. మయుండిట్లు త్రిపురంబుల

ను సృజించి లోహమయపురంబు తారకునకును, రజతపురంబు విద్యు
త్ప్రభునకు నొసంగి హేమమయనగరమును దాను గైకొనియెను. ఇ
ట్లాదానవులు త్రిపురంబుల నధిష్ఠించి త్రిలోకభీకరులై వివిధసుఖోప
భోగంబుల ననుభవించుచుండిరి. వారట్లు మోహాదరోద్ధతులై దేవ
తాగణంబుల నవమానించుచు నాకస్మికముగ విజృంభించి వారిని వివి
ధరీతుల బాధింప నారంభించిరి. నందనాదిరమణీయోద్యానముల వి
ధ్వంసంబు గావించి యథేచ్ఛావిహారులై వారట్లు దేవతల కనిష్టంబు
గూర్చుచు వర్తించుచుండఁ జాలకాలము గడచిపోయెను.

అప్పు డింద్రాదిదేవతాగణంబు లాదానవులయెడలఁ గ్రోధోద్రి
క్తులై పితామహునిపాలికింబోయి వారి దుశ్చేష్టితముల నాతనికి నివేదిం
చిరి. లోకకర్త యగుకమలభవుండు వారల నూఱడించి సురలారా!
ఆదానవు లతిబలవంతులై యున్నారు. అట్టివారిని స్వబలంబులచే
మీ రేమియుం జేయఁజాలరు. విష్ణుదేవుండును, నేను మిమ్ము వెంటఁ
బెట్టుకొని మహాదేవుని సన్నిధికిం బోయి శరణంబు గోరవలయునని
తలంచితిమి. శూలపాణియు, శశిభూషణుండు నగునద్దేవుఁడే మనకు
గతియై యున్నాఁడు. ఆదేవుండు మనశత్రువుల బలమునంతను వినాశం
బు గావింపఁగలఁడు. అని చెప్పి విరించి యాదేవతలం దోడ్కొని
కైలాసపర్వతంబునకుం బోయెను. అప్పుడు సకలదేవతలును మహాదేవు
నిట్లు వినుతింప నారంభించిరి.

ఓత్రిలోకేశ్వరా! నీవు సర్వవందితుఁడవు. అసీమవిక్రముఁడవు.
సర్వామరప్రియుఁడవు. నీజటాకలాపమునందలిచంద్రప్రభలచే నీమస్త
కము ప్రకాశించుచుండును. నీవు పినాకహస్తుఁడవు. త్రిలోకదేవుఁడ
వు. ప్రదీప్తపరశ్వధుండవును, త్రిశూలహస్తుండవు నగునీకు నమస్కా
రము. జగచ్ఛరణ్యుండును, నిత్యుండును, నందివరప్రియుండును, సురే

శ్వరుండును, హోక్ష వరప్రదుండును, యక్షేశవరదుండును, హిమాచలస్థి తుండును, కైలాసవాసుండును, వృషభవాహనుండును, దిగ్వాసుండును, సంపద్విముక్తుండును, జగద్విధాతయు నగునీకు నమస్కారము. దేవా! నీవు చంద్రసూర్యాగ్నులను, బ్రహ్మనుగూడ సృజించితివి. నిత్యుఁడవు. సూక్ష్ముఁడవు. పరమేశ్వరుఁడవు. సృష్టికర్తవు. పాలకుఁడవు. పరాత్పరుఁడవు. పరమాత్ముఁడవు. శంకరా! నీకు నమస్కారము. శర్వుండును, సర్వవస్తూత్పత్తికారణుండును, యజ్ఞమూర్తియు, నగునీకు నమస్కారము. దేవా! నీవు తపనునిదంతనిర్మూలనంబు గావించితివి. మదనదేహవిధ్వంసకుఁడవు. పురుషోత్తమా! ప్రధానుండును, రుద్రుండును, సౌమ్యుండును, వపుష్మంతుండును, త్రిలోచనుండును, సురాసురశ్రేష్ఠుండును, నీలశిఖండధారియు, శ్మశానవాసియు, దైత్యవినాశకుండు నగునీకు నమస్కారము. తేజోమయా! నీయనుగ్రహంబుచే మోహాజ్ఞానంబులు దూరీభూతంబు లగును. నీవు మోక్షవరప్రదుఁడవు. అమృతసంస్థితుఁడవు. పార్వతీపతివి, కుమారజనకుండవు. బ్రహ్మవు. విశ్వకర్తవు. ధీమంతుఁడవు. హరుఁడవు. శంభుఁడవు. శత్రులకైన నభీష్టవరదాయకుండ వగునీకు నమస్కారము. మహాదేవా! కృపాళుండవై మాకుఁ బ్రసన్నుండ వగుము.

అని స్తుతించుటయు దేవదేవుండు సంతుష్టుండై యోదేవతలారా! నేను మీయెడలఁ బ్రసన్నుండనైతిని. మీయభిలషితవరంబుల నర్థింపుఁడు. నాకు మీకీయరాని దేదియును లేదని యానతిచ్చెను. అంత దేవతలందఱు నేకవాక్యముగా శంకరా! మయాదిదానవులు బ్రహ్మవరగర్వితులై యప్సరస్సుందరుల నపహరించి, నందనోద్యానమును భగ్నము చేసిరి. నేఁడో రేపో సకలదేవతలును నిహతులు గానున్నారు. పితామహుండు, విష్ణుండునుగూడ వారిని నిగ్రహించుటకు

సమర్థులు గాకుండిరి. అందుచే మే మతిభయాకులితహృదయులమై యున్నాము. దేవా! ఇప్పుడు త్రిపురవినాశంబును, సర్వదేవతావిజయంబును ఘటిల్లునట్టివిధానంబును గావింపుము. ఇదియే మాప్రార్థన మని విన్నపంబు సేయుటయు మహాతేజుం డగుమహాదేవుండు దేవతాగణంబుల నూఱడించుచు మీరెల్లరును నాతేజమునం దర్ధాంశమును గ్రహించి దానవసంహారంబు గావింపుం డని యానతిచ్చెను.

అప్పుడు దేవతలు దేవా! నీసహస్రాంశమైనను మేము భరింపఁజాలము. నీతేజము నవలోకించుటకైనను, ధరించుటకైనను మాకు శక్తి యెక్కడిది? కావున నీవు మాయెడలఁ బ్రసన్నుండ వగుము. మే మెట్టిబలంబుచేనైనను దానవసంహారంబు సేయనేరము. శంకరా! నీవే స్వయముగాఁ ద్రిపురసంహార మాచరింపవలయును. శూలపాణీ! దివ్యవర్షసహస్రంబులు గడచినపిదప నొక్కయుద్ధనిమేషమాత్ర మాత్రిపురంబులు నొక్కచోఁ జేరుకొనియుండును. అప్పుడు మహాబలుం డగువాఁ డేకబాణంబున నేకపర్యాయము త్రిపురంబులను, దానవుల నుగూడ దగ్ధంబు గావింపవలయును. అట్లు గాదేని వారికి వినాశంబు లేదు. ఇది బ్రహ్మవరంబు. అంతటిఘనకార్యముం గావించుసామర్థ్యము మా కెవ్వరికిని లేదు. అని ప్రార్థించుటయు శంకరుండు మరల నిట్లనియెను. సురలారా! త్రిపురంబు లంతటిదుర్గమంబు లగునేని నేనే యేకబాణప్రయోగంబుచే వానిని దహింపఁజేసెదను. బ్రహ్మవిష్ణుల హితంబుకొఱకు దేవేంద్రదేవతాదుల ననుగ్రహించి నేనే స్వయముగ రథారూఢుండనై చని త్రిపురదహనంబు చేసెదను. కావున మీరు హిమాచలంబును బోలి సారగర్భంబును, నన్ను వహించుటకు సమర్థంబును నగు రథంబును సిద్ధముగఁ జేయుఁడు. అని శివుం డాజ్ఞాపించెను.

## —♦ విజయయాత్రాసన్నాహము. ♦—

అంత దేవతలు మహాదేవునకుం బ్రణామంబు గావించి ప్రహృష్టాంతఃకరణులై యందఱుం గలసి యుత్తమరథనిర్మాణంబున కుద్యుక్తులైరి. అప్పుడు బ్రహ్మయు, విష్ణుండును, వైశ్వానరుండును సర్వదేవతామయంబగు రథంబును నిర్మించిరి. ఆరథంబున బ్రహ్మయు, సూర్యుండును, ప్రచండపవనుండును, కుబేరుండును, యముండును, అష్టవసువులును, రుద్రగణంబులును, ద్వాదశాదిత్యులును, గంధర్వులును, అశ్వినీకుమారులును, గరుడుండును, పర్వతంబులును, పన్నగగణంబులును, గుహ్యకులును, ఋషులును, సిద్ధగణంబులును, యక్షులును, గ్రహగణంబులును, మేఘకాలవనస్పతులును,దివస, ముహూర్త, క్షణ, కాష్ఠా, లవ, ఋతు, మాస, విషు, వత్సరంబులును, స్థావరంబులును, జంగమంబులును, నక్షత్రములును, అష్టవిధదేవతానికాయంబులును స్థాపితులై యుండిరి. కొందఱు దేవతలు ధ్వజరూపముం దాల్చి యుండిరి. చతుర్వేదము లశ్వంబులుగను, సంవత్సరములు చక్రంబులుగను హిమాచలము ధనువుగను, జగత్పతి యగుదేవదేవుండు ధనుర్గుణంబుగను జేసి గిరిసదృశం బగునుత్తమరథంబును సిద్ధము గావించి బ్రహ్మవిష్ణువైశ్వానరులు పరమేశ్వరునకుం బ్రణామంబు చేసి రథము సజ్జితంబైనదని మనవి చేసిరి.

అప్పుడు సర్వభువనేశ్వరుండును, భగవానుండు నగుశంభుండు సకలసురాసురవందితుండై తేజోమయం బగునారథంబును మీఁదనుండి క్రిందవఱకును దిలకించి వాక్పతియగుబ్రహ్మంగాంచి యోజలజాసనా! నీవీరథంబును ధనుస్సును నిర్మించితివి. కాని త్రిపురదహనసమర్థం బగుబాణమెక్కడ! దానినిగూడ సిద్ధపఱుపుము. అనుటయు విరించి వృషభధ్వజునకు నమస్కరించి దేవా! నేను నీనిమిత్త మీరథధనుస్సులను

మాత్రమే నిర్మింపఁగలిగితిని. కాని బాణమునుమాత్రము స్వయముగ నీవే కల్పించుకొనవలయు నని విన్నవించెను. శివుం డప్పుడు తనపార్శ్వములందున్న విష్ణువైశ్వానరులను గటాక్షవీక్షణంబులచే ననుగ్రహించుటయు వారిరువురును గృతాంజలులై పంచముఖునకభిముఖు లై నిలువఁబడిరి. అంత మహేశ్వరుండు స్వయముగా విష్ణుదేవుని శరంబుగను, ఓషధీశ్వరుం డగుచంద్రుని దన్మ్నఖంబుగను, పావకుని ములికిగను జేసి విధాతం గాంచి సారథినెవ్వనిగాఁ జేసితి వని యడిగెను. మీయాజ్ఞయైనచో నేనే సారథినయ్యెద నని బ్రహ్మదేవుండు విన్నపంబు చేయుటయు శివుండు మంచిదని యంగీకరించి విరించి హస్తంబును గ్రహించి రథారోహణంబు గావించెను.

అంతరుద్రానుచరులును, మహాయోగసంపన్నులును, రణనిపుణులు నగునందీశ్వర శంకుకర్ణ, చండేశ్వరాదులు చతుర్దశసహస్రగణేశ్వరులతో వివిధాయుధధారులై శంఖభేరీప్రముఖవాద్యంబుల మ్రోగించుచు మహాదేవు సన్నిధిని నిలిచియుండిరి. దేవదేవునియుత్తమాంగమునం దతితుములం బగుపుష్పవృష్టి యగుచుండెను. దేవతాగణంబులు తనభారమును వహింపఁజాల రని యెంచి మహాదేవుండు శరీరభారంబు సహనీయంబుగాఁ జేసెను. మహాదేవుని రణసమారంభముంగాంచి దానవులెల్లరును భయభ్రాంతులై పలాయితులు గాఁదొడంగిరి. అప్పుడు నారదుండు దానవరాజుపాలికిం బోయి వృషభధ్వజుండగుశంభుండు బ్రహ్మసారథికంబగు దేవమయదివ్యరథారూఢుఁడై త్రిపురదహనార్థమెత్తివచ్చుచుండె నని తెలిపెను. ఆవృత్తాంతము విని రాక్షసేశ్వరుఁడు తారకవిద్యున్మాలిప్రముఖు లగుననుజగణంబులను, భృత్యగణంబులను బిలిపించి నారదునివచనంబులను వారికెఱింగించుటయు నప్పుడు తారకుం డిట్లనియెను. మహారాజా! మీ రేల విచారించెదరు ? మన

మందఱము నిశ్చయముగా నవధ్యులము. ఈత్రిపురంబులను ధ్వంసము గావించుసమర్థు లెవ్వరున్నారు? ఇప్పుడు దేవతలందఱును గలసి మనపై నెత్తివచ్చుచున్నారు. దుర్బలులగువారు సామదానభేదోపాయంబులచేఁ గార్యనిర్వహణముం గావించుకొందురు. మహాత్ములు యశంబును గోరుచుందురు. బలవంతుఁడు తనపరాక్రమమును బ్రదర్శించుచుండును. జిగీషాపరతంత్రుఁ డగుబలవంతునకు దుర్బలునియెడల దండవిధానమే కర్తవ్యము. స్వర్గవాసు లగుదేవత లీమనదానవులయంతటిబలవంతులు గారు. ప్రచండదండమూలంబున మనము వారిని జయించి సుఖముగా నుండవలయును. అని చెప్పుటయు మహాబలపరాక్రమశాలి యగువిద్యున్మాలి గంభీరస్వరముతో దుర్బలు లగుదేవతలు మనతో రణంబు గావించుటకు సమర్థులు గారు. మూఢులై వారు మనమీఁదికి దండెత్తియే వచ్చినచో నిశ్చయముగా వారికి క్షయంబును, మహారణమునందసురులకు విజయంబును సిద్ధించును. మహారాజా! కావున నీవు సర్వదేవతావినాశంబు గావించి స్వర్గంబునఁ గూడ దానవరాజ్యమును బ్రతిష్ఠింపుము. త్రిభువనలాభంబున నీవింద్రుండ వయ్యెదవు. అప్పుడు మేమందఱమును నిన్ను హిరణ్యాక్షహిరణ్యకశిపులంబోలి యుగ్రగణ్యునిగా నెంచి సప్తలోకేశ్వరుండ వగునీదర్శనముచే నిరంతరసంతుష్టుల మగుచుందుము. నీవు జగంబుల కన్నిటి కేలికవై విశ్వరాజ్యంబు ననుభవించుచు వారితో సమానుండవై విరాజిల్లెదవు. అని చెప్పుటయు మయుండు మాటిమాటికి శిరఃకంపంబు గావించుచు దానవవీరులారా! ఇది యుచితముగాదు. శత్రువులు మనతో సమానులైనను, మనకంటె హీనబలులైనను మనమిప్పుడు సామోపాయంబుననే కార్యసాధనంబు గావించుకొనవలయును. ఏమనిన—భగవంతుండును, సర్వభూతేశ్వరుండును, ప్రభుండును, మహలను, దేవత

లనుగూడ సృష్టించినవాఁడును సంహరించువాఁడు నగుమహాదేవుఁడే స్వయముగా మనలను నాశంబుసేయునుద్దేశముతో నెత్తి వచ్చుచున్నాఁడు. ఇప్పు డింక నుపాయ మేమున్నది? కేవలసద్గుణంబులచే నాతనికిఁ బ్రణమిల్లుట, యాతనిశరణముం గోరుట యనునీరెండుపాయములే యిప్పుడు మనకార్యసాధనమున కుచితమైనవి. నాబుద్ధి కిట్లుతోఁచుచున్నది. ఒకవేళ మీరు కర్కశత్వము నవలంబించి మహాదేవునితో యుద్ధమే చేయఁదలంచినచో నిశ్చయముగా నాతనివక్రదృక్పాతంబుచే సద్యోనిహితులు గాక మానరు. బ్రహ్మాదిదేవతలు రిపుపీడితులై యెవ్వనిశరణంబు గాంచుచుందురో యట్టిమహాదేవునే యెదిరించువారిని రక్షించుటకు సమర్థు లింకెవ్వరున్నారు? ఆదేవుండు తలంచినచో బ్రహ్మాదిసకలలోకంబుల నొక్కక్షణములో వినాశనంబు నందింపగలఁడు. మరల నొక్కక్షణములో సృష్టింపఁగలఁడు. మోక్షైకకారణుండును, జగద్బీజుండు నగుదేవునితో రణంబుగావించుట మనకెట్లు సంగతం బగును. ఈయుద్ధమువలన మనవిశుద్ధతపోవినాశంబు గాఁగలదు. దానవులారా! పాటిబెడ్డలవంటిమీరు పర్వతముతోఁ దులఁదూఁగఁదలఁచుచున్నారు. కాలపాశబద్ధులై మీరు మహాదేవునితో యుద్ధము చేయఁగోరుచున్నారు. నేనమ్మహాదేవునిభక్తుండనుగావున నాతని మహాత్త్వమును విశేషించి యెఱుంగుదును. ఇతరు లెట్లెఱుంగఁగలరు? నేనాదేవునియెదుట వినమ్రుఁడనై నిలిచి యుండెదను. ఎన్నటికిని శివునితో నేను యుద్ధము సేయఁజాలను. నాయాలోచన మీకు రుచించినచో మీరీశ్వరునితోడి యుద్ధమును మాని యాతనిశరణముం గోరుకొనుఁడు.

మహాబలశాలియు, విశ్వకర్మయు నగుమయుం డిట్లు చెప్పుటయు భగవానుం డగునారదుండు దైత్యవినాశనంబు నుద్దేశించియిట్లనియెను.

ఓవిశ్వకర్మా! నీవు సవిస్తరంబుగాఁ జెప్పినవాక్యములు యుక్తియుక్తము గా నున్నవి. కాని ప్రస్తుతసమయంబున కివి యుచితంబులు గావు. మీతపమంతయును క్షీణించి మీయైశ్వర్యము పరిభుక్తమై యున్నది. ఇఁకఁ బిఱికితనమునుగూడఁ బ్రకటించి యగౌరవము నేల తెచ్చికొందురు? మీవినాశంబుకొఱకు సకలదేవతలు నేకీభవించి మహాదేవునిసాహాయ్యముం గోరికొనియున్నారు. మీరిప్పుడు నమ్రత నవలంబించి యున్నను మహేశ్వరుఁడు దేవహితంబుకొఱకు మిమ్ము సంహరింపక మానఁడు. మీరు దనుతనయులై, మహారాజులై, మహాబలగర్వితులై యుండియును సామాన్యులవలె భయభ్రాంతులై యేల మృత్యుముఖమునుండి రక్షణముం గాంచుటకుఁ బ్రయత్నించెదరు? యుద్ధము మానుకొనుటవలన మీకింతకంటె మహైశ్వర్యము లభింపఁబోదు. కాని మీయశంబునకు వినాశంబు మాత్రము గలుగక మానదు. కావున మీకిది శుభదాయకంబు గానేరదు. ఒకవేళ మీరు మహాదేవునితో మహారణంబు గావించి మరణించినను మీకు నిశ్చయముగాఁ బ్రమథాధిపత్యము సిద్ధింపఁగలదు. దేవతలవిషయంబున సామాద్యుపాయంబులచే మీకార్యసిద్ధి యగుట కవకాశము లేదు. కావున మహాదేవునితో యుద్ధముగావించుటయే మీకిప్పుడవశ్యకర్తవ్యము. మీ బలపరాక్రమములం గాంచి మహాదేవుండు ప్రీతుఁడైనను గావచ్చును. ఆతఁడు మీకు వరంబులిచ్చినను నీయవచ్చును. కావున మీరు మీ విక్రమమును బ్రకటించుటే యుచితము. మీకు శస్త్రఘాతనివారణంబగునట్లు నేను రక్షోపాయంబు నాలోచింతును. మీరిఁక యుద్ధాభిలాషులై విజయోత్సాహముతో బయలుదేఱుఁడు.

అని చెప్పిన నారదునిమాటలకుఁ దారకవిద్యున్మాలులు తమ యంగీకారమును సూచించిరి. మహాసురులు [illegible]ను గాలపాశబ

ద్ధులై, క్షీణపుణ్యులును, గతాయుష్కులు నగుటచేతనే వారిహృదయ
ము లెల్లు పరివర్తితములై పోయెను. అప్పుడు మయుండును దానవవినా
శకాలంబు సమీపించిన దని గ్రహించి నారదోపదేశంబున కంగీకరిం
చెను. నారదుండు ప్రహృష్టహృదయుండై మీకస్త్రభయంబు లేకుం
డు నని కపటంబుగాఁ జెప్పి వారికి రక్షాబంధనంబులఁ గావించి యు
ద్ధాభిముఖులం జేసి తాను శివరథాభిముఖుండై పోయెను. పిమ్మట
సకలదానవులును రణంబునకు దృఢనిశ్చయులై వివిధంబులగు నస్త్ర
శస్త్రంబులను సంపాదింపఁదొడంగిరి. తారకాక్షుండును, బలుండును,
బాణుండును, విద్యున్మాలియు, వీరయోధోచితంబులగు వేషంబులతో
సర్వసన్నద్ధులై నిలుచుటయు సహస్రసహస్రశంఖభేరీప్రముఖరణవా
ద్యంబులు దిక్కులు వ్రక్కలగునట్లు మ్రోగ నారంభించెను. అప్పుడు
దుర్బలభయంకరం బగుదానవసేనామధ్యమున "రథ మతివేగముగా
వచ్చుచున్నది ! అదిగో ధ్వజపటము ! ఎంతశీఘ్రముగా వచ్చుచున్న
ది !" అను నుత్సాహవాక్యములు వెలువడుచుండెను. భయవిషాద
శూన్యు లగుత్రిపురదైత్యగణంబులు క్రుద్ధులై యుత్తమాస్త్రంబుల
హస్తంబులం దాల్చి రణసన్నద్ధులై రథంబువంకఁ బ్రతీక్షించుచు దవా
నలంబు నెదిరించు పశువులంబోలి రథాభిముఖులై చనుచుండిరి.

## త్రిపురదహనము.

వివిధధ్వజశోభితంబును, జిత్రిచూడావిశిష్టంబు నగుశివరథంబు
పశ్చిమసాగరమూర్ధంబున రెండవహిమాచలేంద్రముం బోలి విరాజిల్లు
చుఁ ద్రిపురాభిముఖంబుగ నేతెంచుచుండెను. నందీశ్వరాది శివసేనా
నాయకులు త్రిపురదుర్గంబును గాంచినంతనే పరస్పరమును గలిసికొని
యుద్ధోత్సాహముచే సింహనాదంబులు గావింప నారంభించిరి. భయం
కరవిగ్రహుండును, మహాత్ముండును నగు చండేశ్వరుండు జ్వాలాభీలం

బగుదారుణకుఠారముం దాల్చి భీకరవదనగహ్వరమును దెఱచుకొని శివసన్నిధిని నిలిచి యుండెను. శివసమానపరాక్రమశాలియుఁ, దిర్లో చనుండు నగునందీశ్వరుండు తీక్ష్ణంబగు త్రిశూలమును, బ్రచండంబగు ముసలంబును గరంబులం దాల్చి మహాదేవుని పార్శ్వంబున నిలిచియుండెను. మహాత్ము లగుభృంగి, వీరభద్రుఁడు మొదలుగాఁగల వీరపరాక్రములగు నసంఖ్యప్రమథగణంబులు వజ్రత్రిశూలగదాఖడ్గాదిప్రహారణంబులఁ గరంబులఁ దాల్చి విజయోత్సాహముతో యుద్ధసన్నద్ధులై వచ్చుచుండిరి. అప్పుడు తారకాక్షాదిదైత్యులు శివరథంబు తమ్ము సమీపించుటం గాంచి వివిధాయుధధారులై మూఢత్వంబున యుద్ధోత్సాహులై ప్రమథగణంబులపైఁ బడి విజృంభింప నారంభించిరి. చంద్రరేఖావతంసుం డగుసదాశివుండు సర్వంబును గనుంగొనుచుఁ దిర్పురదహనంబుకొఱకు వేచి యున్నవాఁడు గావునఁ బ్రమథగణంబులకును, దైత్యగణంబులకును జరుగుచున్న భీకరసంగ్రామముం గాంచి యట్టహాసంబు గావించెను.

అప్పుడు నందీశ్వరుండు మహాసత్త్వులగు ప్రమథగణంబులతోఁ గూడ దానవులపైఁ బడి మహారణంబు గావింపఁదొడంగెను. క్రోధరక్తలోచనుం డగుభృంగి యప్పుడు దశనిశితశరంబులచే విద్యున్మాలిభునికాయంబునఁ గాఢంబుగఁ గాయంబులఁ గావించెను. వివిధాయుధధారు లగునసురవీరు లాతని ముట్టడించి రణవిజృంభణంబు నెఱపిరిగాని యెవ్వరు నాతని కెట్టిపీడనమును గల్పింపఁజాలకపోయిరి. అనంతరము భృంగిరిటి నిశితాగ్రం బగుతనత్రిశూలముతో విద్యున్మాలిభుని పృష్ఠభాగమునం బొడుచుటయు నాతఁడు ఘూత్కారంబు సేయుచు భయభ్రాంతుఁడై పలాయితుఁ డయ్యెను. దానవేశ్వరుం డట్లు పాఱిపోవుచు సునిశితంబు లగుసప్తశరంబులచే గణేశ్వరునిస్కంధదేశమును

విద్ధంబు గావించి మరలఁ ద్రిషష్టిబాణంబులచేతను, దశశరంబులచేత
ను నాతని మర్మాహతునిం గావించెను. అప్పుడు గజవదనుం డగువినా
యకుండు క్రుద్ధుండై మృణాలంబునుండి పద్మోత్పాటనంబు గావించు
మదగజంబునుం బోలి యావిద్యుత్ప్రభు నంగయష్టినుండి యుత్తమాం
గము నుత్పాటితంబు గావించెను. రణక్షేత్రమునం దామస్తకము గజ
సన్నిభంబగు నయ్యసురుని దేహమునుండి విచ్ఛిన్నంబై పడి హ్రదస్థి
తంబును, మృణాలవిచ్యుతంబును, భృంగనినాదితంబునగు పద్మముం
బోలి విరాజిల్లుచుండెను. అప్పు డంధకతుల్యవిక్రములగు నేమియు,
బలుండు నను నసురేశ్వరులు గణనాయకశంకుకర్ణులం దాకి, శరవర్షం
బు గురియించుటయుఁ బ్రమథనాయకులు కోపోద్దీపితులై యాదానవ
నాయకులను విరథులం గావించిరి. వారు మరల వేఱురథంబుల నధిరో
హించి యొక్కుమ్మడి గణేశ్వరునిపయిం బడి తీక్ష్ణశరప్రయోగంబున
నొప్పించుచుండ శంకుకర్ణుం డతిక్రోధంబున ముసలధారియై విజృంభించి
యాక్షణమునందే యావీరద్వయమును యమలోకంబున కంపివైచెను.
అంతఁ ద్రిపురవాసు లగునితరదానవవీరు లందఱును రణవిజృంభితులై
ప్రమథగణంబుల నొక్కపెట్టునం దాఁకి వజ్రనారాచఖడ్గకుఠారాదివివి
ధాయుధంబులఁ బ్రయోగించుచు మహారణరంగంబున సింహంబులచే
నిహతంబులగు మృగంబులం బోలి నిహతు లగుచుండిరి. గిరితుల్య
దేహు లగుకొంద ఱసురవీరులు భిన్నహస్తులును, భ్రష్టాయుధులు నై
శోణితధారలతో వాత్యాహతమేఘములం బోలి సముద్రపతితు లగు
చుండిరి. ఇట్లు బలనేములు సబలంబుగా రణనిహతు లగుట నాలకించి
తారకాక్షుండు క్రోధతామ్రాక్షుండై పురంబు వెలువడి వచ్చి గణనా
యకునిపయిం బడుటయు శంకుకర్ణగణేశ్వరులు తమముసలాయుధంబుల
నాతనిమస్తకంబునఁ బ్రయోగించిరి. తారకాక్షుండును వానిని లక్ష్యం

బు సేయక చక్రప్రయోగముంగావించెను. అప్పుడు శంకుకర్ణుండు చ
క్రాహతుం డయ్యును జలింపక యతివేగముగఁబోయి యాతనిమస్తకం
బున దృఢముష్టిప్రహారముం గావించెను. అయ్యాఘాతంబునకుఁ దార
కాక్షుండు భూపతితుండై తూలుచు నంతలో నొక్కయెదుటున లం
ఘించి తననిశితఖడ్గమును శంకుకర్ణునిపై విసరి యాక్షణంబుననే విక్ష
తాకారముతో మృత్యుముఖంబునఁ బడిపోయెను.

అట్లు మృతుండైన దానవేశ్వరుం గాంచి యసురవీరులందఱును
దుఃఖాక్రాంతులై తత్క్షణంబ యాతని మయమందిరంబునకుఁ గొని
పోయి దుఃఖగద్గదస్వరంబులతో రాక్షసేంద్రుఁ డగుమయునకు సర్వ
వృత్తాంతమును నివేదించిరి. అప్పుడసురాధీశ్వరుండగుమయుండు వారి
నూఱడించుచు దైత్యయోధులారా! మనము తెచ్చినయమృతముచే
నీతని బునర్జీవితునిం గావింపుఁ డని ప్రబోధించెను. ఆమాట విన్నంత
నే దానవులందఱును బ్రఫుల్లవదనులై యమృతప్రయోగముచేఁ దార
కాక్షుని మరల బ్రదికించి మయాసురున కభివందనంబులఁ గావించిరి.
అట్లు పునర్జీవితుం డగుతారకాక్షుండు మరల రణాభిలాషియై యతిశీఘ్ర
ముగ రణరంగమున కరుదెంచెను. అట్లు మరణించియు మరలజీవించి
వచ్చిన తారకాక్షుం గాంచి బ్రహ్మదేవుండు తనవామహస్తంబుచే నా
తనిం జూపుచు మహేశ్వరు నుద్దేశించి యిట్లనియెను. మహాదేవా!
శంకరా! ఈతారకాక్షుండు నిహతుం డయ్యెను. ఈతని మయాసురుం
డు మరల జీవితునిం గావించినాఁడు. దేవదేవా! ఆతనియొద్ద నుత్తమం
బగునమృత మున్నది. దానిచే నాతఁడు సకలదానవులను బ్రదికించు
చున్నాఁడు. కావున నీవమ్మయాసురుని బ్రహరించి యాతనికడనుండి
యమృతహరణంబు గావింపుము. అని చెప్పినంతనే మహాదేవుం డట్లు
గావించెను. అంతఁ బితామహుండు ప్రహృష్టహృదయుండై శంకరా!

ప్రబలపరాక్రములగు దైత్యులతోఁ బ్రమథగణంబులు గావించు మహా రణమును దిలకించితిని. ఈరీతిగా వేయిదివ్యవర్షంబులు గడచినను త్రి పురవినాశంబు గాఁజాలదు. దేవా! శీఘ్రంబుగ నీవు ప్రదీప్తబాణప్ర యోగంబు గావించి దేవద్వేషులగు దానవులను సంహరింపుము. సహ స్రవర్షంబులును నిండినచో నీత్రిపురంబు లొకసారి కలసికొని మరల విడిపోవుచుండును. దేవదేవా! నీకాసంయోగముతోఁ బనిలేదు. నీవు తలంచినచోఁ ద్రిపురంబులు నిమిషమునందే దగ్ధంబులు గాఁగలవు. మహాదేవా! నాయందు నీకాదరంబు గలదేని నామాట విని త్రిపురం బులపై బాణప్రయోగంబు గావింపుము.

అని బ్రహ్మదేవుండు ప్రార్థించుటయు మహాదేవుండు దృఢంబగు పినాకనామకధనుర్గ్రహణంబు గావించి యానమితోన్నమితిపూర్వకం బుగా గుణాకర్షణంబు చేసి యందు శరసంధానం బొనరించుటయు సకలదానవసహితంబుగాఁ ద్రిపురంబులును, సకలజగంబులును నిష్పం దితంబు లయ్యెను. అంత మహాదేవుండు చంద్రాగ్నిముఖంబును, విశాలంబును, త్రైలోక్యసంహారకంబు నగు తీవ్రశరంబును ధనుర్విము క్తంబు గావించి యంతలోనే "అయ్యో! ఎంతపని జరిగినది!" అనియె ను. శివునివదనకమలమునుండి యావాక్యము వెలువడినంతనే నందీశ్వ రుండు సన్నిధి కేతెంచి యేమిజరిగినదిస్వామీ యని ప్రశ్నించుటయు దేవదేవుండు వత్సా! మయాసురుండు నాకుఁ బరమభక్తుండు. ఆతని కిమంగళముం గూర్చుట నాయభిమతము గాదు. కావున నీవెల్లయినఁ బోయి యాతనిపురంబు దగ్ధంబు గాకుండునట్లు చేయుము. నీవు శీఘ్ర ముగఁ బోయి యాసోమానలులను నివారింపు మని యానతిచ్చెను. నందీశ్వరుండును మహాదేవాదేశంబున యోగశక్తిప్రభావముచే వా యువేగంబునఁ బూర్వపురంబునకుం బోయి యటదానవగణసహితుం

మును, వినమితమస్తకుండును నగుమాయాసురుండు మహాదేవు నారా
ధించుచుండుటం గాంచి మృత్యుభయంబున శరణాపన్నుండగునాశ్రిత
భక్తు నాశ్వాసించుచు భక్తమణీ! నీకు భయంబు లేదు. భక్తశిరోమణి
వగునిన్ను మహాదేవుండు పరీక్షించెను. అని చెప్పుటయు మయుండు
పరమానందంబున మహాదేవునింబోలి నందీశ్వరునకును నమస్కారంబు
గావించెను. అప్పుడు వైశ్వానరుండు త్రిపురదహనంబు గావించుటకై
నలుదెసలం బ్రజ్వరిల్లుచు, జగత్ప్రళయంబు గావించుకల్పాంతానల
ముంబోలి ప్రదీప్తుండై త్రిపురంబుల నాక్రమించుచుండుటయు నందీశ్వ
రుం డాతనిం గాంచి హుతాశనా! నీవీత్రిపురదహనంబు సేయవలదని
యెను. ఆమాటవిని వీతిహోత్రుం డిదియేమనియెను. ఈపురమధ్యం
బున మహాదేవభక్తుం డగుమయాసురుండున్నాఁడు. ఆతనిరక్షింపవల
యు నని మహాదేవాజ్ఞయైనది. అని చెప్పుటయు ననలుండు మయుం
గాంచి దానవేశ్వరా! శీఘ్రముగా నీవీపురమునుండి వెడలిపొమ్మనియె
ను. తోడనే భయార్తుండగుమయాసురుండు సువర్ణమయం బగుతన
శివలింగమును గైకొని యుమాపతికిఁ బ్రణామంబు సేయుచు నాపురం
బు వెలువడి యతివేగముగఁ బాతాళమునం బ్రవేశించెను. నందీశ్వ
రుండు మరలివచ్చి సర్వవృత్తాంతమును సర్వేశ్వరునకు నివేదించెను.

తోడనే త్రిపురంబులును బ్రజ్వలితంబు లయ్యెను. వేదిగృ
హంబు లన్నియు విపర్యస్తంబులును, వినష్టంబులు నగుటయు రాక్ష
సులు వానిని బరిత్యజించుచుండిరి. దైత్యరమణీమణులు వివస్త్రలై
పరుగులువాఱుచు నార్తనాదంబులచే దిక్కులం బ్రతిధ్వనింపఁజేయు
చుండిరి. మద్యపానవిహ్వలలును, పర్యంకశయానలును, స్నానమాన
దాతవిగ్రహలును, ప్రియాలింగితలును, హర్మ్యవాతాయనవిమానోప
విష్టలు నగునసురకాంతలు రక్తనిశాలయనములతో దారుణాగ్నిజ్వా

లలం గాంచి భయభ్రాంతలై పలాయితలగుచుండిరి. అప్పుడావిభ్రాంతనారీగణంబులం గాంచి వారిప్రియులు గాఢాలింగనంబులఁ గావించుకొని మోహాముగ్ధులగుచుండిరి. అంతలోనే తత్తరపడి శివభక్తివిహీనులగు నయ్యసురవీరు లుద్వేగముతోఁ బరుగెత్తిపోయి సముద్రమధ్యమునఁ బడిపోవుచుండిరి. పర్వతోపమానంబులు నతితీవ్రంబులు నగు నక్రాదిజలచరంబు లారాక్షసులను గబళించి తృప్తిఁ గాంచుచుండెను. మఱియు విచ్ఛిన్నముక్తాహారలును, బలివిహీనలును, సముద్రపతితలు నగు దైత్యసుందరులనుగూడఁ గరాళవదనంబులఁ దెఱచి భయంకరదంష్ట్రలచే భక్షించుచుండెను. అట్లు భక్షిత లగుచున్న కాంతలు క్రోధదృష్టులను దమపతులవంకఁ బరగించుచు మరణించుచుండిరి. ఆదీనకోపదృష్టులం గాంచి దైత్యయువకులహృదయములు పగిలిపోవుచుండెను. ఈరీతిగా దైత్యవీరులు తమసతీమణులతోఁగూడ నగ్నిదగ్ధులై సముద్రజలంబులఁ బడి నక్రాదుల కాహారంబులై పోవుచుండిరి. ఇట్లొకనిమేషమాత్రమున సోమానలవిష్ణుస్వరూపంబగు నాతీక్ష్ణబాణము త్రిపురదహనంబు గావించి మరల మహాదేవునికరకమలంబు నలంకరించెను.

ఇట్లు త్రిపురదహనంబును, దైత్యవినాశంబు నగుటయు సృష్టిస్థితిలయకారకుం డగుమహాదేవుండు క్రమ్మఱ దివ్యరూపధారణంబు గావించి సకలదేవతలకును సుస్థిరత్వముం బ్రసాదించెను. అప్పుడు బ్రహ్మాదిదేవతలు మహాదేవునకుఁ బ్రణామంబు గావించి యిట్లు స్తుతింపనారంభించిరి. దేవా! నీవలన నసాధ్యం బగు నీశుభకార్యము సంపన్నంబైనది. ఇది యన్యుల కతిభయంకరమైనది. త్రిపురదహనంబును, దైత్యనాశనంబును నగుటచే మాహృదయములు శాంతించినవి. ప్రమథనాథా! నీవు సర్వదా సర్వస్థితుండవై యుండుము. దేవతాదులకు

సృష్టికర్త వగునీకు నమస్కారము. సర్వగతుండవు, నిత్యుండవు నగు నీవిజ్ఞానమునందే సమస్తజగత్క్రియలును సంపన్నంబు లగుచున్నవి. మహాదేవా! నీకు నమస్కారము. అని వినుతించుటయు శంకరుండు సంతుష్టుండై సురలారా! నాకు మీరు పాలనీయులును, బుత్త్రసదృశ రక్షణీయులు నైయున్నారు. ఇప్పుడు మీశత్రువినాశం బయ్యెను గావున మీయభిమతంబులు సిద్ధించినవి. మీరిఁక మీస్థానంబుల కరుగవచ్చు నని యానతిచ్చుటయు సకలదేవతలును మహాదేవునకుఁ బ్రణామంబు లాచరించి పరమానందహృదయులై తమతమనివాసములకుం బోయిరి. అనంతరము జగత్కర్తయుఁ ద్రినయనుండు నగుశివుండు సిద్ధసాధ్యగణపూజితుండై చండీశ్వరనందీశ్వరవీరభద్రప్రభృతులతోఁ గూడి కైలాసశిఖరంబునకుఁ బ్రయాణమయ్యెను.

వ్యాసమునీంద్రా! దేవదేవునిచేఁ గావింపఁబడిన యసాధ్యకార్యం బగుత్రిపురదహనవృత్తాంతమును నీకు వినిపించితిని. శుచియై దీని నధ్యయనంబు గావించుశివభక్తుండు సర్వపాపవిముక్తుండై దివ్యరూపముం దాల్చి స్వర్గప్రాప్తుం డగును.

—: ద్విజమాహాత్మ్యకీర్తనము. :—

సనత్కుమారుం డిట్లనియెను. వ్యాసమునీంద్రా! దేవదేవుం డగుశంకరుం డుమాసహితుండై కైలాసశిఖరమునం దుపవసించియున్నసమయంబునఁ బార్వతీదేవి పరమేశ్వరునకుఁ బ్రణామంబు చేసి యిట్లనియెను. స్వామీ! నైమిశారణ్యవాసి యగు హిరణ్యుండను నొకబ్రాహ్మణుఁ డుంఛవృత్తిచే జీవించుచున్నాఁడు. తపశ్శౌచభక్తియుక్తుండును, శమాదిగుణసంపన్నుండు నగునాతనిసన్నిధికి నేను స్వయముగఁ బోయి పూజింపఁబడుచుందును. తపస్వియగు నాబ్రాహ్మణుని మాహాత్మ్యముఁ గాంచి నేను విస్మయాక్రాంతహృదయనై

యట్టిమాహాత్మ్యముగలబ్రాహ్మణులు దేవతలకంటెను శ్రేష్ఠులే యని భావించితిని. కావున బ్రాహ్మణమాహాత్మ్యము వినవలయు నని నాకుఁ గుతూహలము గలుగుచున్నది. అనుటయు మహాదేవుం డిట్లనియెను. ఓసురాసురనమస్కృతచరణకమలా! జగద్ధాత్రీ! నీయుద్దేశము సత్య మే. తపస్వులగు బ్రాహ్మణులు దే[illegible] శ్రే[illegible] [illegible]యుం బగుపూర్వసృష్టియందు మొట్ట[illegible] [illegible]చుం టిని. అనంతరము నేను మహా[illegible], [illegible]స్వరూపులు నగు బ్రాహ్మణులను సృష్టించితిని. నన్ననుసరించియే బ్రహ్మయును బ్రథమమునఁ దనమస్తకమునుండి బ్రాహ్మణులను సృష్టించెను. నేనెప్పుడును ద్విజన్ముల కగ్రసక్తుఁడనై యుందును గావున వారు శ్రేష్ఠులైరి. అందుచేతనే బ్రాహ్మణులు నిరంతరమును మచ్చింతారతులై యుం దురు. ధర్మార్థకామమోక్షంబు లనుచతుర్వర్గములును బ్రాహ్మణుల యందే సుప్రతిష్ఠితములై యున్నవి. బ్రాహ్మణులే యజ్ఞహోమహావి స్స్వరూపులు. వారిమూలముననే దేవతలు సంతృప్తు లగుచుందురు. బ్రాహ్మణహితమునందే యీజగంబంతయును బ్రతిష్ఠితమై యున్నది. అట్టియుత్తమబ్రాహ్మణలక్షణంబు వర్ణించెద నాకర్ణింపుము.

దేవీ! కలికాలమునందు బ్రాహ్మణులశౌచాచారకర్మపరిభావ వైభవంబులం గూర్చి చెప్పెదను వినుము. జన్మమే బ్రాహ్మణసంజ్ఞకు హేతుభూతమై యున్నది. సంస్కారము ద్విజసంజ్ఞకుఁ గారణము. విద్య విప్రనామమునకు మూలము. ఇట్లు బ్రాహ్మణులు త్రివిధంబులఁ బరగుచుందురు. సంస్కారసంపన్నులును, వేదపారగులు నగుబ్రాహ్మ ణులకు రత్నధనధంబులయందుఁ బుణ్యపాపంబులు సమంబులై యుండు ను. జన్మచేతను, సంస్కారముచేతనుగూడ బ్రాహ్మణుఁడై మఱియు సర్వశాస్త్రవిశారదుండును, తపశ్శౌచసమన్వితుండు నగువాఁడు త్రి

వుండఁబరగును. దేవపితృకర్మంబులయం దట్టిబ్రాహ్మణునకు భోజ
నంబిడువాని సత్కర్మంబు లక్షయఫలదాయకంబు లగును. వేదవేత్త
యు, వహ్నిహోమపరాయణుండు నగుబ్రాహ్మణుండు శ్రేష్ఠుండు
గావున నాతఁడు పూజితుండై తరింపఁజేయుటకు సమర్థుం డగును.
జాతిమాత్రబ్రాహ్మణుండుగూడ సర్వవిషయములయందును బూజ్యుం
డును లోకగురుండు నై యుండును. అట్టివానిని బూజించుటవలనఁ
గూడ సులభముగాఁ బుణ్యఫలంబు సిద్ధింపఁగలదు. అగ్నిహోత్రం
బును, దపంబును, యోగంబును, శౌచంబును, ఋజుభావమును,
సత్యంబును, వేదపరిసంగము ననునివి బ్రాహ్మణకర్మంబులు. మిథ్యా
వాదంబును, బ్రాణిహింసనంబును, సేవాచరణంబును, బాపాసక్తియు
బ్రాహ్మణులకు విరుద్ధకర్మంబులు. బ్రాహ్మణుఁడు కేవలము తపస్వి
యై యుండవలయును. అతనికిఁ బునర్జన్మంబు లేదు. విద్యయు, బ్రా
హ్మణ్యంబును లభించినవాని కిఁక గర్భనరకానుభవంబు లేదు. చంద్ర
సూర్యాదికంబు లగునాయష్టమూర్తులును బ్రాహ్మణునందే సుస్థిరము
లై యున్నవి. నష్టబ్రాహ్మణులైనను శుభాశుభవితరణంబునకు సమ
ర్థు లగుదురు. ఇట్టిచో మహాతేజోమయు లగుబ్రాహ్మణుల కసాధ్య
మేమున్నది? వారియనుగ్రహాగ్రహంబులచే శుభాశుభంబులు తమం
తనే సంఘటిల్లుచుండును. వేదవిద్యావిశారదులును, దపస్వులు నగు
బ్రాహ్మణులు వృత్తిదాయకులై దేవగణంబులకుఁగూడ దేవతలై యుం
దురు. నేనును బ్రహ్మయు బ్రాహ్మణగణంబుల కుత్పాదకులము.
సత్త్వప్రవృత్తు లగుబ్రాహ్మణులు బ్రహ్మోత్పన్నులు. ఓదేవీ! నీవు
బ్రకృతివి. నేను పరమపురుషుఁడను. గుణకర్మవ్యాప్తం బగురజోగుణ
ము నీస్వరూపము. రజస్తమోగుణంబులు మోహాత్మకము లైనవి.
సత్త్వగుణము మోహనాశకమైనది. అట్టిసత్త్వగుణము సాగ్నికక్రియ

లచే వర్ధిల్లుచుండును. సత్త్వగుణావలంబులును, మహాత్ములు నగుబ్రా
హ్మణులు వహ్నిసదృశతేజస్సంపన్నులై యుందురు. వారు సర్వవిష
యములందును నవ్యాహతగతులై యుందురు. వారి నెవ్వరు నడ్డగిం
పఁజాలరు. ఆర్జవంబును, సమతయు బ్రాహ్మణతేజస్వరూపము లని
యెఱుంగవలయును. విద్యాతపంబులకంటె నార్జవమే శ్రేష్ఠమైనది.
సమతాగుణంబువలన నసాధ్యం బగుమోహబంధంబును, పాపంబు
లునుగూడ నశింపఁగలవు.

దేవీ ! పూర్వము భాగీరథీతీరంబునఁ బరమధార్మికుండును, ఉం
ఛవృత్తిజీవనుండును నగుదానరుచి యనుబ్రాహ్మణుండు వాసము చేయు
చుండెను. ఆతఁడు సర్వవిద్యాసంపన్నుం డగుటచే వినీతాత్ముండును,
సర్వభూతాభయప్రదుండు నై సహధర్మిణీసహితముగ నిరంతరము న
గ్నిహోత్రంబు సేయుచు నభ్యాగతులగు నతిథులను ముందుగా భో
జనాదికంబులచే సంతృప్తులం గావించుచు దివసమునందలియాఱవభాగ
మునందు సతీసహితముగఁ దాను భుజించుచు నీవిధముగా ధర్మనిష్ఠుఁ
డై కాలక్షేపము సేయుచుండెను. ఈనియమముతో నాతనికిఁ జాల
కాలము గడచిపోయెను. ఆతనియింటికి వచ్చినయతిథు లెవ్వరు నేఁడుఁ
డు నూరక మరలిపోలేదు. తపశ్శౌచపరాయణుఁ డగునాబ్రాహ్మణుఁడు
సూర్యాగ్నులకంటెను నధికతేజస్సంపన్నుఁడై యుండెను. ఆతనితపం
బుచే నగ్నిదేవుండు పరమసంతుష్టుండై యభీష్టఫలప్రదాత యగుచుం
డెను. ఇట్లుండ నాతని కొకదినంబున నతిథియొక్కండును లభింపకపో
యెను. ప్రబలం బగుశీతంబుచే దుర్దినాయమానంబై యున్నయాదినం
బున నతిథికొఱ కాతఁడెంతయోప్రయత్నించెను గాని ప్రయోజనము
లేకపోయెను. సాయంకాలమువఱకు నెవ్వరును లభింపకుండుటచే నియ
మనిష్ఠుండగునాబ్రాహ్మణుండు చింతాన్వితుండై భగవంతుం డగువాసు

దేవుని ధ్యానించుచు నుపవాసంబు నవలంబించియుండెను. సౌభాగ్యవతి యగునాతనిసహధర్మిణి పతిభక్తిపరాయణ గావునఁ బతియెట్లుచేసిన నట్లే చేయుచుండెను.

ఓపార్వతీ! ఆబ్రాహ్మణుండు ద్వంద్వభావవిరహితుండయ్యు నప్పుడు శీతవాతాదిపీడలచే ఖిన్నుండై పడి యుండెను. కాని, శీతబాధనెల్లనను, నాఁడు దుర్దినం బగుటచేతను నతిథియెవ్వఁడు నచ్చటికి రాఁడయ్యెను. అప్పు డగ్నిదేవుండు మహాత్మ్యమంబును బరమంబు నగునా భూదేవునినిశ్చయం బెఱింగి కుత్సితంబును, వికృతంబునగు చండాలరూపముం దాల్చి యొకతరుమూలంబునఁ గూర్చుండి యాబ్రాహ్మణునకు దృష్టిగోచరుం డయ్యెను. అతిథిసంగ్రహంబునకై తిరిగితిరిగి యుపవసించియున్న యవ్విప్రుండు వికృతరూపుండును, ఘోరదర్శనుండు నగు చండాలుంగాంచెను. వానిశరీరమంతయు వ్రణమయమై యావ్రణంబులనుండి క్రిములును, శోణితమును వెలువడుచుండెను. వాఁడు శీతబాధచేఁ గంపితదేహుఁడై యార్తనాదము గావించుచుండుటయు బ్రాహ్మణుండు మృదుమధురస్వరముతో భయము లేదని యాతని నూఱడించి యగ్నిని బ్రజ్వలింపఁజేసి యాతనిశీతబాధను నివారింపఁజేసి పరమాదరంబున నీవు మాయింటికి వచ్చి భుజింపు మని చెప్పెను. అప్పుడు దీనుండగుశ్వపాకుండు తపోనిధి యగుభూసురుంగాంచి మహీదేవా! నేను చండాలుఁడను. మృగవిహంగములకుంబోలి నాకిచ్చుటనే యన్నము పెట్టఁదగును. నేను మీగృహంబున కరుదెంచి భుజించుట కర్హుఁడనుగానని నివేదించెను. ద్విజవరుండును ధ్యానబలంబుచే నాతఁడు వైశ్వానరుం డని గ్రహించి, యోపాపరహితా! నేను నీజాతిని బూజించుట లేదు. సర్వశ్రేష్ఠంబగునాత్మ సకలజీవులయందును సుప్రతిష్ఠితమై యున్నది. నేను దానినే పూజింతును. పరమపురుషుం డగునాత్మ

మేశ్వరుం డెల్లయెడలను వ్యాపించి యున్నాఁడు. అది కారణంబుగాఁ దిర్యగాదిజంతువులయందుఁగాని, నీవంటిజీవులయందుఁగాని నాకెట్టియు సహ్యాభావమును లేదు. నాకంతయును దేవతాస్వరూపమే. కావునఁ దపశ్శౌచపరాయణుండ నగునే నవ్యాకులహృదయముతో నిన్నగ్రహింతును. నీ వెంతమాత్రమును సంశయింపవలదు. ఆత్మ సర్వగతంబైనది. అది క్రిమికీటసర్పాదులయందును, జండాలాదులయందును, బ్రాహ్మణులయందునుగూడ నొక్కరీతినే విరాజిల్లుచుండును. ఇఁక నిందాబహిష్కారముల కవకాశ మెక్కడిది? కుత్సితాకుత్సితులయెడల నాకెట్టిభేదభావంబును లేదు. ఇప్పుడు నీవనుగ్రహించి సుసంస్కృతం బగునాయన్నమును భుజించి నన్నుఁ బవిత్రునిగాఁ జేయుము.

అని బోధించుటయుఁ జండాలుండు ప్రసన్నచిత్తుండై యాభూసురు ననుగ్రహించి యాతనియింటికిం బోయెను. అప్పు డతిథిపూజాపరాయణుం డగుద్విజశ్రేష్ఠుండు భక్తిపూర్ణహృదయముతో యథావిధిగ నాతని కతిథిసత్కారంబులఁ గావించెను. భోజనానంతరంబున నగ్నిదేవుం డాతనికి నిజస్వరూపముతో సాక్షాత్కరించి యోగైశ్వర్యాద్యుత్తమవరప్రదానంబు గావించెను. అప్పు డాబ్రాహ్మణుండు పరమయోగప్రాప్తుండై పత్నీసహితంబుగ దేహత్యాగంబు చేసి మోక్షపదంబును గాంచెను. ఓగిరిందప్రనందినీ! ఇప్పుడు నీకు నేనుపదేశించిన యీద్విజమాహాత్మ్యమును శుచియై నిత్యమును శ్రవణపఠనంబులఁ గావించువాఁడు పవిత్రసుఖంబులను నభిమతఫలంబులను, దేజోలాభంబులను బడయఁగలఁడు. దేవీ! ఇట్టిమహత్వంబుగల విప్రులలోకసామాన్యప్రభావులై మహామునిసులభం బగుమహత్త్వంబును జేరుట కర్హులై యుందురు.

## —♦ విభూతియోగము. ♦—

వ్యాసమునీంద్రా! దక్షాధ్వరసమయంబున బ్రహ్మాదిదేవతలు వీరభద్రునకు భయపడి మహాదేవునిశరణము గాంచిరి. భస్మలిప్తశరీరులగువారందఱును యజ్ఞదీక్షితపశువులంబోలి భస్మకూటాంగణమును జేరి ప్రమథగణమూలంబునఁ దమవృత్తాంతమును దెలుపుకొనుటయు భగవానుండగుశంకరుండు వ్రతధారు లగువారికి హిరణ్యగర్భాదిప్రధానయోగులచే నాచరింపఁబడుచున్న మోక్షవిద్యాతత్త్వం బగుస్వయోగమును బ్రసాదించెను. ఇతరంబు లగుసకలయోగంబులు నతికష్టసాధ్యంబులు. అవి సహస్రజన్మాంతరములయం దభ్యసించినను దీరునవి గావు. సకలకర్మంబులను బరిత్యజించియైనను బాశుపతదీక్షితుం డైనచో మహేశ్వరునియందు విలీనుఁడు గాఁగలఁడు. తపోధర్మసమ్మతంబును, సర్వజ్ఞానసమాయుక్తంబును ముక్తిప్రదంబు నగునిమ్మహావ్రతముం గూర్చి చెప్పెదను. అధర్మముకంటెఁ బాపంబును, ధర్మముకంటెఁ బుణ్యంబును వేఱొకటి లేదు. పరస్పరాశ్రయంబులగునీధర్మాధర్మములను బరిత్యజించి మంగళవ్రతంబగునీవ్రతంబును స్మరింపవలయును. అనంతరము పాశుపతయోగప్రాప్తుం డై పరమైశ్వర్యసంపన్నుం డగును. భస్మగ్రహణమాత్రంబుననే సకలబంధవిముక్తుం డగును. బ్రహ్మస్వరూపం బగుభస్మమును స్పృశించినమాత్రముననే మానవుఁడు ముక్తుం డగును. బ్రహ్మాదిదేవత లందఱును భస్మధారులును, భస్మప్రియులు నై యుందురు. భస్మతేజోబలంబుచేఁ బవిత్రం బగునీశ్వరభావప్రాప్తి యగును.

తానీశ్వరుండ నని భావించి భస్మస్నానము నాచరింపవలయును. శివయోగాత్మకం బగుభస్మమువలనఁ బాపరూపబంధంబులకు విముక్తి యగును. దేవతలు సోమసంభూతులును, పితృదేవత లగ్ని

సంభూతులు నగుటచే నీజగంబంతయు నగ్నిసోమాత్మకంబై యున్నది. ఈశ్వరుండును, అగ్నియు, సోముండును భస్మతేజస్స్వరూపులై యున్నారు. భస్మతేజోవిరాజితుం డగుద్విజుండు పాపవిముక్తుం డగును. సాంఖ్యవిద్యను, దపంబును, వేదోచితసకలధర్మంబులనుగూడఁ బరిత్యజించినయేనను కేవలభస్మస్నానమూలంబునఁ బరమేశ్వరప్రాప్తుండగును. పాపాత్ముఁడైనను, బుణ్యాత్ముఁడైనను, అధార్మికుఁడైనను, ధార్మికుఁడైనను శివభక్తిసంపన్నుం డగువాఁడు భస్మధారణంబున విశుద్ధుండై యతిశీఘ్రంబుగఁ బరమయోగింబును గాంచి సంసారబంధవిముక్తుం డగును. పాశుపతధర్మావలంబి యగుమునీంద్రుం డీవిధముగా మహావ్రతపరాయణుఁడై పరమగుహ్యం బగుపరమేశ్వరజ్ఞానాభ్యాసంబు గావింపవలయును.

స్థానత్రయసమన్వితం బగునాత్మ నాడీసమూహమునం దెల్లం డునో యజ్ఞేజ్ఞేయంబును, జ్ఞానంబును, జ్ఞాతయు ననుత్రయంబును దేహస్థితంబై యుండును. ఆత్మయందే యుపస్థితంబగునాత్మ యెల్ల సకలప్రాణులయందు నతిగాఢముగ వ్యాపించి యుండును. జ్ఞానసేవనంబుకంటె నాత్మసుజ్ఞానంబున కన్యోపాయం బేదియును లేదు. మాపశబ్దరసాతీతుం డగునమ్మహేశ్వరు నెవ్వరెఱుంగఁగలరు? వ్యాసమునీంద్రా! నేను పరమేశ్వరప్రసాదముచే నాత్మజ్ఞానంబునకుఁ బ్రధానోపాయమును జెప్పెద నాకర్ణింపుము. దేవాసురులు, నదులు, సూర్యచంద్రులు మొదలుగాఁగల జగజ్జన్యపదార్థములును, దృష్టపదార్థములును సత్యముగా లేనేలేవు. కేవలనిర్మలుండును, పవిత్రుండును, మహాత్స్వరూపుండును నగు పరమేశ్వరుఁడుమాత్రమే యున్నాఁడు. ఆతఁడు నిత్యుఁడును, నిర్వికారుఁడును, సర్వగుణాతీతుఁడును, అంతర్బహిర్గోచరుఁడును, నిరంజనుఁడును, తేజోదేప్తుండును, జ్ఞానస్వరూపుఁడును, ప్ర

ధానుఁడు నై యుండును. అవినశ్వరం బగునాబ్రహ్మతేజమునుండి ప్రథమంబున ‘ ఓమ్ ’ అను నేకాక్షరము నిర్గతం బయ్యెను. అది యక్షరత్రయవిలసితంబును, మాత్రాత్రయసమన్వితంబు నై బ్రహ్మస్వరూపముగాఁ బ్రశంసితం బగుచున్నది. ఓంకారాంతర్గతమగు ‘ అ ’ కారము బ్రహ్మస్వరూపము. మాత్ర ప్రకృతిస్వరూపము. ఆప్రకృతి పత్నీస్వరూపంబున మహేశ్వరు ననుభవించుచుండును. బ్రహ్మవిష్ణులును నీశ్వరసంజ్ఞితులై యుందురు. ప్రకృతి నతిక్రమించి యోంకారమును ధ్యానించువాని నాదిత్యుండు ముక్తాత్మునిగను, కృతార్థునిగను గావించును. కాని కేవలహేతువాదపరాయణులును, విమార్గులు నగు వారెల్లరు కృతకృత్యులు గాఁజాలరు. క్షీరంబులయందు ఘృతంబునుం బోలి యోంకారము ప్రకృతియందు నిత్యస్థితమై విరాజిల్లుచుండును. గుణకర్మవిశిష్టం బగుప్రకృతి యీశ్వరునికంటె భిన్నమైనది. ఆప్రకృతి బృహత్త్వంబు గాంచుటచే బృహతి యనియు, శ్యామయనియు, విష్ణుత్వముం గాంచుటచే విభవ యనియుఁ గీర్తింపఁబడుచుండును. ప్రకృతి సాభిమాన మైనచో సృష్టి యగుచుండును. దానికి మహేశ్వరుండు భోక్త యగుచుండును.

జగన్మాత యగుప్రకృతి యష్టబాహువిలసితయు, చరణత్రయవిరాజితయు, పంచాకృతియు, పంచముఖియు, త్రినేత్రయు, సప్తాశ్వరథారూఢయు, గుణత్రయవికారజాతియు నై యుండును. ఆప్రకృతియందు శుభాశుభంబులును, విద్యావిద్యలును విద్యమానంబు లగుచుండును. యథార్థజ్ఞానంబును, యాగంబును, క్రియానుష్ఠానంబును, యావాసవిషయంబులశుభాశుభలక్షణంబులును, తారాబలనిర్ణయంబును వానికొలకే! ఓంకార మీశ్వరునియం దుత్పన్నమైనది. ఈశ్వరుండు దానియందే ప్రతిష్ఠితుఁడై యుండును. కావుననే కపిలాదియో

గిగణంబులు మహాయోగము నవలంబించి నిత్యంబును,నిర్వికల్పంబును, బరమంబు నగునోంకారము నుపాసించుచుందురు. అదియే సర్వయోగాత్మకంబును, సర్వకారణంబు నై యున్నది. ప్రకృతిభూతులును, ఓంకారసంజనితులును, గుణస్వరూపులునగు బ్రహ్మవిష్ణువు లీశ్వరభోగ్యులై యుందురు. వారు వేదయజ్ఞంబులను, ధర్మబంధంబులను బరిత్యజించి విద్యాప్రభావముచే మహామోహతమోమధ్యంబునఁ బ్రవిష్టులై యుందురు. ఇరువురును రజస్సత్త్వగుణాధికులును, సుఖదుఃఖమయులును, సర్వనిత్యసములును, సంసారపీడకులును, మోహాధికులు నై యుందురు. ఈశ్వరధ్యానయోగపరాయణుఁడే విద్వాంసుఁడు. ఆతనినుండియే ప్రకృతియుత్పన్న మగుచున్నది; ఆతనియందే లయమగుచున్నది. ఆత్మప్రకృతికంటె భిన్నమైనదని యెఱింగినవానిని బ్రకృతి బంధింప నేరదు. ఆతఁడు భవసముద్రమునుండి యుత్తీర్ణుఁడు కాఁగలఁడు.

## —♦ వివిధయోగవర్ణనము. ♦—

సూక్ష్మం బగునాత్మయు, మనంబును, బుద్ధియు, నహంకారంబును, సత్త్వాదిగుణత్రయంబును, బంచభూతంబులును, బంచేంద్రియంబులును, బంచతన్మాత్రలును, దశవాయువులునుగూడ దేహమునందుఁ గ్రమంబుగా జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు విభక్తములై యుండును. సూక్ష్మంబును, సర్వతోముఖంబును, దశనాడీవేష్టితంబు నగు హృదయపద్మమునందు సజీవంబుగా నాత్మ యధిష్ఠితమై యుండును. అద్దిస్వప్నస్థం బని సిద్ధయోగులు చెప్పుదురు. జ్వాలిని, స్తిమిత, ఉగ్ర, విద్య, అవిద్య, విశాలిని, మాలిని, శంకరి, సుమిత్ర, సుబోధిని యను నీదశనాడులును జీవప్రతిష్ఠితములై యుండును. ప్రబుద్ధుండును, భావాభావసమాహితుండు నగుజీవుఁడు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు శబ్దాదివిషయంబులను గ్రహించుచుండును. మనోబుద్ధిచిత్తాహంకార

ములు నాల్గును దేహజము లైనవి. ఇవి యాత్మతోఁ గలసి యుండక దాని నష్టగించుచుండును. ఆనాల్గింటితో జీవుఁడు చేరియుండును. జీవాత్మ హృదయకర్ణికాంతరమున సర్వతోముఖమై మనోమధ్యంబు నం దతిసూక్ష్మాకృతితో విరాజిల్లుచుండును. అపారగుణాత్మకం బగు జీవాత్మ చిత్తంబనియుఁ బురుషుండనియుఁ బ్రశంసింపఁబడుచుండును. అహంకారమునుండి బ్రహ్మోత్పత్తి యయ్యెను. అదియే భాస్కర సంచారక్షేత్రము. అహంకారము, బ్రహ్మ, సూర్యుఁడు, చంద్రుఁడు, జ్ఞానము, ధర్మము, రతి, రసము, ఆత్మ, ఓషధులు, సపరికరం బగు ధాన్యసమూహము, నిరాశ, మృత్యువు, దుఃఖము, అనామయము, నీచములగు కామరోషవేగములు, సర్వతోవ్యాప్తంబులగుధర్మములు. సమత, విష్ణువు, బుద్ధి, శౌర్యము, కారణము, భూమి, జ్ఞానము, వైరాగ్యము, ఆకాశము, రాజసభావసమూహమును జీవమధ్యస్థితంబులై యుండును. సూక్ష్మంబును, విధూమంబును, సకలజీవుల కమృత, గతి స్వరూపంబునగుపావకశిఖామధ్యంబున నగ్నిసదృశుం డగుజీవుఁ డదృశ్యుఁడై యుండును.

సరస, లోహిత, ముఖ్య, ప్రోత, రసవతి, విధూమ, అమృత నందిని, వశ్రు, విస్తర మొదలగునీసూక్ష్మనాడులు పదాఙ్గులను భేదించి భూతాధారభూతుండును, పయోవృతుండు నగుసోము ననుసరించి పర్యటనంబు సేయుచుండును. సర్వాంతరసమీపస్థుం డగునాసోముం డానాడులచేఁ దర్పితుండై నాగ్ని జీవమధ్యగతంబగునాడి నాహ్వానించుచుండును. జీవదంబును, ఉత్తమంబు నగుదానినే యమృతమని చెప్పుదురు. సోమశిఖాకల్పితాప్లవసమయమే జాగ్రదవస్థ యనియు, సుషుమ్నాపరిత్యక్తితసురానాడీయోగమే సుప్తావస్థ యనియుఁ బ్రాజ్ఞులగుయోగులు చెప్పుదురు. మునిగణంబు లీసుప్తజాగ్రదవస్థలను జ

యించి యజాగరితం బగుధ్యానయోగమును స్వయముగాఁ జింతించు చుందురు. గమనాదికై హిక్రియలును, ఘ్రాణాదిమనఃక్రియలును జాగరితంబులు గాకున్నచోఁ దన్మూలమున నద్వైతాగ్య మనగతంబగును. బుద్ధినిశ్చయంబును, మనస్సంశయంబును, అహంకారాభిమానంబును ద్యజించినచో మరణమునుండి యుత్తీర్ణుండగును. అట్లు గాక కర్మనిక్షేపంబు గావించిచో మోక్షరూపం బగుకుశల మెట్లు లభించును? కర్మబంధవిషాదమునుండి విశుద్ధుఁడైనవాఁడు ముక్తిలాభంబు నందు నని యెఱుంగునది. సకలవిషయంబులును సోమసంభూతములని యు, వానికి భోక్త వహ్నియనియుఁ జెప్పుదురు. సామాన్యచర్మము వానిని బాధింపఁజాలదని గ్రహించి సర్వదా యోగానురక్తుఁడై చింతలను ద్యజింపవలయును. జీవితానష్టయం దున్నను నేను మహేశ్వరుండనే కావున ధర్మశర్మవిరహితుండ నగుచున్న లోకమునుంబోలి యిచ్చ బాధింపనేరదని సుస్థిరుఁడై యుండవలయును. క్రియామూలమున యోగ్యు లగువారు సంసరవ్రతావలంబులై స్వతనుత్యాగంబును, మాయాభేదంబును గావించి పరమపదముం గాంచఁగలరు.

వ్యాసమునీంద్రా! శివభక్తుండ వగునీ కింతకంటెను సూక్ష్మంబును, బరమంబును, స్ఫుటంబు నగు జ్ఞానయోగము నుపదేశించెదను. ఇట్టిపరమోత్కృష్టసూక్ష్మజ్ఞానము యోగులకుఁగూడ నవేద్యమైనది. విశుద్ధు లగుపాశుపతులకుఁదక్క నిది యెవ్వరికిని దెలియనేరదు. మనస్సు, బుద్ధి, అహంకారము, ఇంద్రియములు, సత్త్వాదిగుణంబులును గూడ బహిర్వికారమాత్రములును, క్షయశీలంబులును గావున నివి యాత్మనెంతమాత్రమును స్పృశింపఁజాలవు. ఆత్మ సర్వవ్యాప్తం బయ్యు నెందును దృష్టిగోచరంబు గాకుండును. ఆపరమాత్మ నేరూపముచేత ను గనుంగొనఁజాలము. పరమేశ్వరుఁడు భావగుణంబుల కగమ్యుం డని

యనుభవముచే గ్రహించినవారే యోగిశ్రేష్ఠులుగాఁ బరిగణింపఁబడు చుందురు. కనీనికాంతరంబునఁ దేజస్స్వరూపం బగునాత్మచ్ఛాయ దృష్టిగోచర మగుచుండును. సర్వశరీరులకును మూలభూతంబగుసూక్ష్మ జీవము సహస్రకర్ణికాపద్మమునం దుండును. పూర్వోక్తంబు లగునాడు లన్నియు నందు జీవసహితంబులై యుండును. గాంధారి, విజయ య నునవి ప్రాణధారిణులగునాడులు. పాణిన, తాలగంధ యనునీనాడులు రెండును నాభిస్థితంబులై యుండును. యోగ మొదలుగ నూపాస్మంతం బువఱకును గలదశనాడులును నాగవాయుసంస్థితములై యుండును. హవ్యవాహనుఁడు ప్రాణసహితుఁడై బహిరంతర్భాగముల సంతృప్తి పఱచుచుండును. సుషుమ్నానాడి సోమవహ్నిస్థితమై యుండును. కార ణదేహకుమారదేహములం దతిలంబితనాడియు, జీర్ణకుమారదేహములం దసలస్థితనాడియు నుపస్థితములై యుండును. విశుద్ధం బగువాతవాస స్నానాడి నిత్యవాతపరినారతమై యుండును. సమానధ్యానసంయుక్తనా డి సర్వదా రక్తపూర్ణమై యుండును. వాయువును, కూర్మనామకం బగుసిరివాయువును నాభిస్థితంబగుసన్ననాడియందు సంచరించుచుండు ను. అసర, అవధర యనునీనాడులు రెండు సల్పవాయుకలితంబులై యుండును. వానికూర్ధ్వాధోభాగములందు పాదసన్నద్ధం బనువాయు వును, మస్తకోపరిభాగంబునఁ గూర్మవాయువును వ్యాపించియుండును. దేవదత్తనామకం బగువాయువువలనఁ గృతాకృతపర్ణానంబు గలుగు ను. ప్రాణదేవమహాబలవాయువులు రెండును, వహ్నిసోమనిబద్ధంబు లై యుండును. అందొకటి యగ్నిని, మఱియొకటి సోముని వర్ధిల్లఁ జేయుచుండును. దేవదత్త, మహానాగ, కృక, కూర్మ, ధనంజయవా యువులు ప్రాణవాయువులు. ఇవి మనయందు చక్రయోగపాలకంబు లని కీర్తింపఁబడుచున్నవి. వీనియందు హంసోపమును, సోమంబును

బ్రతిష్ఠితంబులై యుండును. హోమము యజ్ఞవిధానంబు గావించును గాని, ముక్తికారణంబు గానేరదు. స్మృతయను నాడియందు ప్రదీప్తం బగు నగ్ని యుండును. ఆనాడీస్థానమునుండియే యగ్ని వినిర్గతం బగుచుండును. అట్లు వెడలుచున్న యగ్ని కర్ణికామధ్యపర్వతంబులమూలమునఁ బరితృప్తిం గాంచుచుండును. నేత్రములయందు తారారూపంబునఁ బ్రకాశమానం బగుచుండుజ్యోతియే సర్వజీవులకును జీవస్వరూపము. అది యాత్మ ననుసరించి యుండును. ఆనేత్రజ్యోతియందలి సూక్ష్మపదార్థమే పరమతత్త్వం బని చెప్పుదురు. అదియే యమృతస్వరూపము. అది జ్ఞానమువలననే లభింపఁగలదు. దానికంటె శ్రేష్ఠం బగునది మఱి యేదియును లేదు. యోగవిజ్ఞానదాయకం బగుగతి యది యొక్కటియే. ఈతత్త్వమును బాగుగ గ్రహించి గుణత్రయవిశారజనితం బగుమోహమును బరిత్యజింపవలయును. ఆత్మ కభిన్నం బగునీపరమతత్త్వ మీశ్వరునికంటె భిన్నమైన దని చెప్పుట కేయోగవిశారదుఁడు సాహసింపఁగలఁడు? నిరంజనుండును, నిర్వికల్పుండు నగు నీశ్వరునికంటె నీపరమతత్త్వ మెప్పటికిని భిన్నమైన దని తలంపరాదు. వ్యాసమునీంద్రా! నీకు నేనీమహేశ్వరతత్త్వమును వర్ణించి చెప్పితిని. ఆపరమేశ్వరుఁడు పరిపూర్ణబ్రహ్మము. ఆతనికి నామరూపంబులు లేవు.

## —♦ యోగధ్యానము. ♦—

పరాశరనందనా! శివసిద్ధాంతసంకలితంబును, ఈశ్వరధ్యానకారణంబును, యోగిగణంబులకు ముక్తిదాయకంబు నగుపరమజ్ఞానముం గూర్చి చెప్పెదను వినుము. నన్ను గురునిగా భావించి మదుక్తం బగు నీవిద్య నభ్యాసము చేయుచుఁ గార్యమునకు విఘ్నంబునుంబోలె తత్త్వజ్ఞానంబునకు స్వదేహంబు ప్రతిబంధకం బనిమెంచి పరిత్యజించి మద్వి

శతత్త్వలాభంబు గాంచవలయును. దేహమునందలి సకలనాడులును వాయుసంబద్ధములై యందందు సంచరించుచుండును. అవి యన్నియును సేతుకర్ణికామధ్యము నాశ్రయించి యుండును. ఈనాడులు సేతువు నాశ్రయించి బాహ్యపాదస్థలంబులై యుండును. ఇతరంబు లగు సకలనాడులును గరావలంబనముం గాంచి యుండును. వేయినాడులు సమాసవిరహితం బగుపరమాత్మయం దుపస్థితంబులై యుండును. వానిలో నొక్కొక్కటి భిన్నంబును, సూక్ష్మంబును, సూక్ష్మతరంబు నై యుండును. కర్ణికామధ్యమునం దుత్పన్నమైనప్రాణవాయు వీసమస్తనాడులయందును సంచరించుచుండును. యోగివరులు జ్ఞానమూలంబున నీనాడుల నన్నిటిని దర్శించి పరమాత్మావలోకనంబు సేయుచుందురు. తేజస్స్వరూపం బగుపరమాత్మ సర్వదేహములయు సకలనాడులయందును విభక్తంబై యుండును. ఈనాడు లన్నియును సు[illegible]ంబులోఁ గూడి దానిని జ్వలింపఁజేయుచుండును. ఆతేజము చక్షువుల నాహరింబుచేసి సర్వనాడీసమాశ్రితమై యుండును. మనంబు నేకాగ్రముగఁ జేసి యాత్మయందు నియోజితంబు గావింపవలయును. ధనంజయనామకం బగువాయువు హృదయమధ్యమున సర్వదా ప్రకాశించుచుండును. దానికి శిరంబును, నాభియు, హృదయంబును ముఖ్యస్థానములు. నాచే నిదివఱకు వర్ణింపఁబడినవాయువు లన్నియు ధనంజయవాయువున కధీనములు. అవి దానినుండియే యుత్పన్నము లగుచుండును. కావున నవి యితరస్థానములఁ జరించుట కసమర్థములై దానియందే సుస్థితంబులై యుండును. వాయువులకుఁ బ్రథమస్థానము నాభిబంధననాడీచక్రము. ద్వితీయస్థానము కర్ణిక. తృతీయస్థానము తాలువు. భూమివికారపరం బగుశూలము త్రివిధోత్క్రాంతి యని చెప్పంబడును.

యోగులు సకలధర్మాధర్మములవలనను, పూర్వజన్మార్జిత కర్మంబులవలనను బద్ధులు గాకుండునట్టి మార్గమును జెప్పెదను. బాహ్యం బనియు, శరీరజం బనియు మృత్యువు రెండువిధంబులు. అందు విషశస్త్రాదులచేతను, వ్యాఘ్రసర్పాగ్నిజలాదులచేతను దటస్థించునది బాహ్యమృత్యువు. శరీరజమృత్యువు రోగజ మనియుఁ గాలజ మనియు రెండువిధములు. వృద్ధత్వముచే ఘటిల్లునది కాలజ మనియు, వ్యాధులచే సంభవించునది రోగజమనియుఁ జెప్పంబడును. అభ్యాసమువలన యోగసాధనజం బగుమృత్యు వతిదుర్లభ మైనది. కాలజమృత్యువు కాలక్షయ మైనంతనే యగుచుండును. యోగజమృత్యు విచ్ఛానుసారముగ సంభవించును. యోగాభ్యాసరతునకు శ్రోత్రసంధిజం బగుశబ్దము శ్రవణగోచర మగును. ఆశబ్దమును ముందుగాఁ గూర్మవాయువునందు జేర్చినచో వహ్ని తనప్రభను ద్యజించును. ఆవహ్ని నిష్ప్రభంబైనంతనే శబ్దసంబంధమునుండి విముక్తి యగును. శబ్దస్పర్శము లతీతము లైనచో రూపవిముక్తి యగును. అగ్ని యీవిధముగాఁ బ్రవేశించి యేకాంతయోగము నిచ్ఛించుచు సకలమర్మములను విధ్వంసంబు గావించును. కూర్మ, దేవదత్త, కృకర, నాగ, ఉదానవాయువులు సమ్మిళితములై కణ్ఠికయందుఁ బ్రవేశించును. మనస్సు జీవాత్మయందు నిష్క్రియమై యుండును. సకలేంద్రియములును మనస్సునందును మనస్సు ప్రాణమునందును లగ్నమై యుండును. ఇట్లన్నియును విలీనములై ప్రాణవాయువును బీడించును. అట్లు పీడితం బగుప్రాణవాయు వేకశతరూపంబులఁ బరిణమించును. అనంతరము కర్మాత్మవాయుస్థానములు పరస్పరసంయుక్తము లగును. క్రమముగా నావాయువు లన్నియును ధనంజయవాయువును బూరించును. అప్పు డాధనంజయవాయువు జీవుని ద్యజించి తాను నిలిచియుండును. ఈవిధముగా సర్వభూ

రగుణస్థితి యేకకాలకృతమై యుండును. అతిసూక్ష్మం బగుమహేశ్వ
రపదము యోగవ్యతిరిక్తముగా నెన్నటికిని బ్రాప్యంబు గానేరదు.

మననశీలుం డగువాఁ డుపవిష్టుఁడైనను, పరిసుప్తుండైనను, గ
మనతత్పరుండైనను, ఛురికాపరశుకపాలధరుండైనను బరబ్రహ్మ మగు
మహేశ్వరు నెఱింగి యిచ్ఛానుసారంబుగ ముక్తిలాభముం గాంచును;
క్రియాసహితంబుగ వికారము లన్నియును లయంబు గాంచుటచే సర్వ
తత్త్వస్వరూపుఁ డగుమహేశ్వరుసాక్షాత్కారముం గాంచును. మనస్సే
ప్రాణులకు రోగదాయకమైనది. రోగసహితుం డగువాఁడు విపన్నుం
డగును. విపన్నుఁడు మోహాబద్ధుఁడై జ్ఞానవస్తువు నెఱుంగఁజాలకుండు
ను. వేదవిహితంబు లగుపవిత్రకర్మములచే స్వర్గలాభముం గాంచినట్లే
యీకర్మముచే సకలదుఃఖములను బరిత్యజించి జ్ఞానస్వరూపం బగుబ్ర
హ్మమును బొందవలయును. సద్యోజాతాదిపంచబ్రహ్మల నెఱుంగని
వాఁడైనను, దర్శనమాత్రంబున వారికర్మంబులయందు నిష్ఠుండై,
భస్మధారణముచేఁ బవిత్రుఁడై, శంకరునియం దేకాగ్రచిత్తుఁడై, యో
గాభ్యాసనిరతుండై యున్నచో నాతనికిఁగూడ నీజ్ఞానము లభింపఁగల
దు. మాహేశ్వరం బగుయోగము నిష్కలంబును, ముక్తిదాయకం
బు నైనది. మాహేశ్వరవ్రతంబు ననుష్ఠింపక కోటియజ్ఞానుష్ఠానంబు
గావించినను ముక్తి లభింపదు. సర్వజ్ఞుండును, బ్రబుద్ధుండు నగువానికిఁ
బాశుపతవ్రతంబుతో నిమిత్తంబు లేదు. మాహేశ్వరచింతనంబుచేత
నే జ్ఞానలాభం బగును. ఎట్టియోగులైనను నీశ్వరచింతనంబుచేఁ గాని
పరబ్రహ్మపదంబు నందఁజాలరు. ఆదేవుని యనుగ్రహంబు లేకున్న
ముక్తిలాభంబు గలుగదు. శివయోగుల కిదియే మోక్షోపాయము.
దీని నవలంబించుటచే సర్వమును మిథ్య యని బోధ యగును. బ్రహ్మ
లోకమునకుఁ బరంబునం గలమాహేశ్వరస్థానమును శివభక్తులగువారు

మాత్రమే చేరఁగలుగుదురు.

—♦పాశుపతాదివ్రతమాహాత్మ్యము.♦—

పారాశర్యా! సత్యలోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, భూతలోకము, భవ్యలోకము, భవలోకము ననుసీసప్తలోకములకు నూర్ధ్వంబున నిత్యశివనివాసం బగుశివలోకసమూహము ప్రతిష్ఠితమై యుండెను. ఆశివలోకముల నాశ్రయించియే యూర్ధ్వమధ్యాధోదేశములందు సకలలోకమును సుస్థిరంబులై యున్నవి. బ్రహ్మాండమంతయు నాశివలోకమునందే ప్రతిష్ఠితమై యున్నది. ప్రళయకాలమునందును దానికి నాశము లేదు. అదియే శాశ్వతస్థానము. దేవత లందఱు నచ్చటనే నివసించి యుందురు. అందు సనకాదియోగిగణంబులును, పితామహుం డగుబ్రహ్మయు, వాలఖిల్యాదిమహర్షులును, కపిలాదిసిద్ధులును శివయోగావలంబులై, సత్వాదిగుణవివర్జితులై, నిష్కాములై యీశ్వరసేవ గావించుచుందురు. శివరూపుఁ డగుసీశ్వరుఁడు పరమాత్ముండును, నిత్యుండును, పరముండును, పరమైశ్వర్యసంకలితుండును, సకలజీవులకుఁ బ్రభుండునై యుండును. క్షమాసత్యంబులును, ధృతియు, తపంబును, వైరాగ్యమును, విష్ణుత్వమును, బ్రహ్మత్వమును, శుద్ధజ్ఞానమును, మహేశత్వమును సమస్తమునుగూడ నామహేశ్వరునందే నిత్యస్థితంబై యుండును. కావుననే యాతఁడు దివ్యంబగుపరమాణుపదంబున స్థితుండై యుండును. ఆద్యంబగునాతేజమునుండియే మనోహంకారములకుఁ బ్రకాశంబు గలుగును. మహత్వమును, నిత్యత్వమును గల్పించుముక్తిపదము లౌకికమైనది. సిద్ధమండలము దానినుండియే యుదయించెను. ఆక్షేత్రమునుండియే ద్విజోత్పత్తి యయ్యెను. ఆయీశ్వరుండు విభుం డనియు, నాతనినుండి యుదయించిన ప్రకృతి వైష్ణవి యనియుఁ బ్రశంసింతురు. ఆశంకరరూపబ్రహ్మమున

కగ్రభాగమున బ్రహ్మలోకమును, దానికగ్రభాగమునఁ దేజోమయపు రంబును గలదు. ఆపురంబున మహాత్ముఁడును, సర్వభూతేశ్వరుఁడు నగుశివుండు నిలిచియుండుటచే నదియే సకలశివయోగులకును గతియై యున్నది.

ఆపురంబు కోటియోజనవిస్తీర్ణమును, నిర్మలపవిత్రమహామండలవిలసితంబును, మధ్యాహ్నమార్తాండసముజ్జ్వలంబును, విశాలసువర్ణప్రాకారవేష్టితంబును, మణిముక్తావిభూషితకళకద్వారశోభితంబును, రమణీయంబును, సిద్ధగణసేవితంబునై విరాజిల్లుచుండును. అందు జరామరణశోకవ్యాధిమోహక్రోధభయాదు లెంతమాత్రమును లేవు. అది సర్వసమృద్ధిసంపన్నమై యుండును. స్పర్శమాత్రసుఖదాయకం బగున మహానతీభూమి యందే యున్నది. అందొక్కచోఁ జంద్రనిర్మలంబు లగుశ్వేతపద్మములును, బాలసూర్యప్రభాసంపన్నము లగురక్తపద్మములును సుగంధపూర్ణంబులై విరాజిల్లుచుండును. కమలేందీవరశోభితంబులును, సుధామధురోదకపూరితంబులును నగునకేవాహినులు శివపురంబు చుట్టును బరివేష్టించి ప్రవహించుచుండును. వరద, వరేణ్య, వరేశ, పావని, వారాహి, వారిభవి, వర, మహావద యనునదులయందలి యుదకము వివిధకుసుమగంధవిలసితమును అమృతోపమానము నై యుండును. దేవాసురమునిగణంబులును, నారదాదులునుమాత్రమే పరమాద్భుతమగునాపురమును దెలిసికొనఁజాలుదురు. అంతర్బాహ్యవిశుద్ధులును, విశేషభక్తియుక్తులును, కేవలశివచింతాతత్పరులు నగువారందు నివసించి యుందురు. సూర్యాగ్నిసదృశతేజోమయం బగునాపురమధ్యమున మేరుశృంగసన్నిభంబును, దివారాత్రివిభాగవిహీనంబును, సర్వకామదంబును, కనకమయంబును, అసాధారణదర్శనీయంబును, నీలస్ఫటికప్రవాళేంద్రశిలాదిమణిభూషితంబు నగునొకప్రాసాదరాజము విరా

జిల్లుచుండును. అగ్నిశిఖాసముజ్జ్వలంబగునానగరంబున సూర్యసమతేజో
మయంబులగుధ్వజపటంబులు సుఖజనకంబులగువాయువులచే సవిలాస
ముగఁ జలించుచుండును. ఆదివ్యపురంబునందు సకలఋతులయందును బు
ష్పఫలసమంచితంబులగుకల్పతరులతలు కన్నులపండువుగా నుండును.
సకలమహీధరంబులయందును మేరువుంబోలి, యఖిలలోకంబులకు నూ
ర్ధ్వమునందున్న యీపురశ్రేష్ఠము సర్వోత్కృష్టంబై ప్రకాశించుచుం
డును. ఆపురంబున మహాభూతపరివృతుండును, పంచవింశతితత్త్వావృ
తుండును, విశ్వేశ్వరుండు సర్వదా దేవీసహితుండై నివసించియుండును.
మఱియు, లక్ష్మియు, మేధయు, ధృతియు, శ్రీయు, కీర్తియు, సరస్వతి
యు, లోకమాతృకలును దివ్యరూపములం దాల్చియుమాదేవీసహిత
లై యందుఁ గ్రీడించుచుందురు. సకలదేవతలును గణేశ్వరులతోఁగూ
డి యందు విహరించుచుందురు. ప్రమథగణాగ్రగణ్యులును, కుబ్జవా
మనరూపులును, కామరూపులును, మహావేషధారులును, పాశుపతవ్ర
తులు నగుగణనాథులందఱు నచ్చట నివసించియుందురు. మహాకాలే
శ్వరుం డందు విరాజిల్లుచుండును. ఆయుధపాణులగుచండీశ్వరగణేశ్వరు
లు ధ్యానతత్పరులై శివపార్శ్వంబునను, దివ్యరూపధారిణులును, యో
గబలసమన్వితలును, ఖడ్గహస్తలు నగుజయావిజయులు దేవి పార్శ్వంబు
నను నిలిచియుందురు. కకుద్మంతుండును, మహానాదుండును, మహా
త్ముండును, ఈశ్వరవాహనస్వరూపుండును, కామరూపుండును, ఘంటా
శక్తిధరుండును, శ్రీమంతుండు నగుగోపతి పితృపార్శ్వమునం దుపవసిం
చి యుండును. జగత్పతి యగుమహాదేవునిసూక్ష్మరథంబునందు దశస
హస్రసూర్యతేజస్సంపన్నములగు కాంచనవర్ణశార్దూలసమూహమును,
సింహసమూహమును విలసిల్లుచుండును. ప్రాజ్ఞులును, నిర్మలస్వభావు
లును, మహాయోగులును, తేజస్సంపన్నులును, నగుకోటికోటిరుద్రప్రగ

కులంబు లరిదు నివసించి యుందురు. అందుఁ గాంచనమయంబును, ది
వ్యమణిచిత్రితంబును, రమణీయంబునగునుత్తమరథంబు శోభిల్లుచుండు
ను. ఆదేవదేవునిదివ్యరథము యోగవహనశీలంబును, సర్వలోకసంచా
రక్షమంబును, రత్నభిత్తియుతంబునై విరాజిల్లుచుండును.

సాత్యవతేయా! ఈయుపాఖ్యానము సర్వాశుభవినాశకంబును,
సత్యంబునైనది. యోగాశ్రయంబుచే సర్వభావముల సాత్మయందు స
మర్పణంబు సేయువారును, నిరంతరశివచింతాతత్పరులు నగువా రెందు
మరణించినను దివ్యం బగునాపురంబును జేరి నిత్యనిర్మలులై యుందు
రు. మహేశ్వరభక్తులగువారందఱును శంకరాలయం బగునాపురంబున
విహరించుచుందురు. [illegible]కసనందనాదులును, పితామహుండగుబ్రహ్మ
ము, [illegible]సిద్ధులును, నరనారాయణులును, పంచశిఖాదులును,
యాజ్ఞవల్క్యాదిమహర్షులు నందు నివసించి యుందురు. వారు ప్రళ
యకాలంబున నీశ్వరునియందుఁ బ్రవేశించి సృష్టికాలంబున మరల
యథారూపమునఁ బ్రకాశించుచుందురు. మహాదేవునిదివ్యాలయంబు
ల దర్శించువారును, మంగళమయంబులగుమహాకాళేశ్వరగోకర్ణక్షేత్ర
లను, అవిముక్తమునం దోంకారేశ్వరుని, విశ్వేశ్వరుని, శ్రీపర్వతము
నందలిమహేశ్వరుని, కారోహణంబున దేవేశ్వరుని, మహాకాలంబున
శంకరుని, భద్రేశ్వరుని, మహాదేవుని, శబ్దకర్ణేశ్వరుని సేవించువారును
మరణానంతరమున గిరిజావరునిదివ్యపురంబున నివసించి యుందురు. శివ
యోగావలంబులు, పాశుపతవ్రతులు, శివభక్తులు నగువారు శివపుర
వాసంబుచేఁ గృతార్థులై నందీశ్వరకార్తికేయాదులతోఁ గలసి యోగా
వలంబనపరులై నిరంతరమును శంకరపార్శ్వంబున రుద్రరూపధరులై
యుందురు. నేనిప్పుడు నీకుపదేశించిన పరమం బగుశివయోగమువలనఁ

బరమేశ్వరవిజ్ఞానంబు లభించి యాప్రభావముచే సకలదుఃఖవినాశంబును ముక్తిలాభంబును గలుగును. వ్యాసమునీంద్రా! యోగి యగువాఁడు జగదాధారుండు గావున సకలధర్మప్రవర్తకుండగుచున్నాఁడు. కావున నీవు జ్ఞానమూలంబున సకలసిద్ధులను గాంచి జగత్కారణతత్త్వవిషయంబున స్మృతిలాభంబు నంది స్థితిధర్మప్రబోధకం బగుపురాణరచనం గావింప గలవు. యజ్ఞాదికర్మప్రచారంబుకొఱకు నీవు స్వాయంభువంబును, ఏకంబు నగువేదమును ప్రబోధార్థమై చతుర్భాగములుగా విభజింపఁగలవు. ఇది యనిందితం బగువైవస్వతమన్వంతరము. ఇహలోకమునందు త్వత్కృతంబులగు శ్రుతిస్మృతిధర్మశాస్త్రములు స్థితికరంబులు గాఁగలవు. నీవు తీర్థకరుండ వయ్యెదవు. అనంతరము సర్వబంధముక్తుఁడవై పరమేశ్వరునియందు విలీనుండవయ్యెదవు.

అని సనత్కుమారుండు బోధించి వ్యాసమునీంద్రుని భస్మసంస్కృతునిం గావించి యనుగ్రహించెను. మహాతపుండగువ్యాసుండును సనత్కుమారునకుఁ బ్రణామంబు గావించి మహీతలాసీనుఁడై ప్రశ్నించుటయు సనత్కుమారుండు శివపురాణం బంతయు నాతని కెఱిఁగించెను. ఈశివపురాణము సకలాగమసంయుతంబును, సృష్టిమన్వంతరాదిపరిశంసాకలితంబును, శివయోగమయంబును, సర్వజ్ఞానాత్మవంబునై విరాజిల్లుచున్నది. మునులారా! మీరును శివపరిచారానుష్ఠానపరులై సకలయోగంబులనభ్యసించి యీశ్వరనిలయప్రాప్తిం గాంతురుగాక! మునిశ్రేష్ఠుండును, మహాతేజస్వియు నగువ్యాసుం డీశివయోగానుష్ఠానముచేతనేసమస్తవేదతాత్పర్యమును గ్రహింపఁగలిగెను. ఈవ్యాసునివలననే సకలధర్మములును, యోగవిద్యలును బహిర్గతములైనవి. ఈశివపురాణము పవిత్రమం బనియు, సర్వోత్తమంబనియు నందీశ్వరుండు ప్రి

శంసించి యున్నాఁడు. దీనిని సర్వంబును గ్రహించినవాఁడు సర్వజ్ఞుం డు గాఁగలఁడు. దీనివలనఁ ద్రివర్గప్రాప్తియు, ముక్తిలాభంబును, ఆ యుర్వృద్ధియు, యోగసిద్ధియుఁ, గాఁగలదు. సమస్తజగద్విద్యావిష యంబున నాదికర్త యగుమహాదేవునివలెనే సకలపురాణంబులలోనను నీశివపురాణము ప్రధానమైనది. ఈపురాణము నధ్యయనము సేయు వారు సకలక్లేశవిముక్తు లగుదురు. దీని నాకర్ణించువారు మహాదేవసా యుజ్యముం గాంచఁగలరు. ఈపురాణధారణానుశీలంబువలన యోగ సిద్ధియు, ముక్తిలాభంబును గలుగును. త్రిభువనశ్లాఘ్యంబులగుమహా దేవునిదివ్యస్తోత్రానువాదంబులచేతను, మహాదేవియగుభగవతిమహాప్ర భావకీర్తనంబులచేతను బరమంబగునీశివపురాణము పవిత్రమైనది. ఇది సర్వశాస్త్రసమ్మతమైనది. సకలదేవతలచేతను, భూదేవులచేతను, బ్ర హ్మాదులచేతను సంసేవితం బగు నీపురాణశ్రవణమువలన శివసాయుజ్య ము లభించును. సర్వభావంబులను శివార్పణంబులుగాఁ జేసి యీశ్వ రసేవాతత్పరు లగువారు సూర్యానలసమశరీరులును, త్రినయనులును, బాలచంద్రావతంసులునై మహాదేవానుచరశ్రేష్ఠులు గాఁగలరు. వారి కెట్టి యమంగళములును గలుగవు. వారుసకలశాస్త్రపారంగతులై నా నాగుణాలంకృతులై సర్వదామహానందముతోఁ గాలక్షేపము చేయు చుందురు. అనంతరము మహాలోకంబున వారుపరమయోగీంద్రులై య నంతస్వర్గసుఖభోగంబు లనుభవించు చుందురు. ప్రయత్నపూర్వకంబు గాఁ ద్రిపురహరుండగుమహాదేవుని దెలిసికొన్నవారు సకలపాపవిదూరు లై విముక్తులగుదురు. శుచియై పరమపవిత్రం బగునీపురాణమును బ ఠించువాఁడును, వినువాఁడును, దుర్లభమనోరథసిద్ధుఁడై యంతంబున నుత్తమం బగుశివపదముం గాంచఁగలుగును. శ్రాద్ధసమయములం దీ పురాణపఠనంబు గావించినచోఁ బితృదేవతలు సంతృప్తు లగుదురు. ఈ

పురాణపఠనముచే దుస్స్వప్నదోషములును, సకలకలికలుషంబులును న శించును. శ్రద్ధాభక్తియుక్తుఁడై మనఃపూర్వకంబుగా నీపురాణంబునం దొక్క శ్లోకంబును గాని, శ్లోకార్థమునుగాని భఠించువానియెడల మహా దేవుండు సుప్రసన్నుండై యుండును.



శ్రిత్త్యై నమః.

# శివపురాణము,

## వాయవీయసంహిత.

### పూర్వభాగము.

శ్రీగౌరీనిబిడకుచా
భోగలసత్కుంకుమాభి ♦ భూషితవక్షో
భాగు భవరూపచక్రిస
దాగమనోద్యోగు భోగుఁ ♦ దలఁతుము భక్తిన్.

భగవానుండగు నుపమన్యునిప్రసాదంబుచే నుపలబ్ధంబైనవిష
యము నంతను జెప్పి మహాత్ముండు మధ్యాహ్నకాలార్థితుండై యున్నసమ
యమున వాయుదేవుండు నియమానుసారంబుగ లేచుటయు నైమిశార
ణ్యవాసు లెల్లరు నాతని నావిషయంబునుగూర్చి యడిగి తెలిసికొన
వలయు నని నిశ్చయించి నియమకర్తవ్యకర్మసమాపనాంతంబునఁ బూ
ర్వవిధంబుననే మరల వచ్చి వాయుదేవుని పునరాగమనంబుకొఱకు నిరీ
క్షించుచుఁ గూర్చుండి యుండిరి. అప్పు డంబరోద్భవుం డగుననిల
దేవుండు నియమకృత్యములం దీర్చుకొని యిటకు వచ్చి మునిసమాజ

మధ్యంబున నర్ఘ్యాసనాసీనుం డయ్యెను. సర్వలోకనమస్కృతుం డగు వాయుదేవుం డట్లు సుఖాసనోపవిష్టుండై మహేశ్వరవిభూతిమాహాత్మ్యంబును ధ్యానించుచుండగా నాతనివదనకమలమునుండి "అపరాజితుండును, సర్వజ్ఞుండు నగునామహాదేవుని నేను భజించెదను. చరాచరంబగు నీసమస్తప్రపంచమును నాతనివిభూతియే" అనువాక్యములు వెలువడియెను. ఆశుభవాక్యముల నాకర్ణించినంతనే సకలర్షులకును బాపక్షయం బయ్యెను. అప్పుడు వారందఱు నవ్విభూతింగూర్చి సవిస్తరంబుగాఁ దెలిసికొనఁగోరి సారవంతంబులగు వాక్యములతో నిట్లనిరి. మహాత్మా! అక్లిష్టకర్ముండును, వాసుదేవుండు నగుకృష్ణుండు ధౌమ్యాగ్రజుం డగునుపమన్యునిచేఁ బాశుపతవ్రతదీక్షితుండై పరమజ్ఞానలాభంబు నందినట్లు పూర్వము విని యుంటిమి. ఆకృష్ణునకుఁ బాశుపతజ్ఞాన మెట్లు సిద్ధించెనో సవిస్తరంబుగా వినఁగోరెదము.

అని ప్రార్థించుటయు వాయుదేవుం డిట్లు చెప్పందొడంగెను. సనాతనుం డగువాసుదేవుండు స్వేచ్ఛామాత్రంబున [illegible] నవతరించి దుఃఖమయం బగుమానుషత్వమునందు విరక్తుండై మునిశ్రేష్ఠుం డగునుపమన్యునికడకుం బోయి జటాసమా[illegible] ను, రుద్రాక్షమాలికావిభూషితసర్వాంగుండును, వివిధశాస్త్ర[illegible] బగువేదంబునుం బోలి శిష్యగణపరివృతుండై యున్నవాఁడును, శాంతస్వభావుండును, శివధ్యానరతుండును మహాతేజుండు నగు నమ్మునిశ్రేష్ఠుని సందర్శించి పులకీకృతసర్వాంగుఁడై యమ్మహర్షిశేఖరునకుఁ బ్రదక్షిణనమస్కారంబులఁ గావించెను. ఆమౌనిసత్తముని సందర్శనమాత్రముచేతనే శ్రీకృష్ణునిసకలదోషములును వినష్టంబులై పోయెను. అప్పుడుపమన్యుండు నిర్మలుం డగుశ్రీకృష్ణునిం గాంచి యథాక్రమంబుగా "అగ్నిః" ఇత్యాదిమంత్రోచ్చారణపూర్వకంబుగా నాతని సర్వశరీ

రంబును భస్మవిలిప్తంబు గావించి ద్వాదశమాసవ్యాప్తం బగుపాశుపత వ్రతంబు ననుష్ఠింపఁజేసి సర్వశ్రేష్ఠం బగుపాశుపతజ్ఞానంబును బ్రసాదించెను.

అది మొదలుగాఁ బ్రశంసితవ్రతు లగుమహర్షు లందఱును బాశుపతవ్రతావలంబులై కృష్ణుని బరివేష్టించి యుపాసింప నారంభించిరి. అప్పుడు పరమశక్తిమంతుం డగుకృష్ణుండు గురునిచే నియోగింపఁబడి పుత్రార్థియై యంబాసహితుఁ డగుశంకరు నుద్దేశించి తపంబు గావించెను. ఆతపఃప్రభావముచే నాతఁడు వర్షాంతంబున దేవీసహితుండును, ప్రమథగణపరివృతుండు నగుశంకరుని సాక్షాత్కరింపఁజేసికొని యాదేవునను గ్రహంబుచేఁ బుత్త్రలాభముం గాంచెను. భగవానుఁ డగుశివుం డంబికాసహితుఁడై వచ్చి పుత్త్రదానముం గావించుటచేఁ గృష్ణుండు జాంబవతీగర్భజాతుం డగుప్రథమపుత్త్రునకు సాంబుఁడని నామకరణముం గావించెను.

## —♦ విద్యావతారకథనము. ♦—

పురాణము, ధర్మశాస్త్రము, చతుర్వేదములు, షడంగములు, [illegible]యశాస్త్రము ననునివి చతుర్దశవిద్యలు. వీనితో [illegible]ర్వేదమును, గాంధర్వమును, అర్థశాస్త్రమును [illegible]. భిన్నభిన్నమార్గప్రవర్తకంబు లగునీ [illegible]కాలపాశియే యని వేద [illegible]. [illegible]బ్రహ్మాండనాయకుఁ డగుమహాదేవుఁ డీ [illegible]ముతో ముందుగా సనాతనుండగుబ్రహ్మదేవుని బుత్త్రరూపంబున సృజియించి విశ్వయోని యగునాతనికి విశ్వవిశ్వసృష్టినిమిత్తంబుగా నీయష్టాదశవిద్యలను బ్రసాదించెను. సృష్టికర్త యగుబ్రహ్మ యట్లు విద్యాలాభంబు నంది మొట్టమొదటఁ బురాణము

ను స్మరించెను. అనంతరమాతనిముఖంబులనుండి సకలవేదంబులును బహిర్గతంబు లయ్యెను. వేదానంతరము సకలశాస్త్రంబులు నుదయించెను. అనంతంబులగునీశాస్త్రంబుల నధ్యయనంబు గావించుటకుఁ బృథ్వియందలిప్రజలందఱు నసమర్థులగుటయు ద్వాపరయుగాంతంబున నీసకలశాస్త్రంబులును సంక్షేపంబు చేయుటకై యీశ్వరాదేశంబున సర్వమయుం డగువిష్ణుదేవుండు సత్యవతీగర్భంబున నరణియం దగ్నిదేవుండునుంబోలి వ్యాసరూపంబున నవతరించెను. ఆవేదవ్యాసుండు తన మతియను మంథానదండముతో వేదసముద్రమును మథించి దానినుండి ప్రకాశమానం బగుమహాభారత మనుచంద్రమండలము నుదయింపఁ జేసెను. మఱియు నాతఁడు వేదసమూహమును సంక్షేపముగఁ జేసి చతుర్భాగములుగా విభజించెను. అందుచేతనే యాతనికి వేదవ్యాసుఁ డనునామము గలిగెను. ఆతఁడు పురాణముల నన్నిటిని నాలుగులక్ష శ్లోకములుగా సంక్షేపించెను. దేవలోకమునం దిప్పటికిని బురాణములు శతకోటిశ్లోకపరిమితములై యున్నవి. వేదములు వేదాంగములు, ఉపనిషత్తులనుగూడ నధ్యయనము గావించినను బురాణజ్ఞానము లభింపకున్నచో విచక్షణులు గాఁజాలరు. ఇతిహాసపురాణములచే వేదమును బరిపుష్టినందింపవలయును. అల్పజ్ఞాను లగువారు నన్నుల్లంఘింతురని వేదము సర్వదా భయపడుచుండును. సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము నని పురాణము పంచలక్షణములు గలది. బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, భవిష్యము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, బ్రహ్మవైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము నని పురాణములు పదునెనిమిది.

అందుఁ జతుర్థం బగుశివపురాణమునందు శివమాహాత్మ్యము వర్ణితమై యుండును. దేవలోకమునందు దీనిమూలగ్రంథము లక్షశ్లోకములచేతను, ద్వాదశసంహితలచేతను విరాజిల్లుచున్నది. ధర్మప్రతిష్ఠితం బగునీపురాణము స్వయముగా నీశ్వరునిచేఁ గథితంబైనది. వర్ణత్రయమునందును సముత్పన్ను లగుశివభక్తు లీశివోక్తధర్మానుష్ఠానంబుచే నొకజన్మమునందే శివప్రసాదంబున ముక్తిలాభంబు నందుదురు. కావున మోక్షంబు గోరువారు శివు నాశ్రయింపవలయును. దేవతలకుఁగూడ శివాశ్రయంబునఁగాని ముక్తి లభింపదు. వేదతుల్యం బగునీశివపురాణము విద్యేశ్వరసంహిత, రౌద్రసంహిత, వినాయకసంహిత, ఉమాసంహిత, మాతృకాసంహిత, ఏకాదశరుద్రసంహిత, కైలాససంహిత, శతరుద్రసంహిత, కోటిరుద్రసంహిత, సహస్రకోటిరుద్రసంహిత, వాయవీయసంహిత, ధర్మసంహిత యని ద్వాదశసంహితలుగా విభక్తమై యున్నది. అందు విద్యేశ్వరసంహిత దశసహస్రశ్లోకపరిమితము. ప్రత్యేకముగ రౌద్ర, వైనాయ, కోమా, మాతృకాసంహిత లష్టసహస్రశ్లోకసంకలితములు. ఏకాదశరుద్రసంహితత్రయోదశసహస్రశ్లోకసమన్వితము. కైలాససంహిత షట్సహస్రశ్లోకభూయిష్ఠము, శతరుద్ర, కోటిరుద్ర, సహస్రకోటిరుద్రసంహితలు ప్రత్యేకముగ దశసహస్రశ్లోకసంపన్నములు. వాయవీయసంహిత చతుస్సహస్రశ్లోకవిలసితమును, ధర్మసంహిత పంచసహస్రశ్లోకవిరాజితమునై యీవిధముగా శివపురాణము లక్షశ్లోకములచే శోభిల్లుచున్నది. చతుస్సహస్రపరిమిత మగువాయవీయసంహిత రెండుభాగములై యున్నది. ఉత్తమం బగునీశాస్త్రము వేదజ్ఞానవిహీనునకు బోధింపరాదు. శ్రద్ధావిహీనులకును, బురాణజ్ఞానవిహీనులకును దీనింగూర్చి చెప్పరాదు. సర్వవిధములఁ బరీక్షితుండును, అనసూయుండును, ధార్మికుండును, శివభక్తుండు నగుశిష్యునకీశివపురా

ణాము నుపదేశించవలయును. ఎవ్వనిమూలమున మనకీసకలపురాణసంహితలును లభించినవో యట్టి యమితతేజుండును, భగవానుండు నగు వేదవ్యాసునకు నమస్కారము.

## —♦ బ్రహ్మసందర్శనము. ♦—

సూతుం డిట్లనియెను. మహర్షిశేఖరులారా! పూర్వము మహాత్తరంబగు కాలగతిచే ననేకకల్పంబులు మరలమరలఁ గడచినతరువాతఁ బ్రస్తుతోపస్థితంబగు శ్వేతవరాహకల్పంబున మరల సృష్టిప్రవృత్తి యగుటయు జగత్కార్యంబులు యథారూపముగఁ బ్రవర్తిల్లుచుండెను. అప్పుడు ప్రజలందఱును బ్రబుద్ధులై యుండఁగా షట్కులీయులగుమునీంద్రులకుఁ బరస్పరమును "ఇదిబ్రహ్మతత్త్వము; ఇది కాదు" అనువిషయమునుగూర్చి మహత్తర మగువివాదము గలిగెను. కాని బ్రహ్మతత్త్వము దుర్నిరూప్యం బగుటచే నెంతకును విషయనిశ్చయము కాకపోయెను. అప్పు డమ్మునులందఱును సకలదేవతాపూజితుండై యుండు బ్రహ్మదేవుని సందర్శించుటకై బ్రహ్మలోకమునకుఁ బ్రయాణమైరి. దేవదానవసంకులంబును, సిద్ధచారణగణవిలసితంబును, యక్షగంధర్వసేవితంబును, బహువిహంగకలకూజితంబును, మణివిద్రుమవిభూషితంబును, నికుంజకందరదరీనిర్ఝరాభిశోభితంబును, రతికమనీయంబును, శుభదర్శనీయంబును నగుసుమేరుశృంగంబున నానాపశుసమాకీర్ణంబును, దశయోజనవిస్తీర్ణంబును, దశయోజనాయతంబును నగుబ్రహ్మవనంబు గలదు. అందలిసరోవరము లతిరమణీయములై నిర్మలస్వాదుజలపూర్ణములై యుండును. అందలితరులతాదులు భృంగనిస్వనంబులచే విలసిల్లుపుష్పమంజరులచే నలంకృతములై యుండును. ఆవనమధ్యంబున దైత్యదానవుల కగమ్యంబును, సూర్యతేజోమయంబు నగు నొకనగరంబు గలదు. ఆనగరంబు సముద్రి[illegible]ప్రాకారతోరణ మంచి

రంబును, జాంబూనదమయంబును నై, ప్రశస్తరాజమార్గంబులచేతను, నగరతలంబు నొరయుచుండు మణిమయసౌధశిఖరంబులచేతను శోభిల్లుచుండును. అందు సాధ్యగణసహితుం డగు బ్రహ్మదేవుండు నివసించియుండును.

మహర్షులందఱు సచ్ఛోకం బోయి దేవర్షిగణసేవితుండును, సాన్ద్రాలోకపతామహుండును, స్వర్ణప్రభుండును, సకలాభరణవిభూషితుండును, ప్రసన్నవదనుండును, పద్మపత్రవిశాలలోచనుండును, పరమదస్ఫూర్తియుండును, దివ్యగంధానులిప్తుండును, దివ్యశ్వేతవస్త్రాలంకృతుండును, దివ్యమాల్యవిభూషితుండును, దివిజమునివందితపాదారవిందుండును, దివాకరసదృశప్రభాసంపన్నుండును, దివ్యలక్షణలక్షితుండును, దేవీసహితుండు నగుబ్రహ్మదేవుని సందర్శించిహర్షోత్ఫుల్లనయనులై నిటలతటంబుల నంజలులు ఘటించి సురశ్రేష్ఠుండగునాతని నిట్లనిస్తుతింపందొడంగిరి.

మహాత్మా! సృష్టిస్థితిలయంబులకుఁ గారణభూతుండవు, పురాణపురుషుండవు, పరమాత్మవు, బ్రహ్మవు, ప్రధానదేహుండవు, ప్రధానక్షోభకారివి, త్రయోవింశతితత్త్వభేదంబుచే వికృతుండవు, అవికారుఁడవు నగునీకు నమస్కారము. ఈబ్రహ్మాండమంతయు నీయందే యున్నదని చెప్పఁబడినది. నీవీబ్రహ్మాండమధ్యమునందు సుస్థిరుండవై యున్నావు. నీవు సంసిద్ధకార్యస్వరూపుఁడవు. కార్యసిద్ధికిఁ గారణుఁడవు. అట్టినీకు నమస్కారము. సర్వలోకస్వరూపా! సర్వలోకవిధాతా! సర్వాత్మా! సర్వదేహాత్మసంయోగవియోగకారణా! నీకు నమస్కారము. నీవీసకలజగంబులను సృజించితివి. నీవే పాలించుచుంటివి. మరల నీవే సంహరించుచుందువు. దేవా! నిమాయామయం బగుమోహినీశక్తి

నెఱుంగుటకు మేమెంతవారము ? సర్వలోకపితామహా ! నీకు నమస్కా-
రము.

అని యిట్లు మునివరులు వినుతించుటయు బ్రహ్మదేవుండు సం
తుష్టుండై ప్రియమధురగంభీరస్వరంబున నో మహాభాగు లగుమునీంద్రు
లారా ! మీరందఱునుగలసి యిట్లు విచ్చేయుటకుఁ గారణ మేమి ? అని
ప్రశ్నించుటయు నమ్మహర్షులు వినయవినమితులై భక్తిపూర్వకంబుగ
నిట్లు విన్నపంబు సేయందొడంగిరి. మహాత్మా ! మేమతిఘోరం బగు
నజ్ఞానాంధకారముచే నావృతులమై యున్నాము. మేముపరస్పరమును
వాదోపవాదములచే నెంత శ్రమపడినను బరతత్త్వమును గ్రహింపఁజా
లకుంటిమి. నీవు సకలజగద్విధాతవును, సర్వకారణుఁడవు నై యుంటివి.
ఓలోకనాథా ! ఈజగంబునందు నీయెఱుంగనితత్త్వం బేదియును లేదు.
ఏపురుషుఁడు సకలజీవులకంటెను బ్రాచీనుండును, విశుద్ధుండును, బరి
పూర్ణుండును, నిత్యుండును, బరమేశ్వరుండును, బరమపురుషుండు నై
యుండెనో, యెవ్వనిచిత్రకృత్యంబుచేఁ బ్రప్రథమమందీజగంబు సృజిం
పఁబడియెనో, తుద కిది యంతయు నెవ్వనియందు లయంబు గాంచు
నో, సర్వభూతంబు లెవ్వనికి వశ్యములై యుండునో, సర్వనియంత యె
వ్వఁడో, యట్టిపరమపురుషుం డగునీశ్వరుని సందర్శించుటకు మేమెట్లు
సమర్థుల మగుదుమో దయయుంచి యానతీయవలయును.

## —♦ బ్రహ్మప్రబోధము. ♦—

బ్రహ్మదేవుం డిట్లు ప్రార్థితుండై విస్మయస్మేరవీక్షణంబులతో
దేవదానవమునిసన్నిధానంబున లేచి నిలువఁబడి చాలసేపటివఱకును
ధ్యానించి రుద్రశబ్దము నుచ్చరించుచు నానందపులకితగాత్రుండును,
గృతాంజలిపుటుండు నై యిట్లు చెప్పందొడంగెను. మహాభాగులారా!
ఎవ్వఁడు వాఙ్మనంబుల కగోచరుఁడో, యెవ్వనిధ్యానానంద మితర

భయాతీత మైనదో, యెవ్వనినుండి బ్రహ్మవిష్ణురుద్రేంద్రపూర్వకం
బగునీసమస్తమును, సర్వభూతేంద్రియసహితముగాఁ బ్రప్రథమమునం
దుదయించెనో, యెవ్వఁడు కారణంబులకు విధాతయు, ధ్యాతయుఁ,
బరమకారణుండు నై యుండెనో, యెవ్వఁ డేవస్తువునుండియు నెన్నఁడు
'నుదయింపకుండునో, యెవ్వఁడు సర్వైశ్వర్యసంపన్నుఁడై సర్వేశ్వరనా
మంబున విలసిల్లుచుండునో, మోక్షార్థులగువా రెల్లరు నెవ్వని ధ్యానిం
చుచుందురో, యెవ్వఁ డాకాశమధ్యగతుండును, శంభుండునై యుండు
నో, యెవ్వఁడు ప్రథమంబున నన్నుఁ బుత్త్రునిగా సృజించి నాకుఁ
దత్త్వజ్ఞానమును బ్రసాదించెనో,యెవ్వనియనుగ్రహంబుచే నేనుప్రజా
పత్యపదలాభముం గాంచితినో, యెవ్వం డీశ్వరుండును, నద్వితీయుండు
ను, భూరుహముంబోలి యచలుండును, గగనస్థితుండు నై యుండునో,
యేమహాపురుషునిచే నీయఖిలజగంబును బరిపూర్ణమై యుండునో,
యెవ్వఁ డేకాకి యయ్యును గ్రియాశూన్యులగు బహుప్రాణులకు
సత్క్రియాసంపాదకుఁడై యుండునో, యెవ్వం డొక్కఁడయ్యును
బహుబీజంబులను సృష్టించుచుండునో యాతఁడే పరమేశ్వరుఁడు. అప్ర
తిహతశాలి యగునాతఁడు సకలజీవసహితం బగుబ్రహ్మాండమం దం
తట నధిష్ఠించి యుండును. ఆతఁ డొక్కఁడే భగవంతుఁడు. ఆతనికం
టె ద్వితీయు లెవ్వరును లేరు. ఆతఁడు సర్వదా జీవహృదయంబుల
నెలకొని యున్నను నగోచరుఁడై యుండును. మఱియుఁ దా నప్రకా
శుఁడై, సకలజగంబులను బ్రకాశింపఁజేయుచు జగదధిష్ఠితుఁడై యుం
డును.అనంతశక్తి యగునాతఁడు కాలాత్మయుక్తంబు లగుసకలకారణం
బుల నధిష్ఠించి యుండును. జగంబంతయు నంధకారావృతమై దివా
రాత్రివిభేదంబు లేక సదసద్వస్తువిహీనంబై యున్నసమయంబునఁ గేవ
లము సర్వమంగళమయుం డగు నాపరమేశ్వరుఁ డొక్కఁడే విరాజిల్లు

చుండును. ఆతనినుండియే ప్రజ్ఞ యుదయించెను. సర్వోత్తముండును, సర్వోత్కృష్టుండును, నిర్గుణుండును, గుణమయుండును, నిష్కలుండును, మంగళమయుండు నగునీశ్వరుఁ డాతఁడే. కార్యకరణంబుల నాతనితో సమానులుగాని, యీతనికంటె నధికులుగాని యెవ్వరును లేరు. ఆతనిశక్తి స్వభావముచేతనే సర్వోత్కృష్టమైనది. ఆతనిజ్ఞానక్రియలు నిత్యములైనవి. అవ్యక్తం బగుక్షరంబును, అమృతం బగునక్షరంబునుగూడ నక్షరాత్మకంబులై యేకాత్మకంబులై యేకాత్మ్యం బగునాపరమేశ్వరునందే వివర్తంబులై యున్నవి. ఆపరమేశ్వరధ్యానయోజనంబులచేతను దత్త్వచింతనంబుచేతను మాయ శక్తియుక్తం బగును. ఆదేవుని యెదుట విద్యుల్లతలు మెఱయఁజాలవు. సూర్యచంద్రులు ప్రకాశింపఁజాలరు. ఆతనితేజఃకిరణములచేతనే సచరాచరంబగుజగంబంతయుఁ బ్రకాశించు నని శ్రుతులు చెప్పుచున్నవి. ఆమహాదేవుం డొక్కఁడే మహేశ్వరుం డని యెఱుంగునది. ఆతనిదివ్యపదంబుకంటె నుత్తమపదంబు లేవియును లేవు. ఆతఁడే సర్వంబునకుఁ బ్రభుండు. కాని యాతని కాద్యంతములు లేవు. ఆతఁడు సహజనిర్మలుండును, స్వతంత్రుఁడును, బరిపూర్ణుఁడు నై యుండును. ఈచరాచరవిశ్వంబంతయు నాతనియిచ్ఛాధీన మైనది. ఆతనిదేహ మప్రాకృత మైనది. ఆతఁడు లక్ష్యలక్షణశూన్యుఁడు. ఆతఁ డమూర్తుం డయ్యును మూర్తికారకుఁడు; కాలసంబంధము లేనివాఁ డయ్యు నాతఁడు కాలప్రేరకుఁడు. ఆతఁడు సకలంబునకు నూర్ధ్వస్థితుండై యుండును. ఆసర్వజ్ఞునియందే సకలంబును నిలిచియున్నది. షడధ్వమయుం డగునాతఁడు సర్వజగన్నాథుఁడు. ఉన్నతోన్నతుం డగునాతనికంటె నున్నతు లెవ్వరును లేరు. అనంతమహిమాధారుం డగునాతనివైభవ మపరిచ్ఛిన్నమైనది. సకలేంద్రియంబులయందును శుద్ధబుద్ధిప్రవర్ధకుం డగునాతఁ డాత్మశ

ద్వామృతాస్వాదనరసికుం డగుచిరయౌవనుఁడు. అనంతానందనిష్యంద మకరందపానమధువ్రతుం డగునాతఁ డఖండజగదండములను బిండీకరిం చుటయందుఁ బండితుఁడు. ఔదార్యవీర్యగాంభీర్యమాధుర్యసముద్రుఁ డగునాతనితో సమానమగువస్తు వేదియును లేదు. రాజరాజేంద్రుఁ డగు నాతనితో నుపమింపఁదగినవా రెవ్వరును లేరు. ఆచిత్రకారునిచే తనే ప్రథమంబున నీజగంబు సృజింపఁబడియెను. అంతకాలంబున నిది మరల నాతనియందే విలీనంబు గాఁగలదు. సర్వనియోజకుం డగునా తనికి సకలభూతములు వశ్యములై యుండును. ఆతని సందర్శించుటకు భక్తికంటె నన్యోపాయంబు లేదు. ఆతనియందు భక్తిని వర్ధిల్లఁజేయు టకే పండితులచే వ్రతంబులును, వివిధంబు లగుదానములును, దపం బులును, నియమములును గల్పింపఁబడియెను. నేనును, విష్ణుదేవుండు ను, రుద్రుండును, సకలసురాసురగణంబులునుగూడ నాతనిసందర్శనం బుకొఱకు మహోగ్రం బగుతపంబు నిప్పటికి నాచరించుచున్నారము. దుర్జనులు, మూర్ఖులు, పతితులు, నింద్యచరిత్రులు నగువారి కాతఁ డగోచరుం డైనను భక్తులగువారికి నిరంతరమును బహిరంతర్దర్శనీయుం డును, బ్రాహ్యుండు నై యుండును.

స్థూలంబును, సూక్ష్మంబును, దదుభయాతిరిక్తంబు నని యాత నిస్వరూపము త్రివిధంబు. అస్మదాదులగునమరులందఱును స్థూలరూ పమును దర్శింపఁగలుగుదురు. యోగిగణంబుల కాతనిసూక్ష్మమూర్తి గోచరం బగును. తృతీయమూర్తి నిత్యమును, జ్ఞానానందమయంబును, నవ్యయము నైనది. తదేకనిష్ఠులును, దదేకతత్పరులు తద్వ్రతానుష్ఠా ననిరతులు నగుభక్తులుమాత్రమే దానిని దర్శింపఁగలరు. అది గుహ్యా తిగుహ్యంబైనది. శివభక్తుండగువాఁడు నిశ్చయముగా భక్తిపరిభావ ముచే విముక్తుం డగును. అంకురమునుండి బీజమును, బీజమునుండి

యంకురంబునుంబోలి శివప్రసాదముచే భక్తియు, భక్తిచేశివప్రసాదం బును గలుగుచుండును. ఈశ్వరానుగ్రహప్రభావముచేతనేజీవునకు సర్వతృ సిద్ధిలాభం బగును. సర్వవిధసాధనంబులచేఁ దుదకు శివుండును వశీభూతుం డగును. ధర్మమే యీశ్వరప్రసాదసాధనము. అది వేద ప్రదర్శితమైనది. వేదాభ్యాసవశంబుననే పూర్వజన్మార్జిత పుణ్యపాపం బులకు సామ్యంబును, దానివలన శివప్రసాదసంపర్కమును, దానివల న ధర్మాతిశయంబును గలుగును. ధర్మాభివృద్ధివలన జీవునకుఁ బాప క్షయం బగును. క్షీణపాపుఁడగుజీవునకుబహుజన్మపరంపరలచేఁ గ్రమ ముగా దేవీసహితుఁడగుసర్వేశ్వరునందు జ్ఞానపూర్వకమగు భక్తి యు దయించును. జీవుం డు పరమేశ్వరు నెట్లు భావించునో తదనురూపంబ గునీశ్వరప్రసాద మాతనికి లభించును. శివప్రసాదమువలనఁ గర్మఫల నివృత్తి యగును. కర్మఫలంబులయందు స్పృహాశూన్యుండగువాఁడు శివధర్మపరిగ్రహంబున కర్హుం డగును.

గురూపదేశసహితము, గురూపదేశరహితము నని శివధర్మపరి గ్రహణము ద్వివిధంబు. అందు గురురహితంబగుదానికంటె గురుస హితమైనదియే శతగుణాధికంబు. శివధర్మపరిగ్రహం బైనంతనే శివ జ్ఞానోత్పత్తి యగును. శివజ్ఞానోదయమైనంతనే మానవునకు సంసార దోషజ్ఞానంబును, గ్రమముగా విషయవైరాగ్యంబును గలుగును. ఆ వైరాగ్యమువలన నీశ్వరవిచారమును, దానివలనఁ గర్మపరిత్యాగంబు ను, ధ్యానాసక్తియు నగును. జ్ఞానధ్యానయుక్తుం డగుపురుషునకు యో గంబును, యోగముచే నుత్తమంబగుభక్తియు, భక్తివలననీశ్వరప్రసా దమును సిద్ధించును. ఆశివప్రసాదముచేముక్తి గలుగును. ముక్తుండ గుజీవుఁడు శివతుల్యుండగును. ఈయనుగ్రహప్రసారమునకుఁ గ్రమం బగునెట్టినియమమును లేదు. ఏపురుషున కెట్టియోగ్యత గలదో యా

లే దృష్టియనుగ్రహమును బడయుచుండును. కొందఱు గర్భావస్థయం దును, కొందఱు జననానంతరమునను, కొందఱు బాల్యంబునను, కొందఱు తారుణ్యంబునను, కొందఱు వార్ధకంబునను, ముక్తులగుచుందురు. కొందఱు తిర్యగ్యోనిగతులై ముక్తిం గాంతురు. కొందఱు నరకపతితులై ముక్తు లగుదురు. స్వకర్మబలంబున నున్నతపదప్రాప్తులై తత్పదక్షయానంతరంబునం గొందఱును, అట్లు పదక్షయం బైనపిమ్మట మరల జన్మగ్రహణంబు గావించి కొందఱును, ఊర్ధ్వగతులై యచ్చటనే సుస్థిరులై యుండి కొందఱును, ముక్తు లగుచుందురు. కావున మానవులకు ముక్తి యేకవిధమైనది గాదు. వారివారి జ్ఞానభక్తుల ననురూపంబగుప్రసాదబలముచే ముక్తిలాభం బగుచుండును. కావునం దత్ప్రసాదార్థమై వాఙ్మనోదోషశూన్యులై దారపుత్రాగ్నిసహితముగా నేకమాత్రశివారాధనతత్పరులు గావలయును. మఱియు, శివనిష్ఠులును, శివపరులును, శివధ్యానయుతులును, శివాశ్రితులునై తదేకచిత్తంబున సకలకార్యంబుల ననుష్ఠించుచుండవలయును.

వాయుదేవుం డిప్పుడు దేవతలచే సహస్రవర్షంబగు నొకయజ్ఞమును బ్రారంభింపం జేసి యున్నాఁడు. ఆయజ్ఞావసానమునం దాతఁడు మంత్రప్రభావముచే నైమిశారణ్యమునకు వచ్చి మీకు శ్రేయోపాయము నుపదేశింపఁగలఁడు. అనంతరము మీరు దేవదేవీనివాసంబును, బరమశోభనంబును, బవిత్రంబు నగు వారాణసీక్షేత్రమును సేవింపుఁడు. ఆస్థానమునందు శ్రీమంతుఁ డగుమహాదేవుఁడు భక్తాభీష్టదాయకుఁడై విహరించుచుండును. మీరచ్చట జరుగువిచిత్రసంఘటనముల నన్నిటి నవలోకించి మరల నాయొద్దకు రావలయును. అప్పుడు నేను మీకేకజన్మమునందే ముక్తి కరతలామలకం బగునట్టియుపాయమును జె

ధించెదను. నేనిప్పుడు నాచేఁ గల్పితంబగునీమనోమయచక్రమును విసర్జించెదను. దీనికడకమ్మి యెచ్చట విశీర్ణంబై పడిపోవునో యాస్థలము మీతపస్సాధనంబున కుత్తమంబైనది.

అని చెప్పి పితామహుం డగుబ్రహ్మదేవుండు సూర్యతేజోమయంబగుచక్రమును గైకొని మహాదేవునకుఁ బ్రమాణంబు గావించి దానినివిసర్జించెను. అప్పుడు మునులందఱును బ్రహృష్టాంతఃకరణులై జగత్ప్రభుండగువనజాసనునకు నమస్కరించి యాచక్రనేమి యెచ్చట విశీర్ణం బగునో యాస్థానమును దర్శించుటకై బయలుదేఱిరి. ఆచక్రము పోయిపోయి స్వాదుజలపరిపూర్ణంబును, విమలంబు నగునొకవనంబునఁ జారుశిలాతలంబునఁ బడిపోయెను. ఆకారణముచే సకలమునిజనపూజితంబగునావనంబునకు నైమిశారణ్యం బనుపేరు గలిగెను. అది బహుసంఖ్యాయక్షగంధర్వవిద్యాధరపరిపూర్ణంబును, పవిత్రమునై యుండెను. పూర్వకాలంబునఁ బురూరవుండనునృపాలుండష్టాదశసముద్రద్వీపంబులనేలుచు దైవవశంబున నూర్వశీవిలాసమునకు వశీభూతుఁడై పోవుచు నక్రమంబుగా మునీంద్రుల స్వర్ణయజ్ఞశాల నపహరించెను. అందుచే మునులందఱును గోపించి కుశవజ్రప్రయోగంబుచే నాతని నచ్చటనే నిహతుం గావించిరి. విశ్వసృష్టిసంకల్పులును, బ్రహ్మజ్ఞులును, గార్హపత్యాశ్రమకలితులు నగుప్రజాపతులు పూర్వమం దచ్చట దివ్యయజ్ఞారంభము గావించిరి. ఆనైమిశంబున శబ్దశాస్త్రాయకోవిదులును, శక్తిప్రాజ్ఞక్రియాయోగులును నగుమహర్షులచే ననేకసత్కార్యము లనుష్ఠితంబు లయ్యె. అచ్చటనే వేదవిదులగుపండితులు వేదవాదబహిష్కృతులగుప్రతివాదులను విజితులం గావించుచుండిరి. ఆనైమిశారణ్యము స్ఫటికమయపర్వతపాదజాతంబు లగుశిలలనుండి ప్రవహించుచుండునమృతస్వాదుజలధారలచేతను, మధురఫలభరితంబులగు

తరువరంబులచేతను రమణీయమై, హింస్రజంతువిహీనమై, మునిజనత
పోయోగ్యంబై విరాజిల్లుచున్నది.

—♦ అ ని లా గ మ న ము. ♦—

సూతుం డిట్లనియెను. ఆనైమిశంబునఁ బ్రశంసితవ్రతులును, మహాభాగులు నగుమునిగణంబులు మహాదేవు నర్చించుచు యజ్ఞారంభముం గావించిరి. విశ్వసృష్టిప్రవృత్తు లగుప్రజాపతులు పూర్వకాలమునందు యజ్ఞపరిసమాప్తి గావించినట్లే మహర్షులందఱు సత్యాశ్చర్యకరంబుగా నమ్మఖంబును భూరిదక్షిణలతో సంపన్నంబు గావించినకొంతకాలమునకు బ్రహ్మనియోగంబున వాయుదేవుండు స్వయముగా నచ్చటికి విచ్చేసెను. బ్రహ్మశిష్యుండును, జితేంద్రియుండును, సర్వంబును బ్రత్యక్షముగ దర్శించువాఁడును, నలువదితొమ్మిదివాయువులను దనయాజ్ఞలలో మెలఁగించువాఁడును, ప్రాణాదివాయుప్రవృత్తులచే నిత్యమును నవయవసంచాలనంబు గావించుచు జీవులశరీరధారణంబునకాధారుండై యున్నవాఁడును, అణిమాద్యష్టైశ్వర్యసమన్వితుండును, సకలభువనధరుండును, గగనసంభూతుండును, శబ్దస్పర్శగుణకలితుండును, తేజఃప్రకృతి యని తత్త్వవేత్తలచేఁ బ్రశంసితుండును నగువాయుదేవుం డట్లాశ్రమంబున కేతెంచుటయు దీక్షసత్రు లగునమ్మును లందఱును బ్రహ్మదేవుని పూర్వవాక్యంబులను దలంచుకొని పరమానందముతో నెదురేఁగి ప్రణామపూర్వకంబుగా నాతనిం దోడ్తెచ్చి సువర్ణపీఠంబున నాసీనుం గావించిరి. అనిలదేవుం డట్లు మునులచే నభ్యర్చితుండై యవ్వాసనంబున నుపవసించి యందఱ నభినందించుచు మునిశేఖరులారా! మహాయజ్ఞారంభంబు గావించినప్పటినుండియు సర్వవిషయంబుల మీకెల్లరకును కుశలంబేకద! యజ్ఞవిఘాతుకులగుదైత్యుల వలన మీకెట్టిబాధలును గలుగలేదుగద! ప్రాయశ్చిత్తంబును, ననిష్టం

బును గలుగకుండ సకలక్రియలును సక్రమంబుగ నిర్వర్తితంబు లయ్యె
నుగద! ఈయజ్ఞానంతరమున మీరింకను నేమి చేయఁదలంచితిరి.

అని వాయుదేవుండు కుశలప్రశ్నంబు సేయుటయు బవిత్రచరి
త్రులగుమునిశ్రేష్ఠులు ప్రహృష్టహృదయులై వినయపూర్వకంబుగ
నిట్లు చెప్పందొడంగిరి. మహాత్మా! ఇయ్యాశ్రమంబునకుఁ గల్యాణకరం
బగుభవదాగమనంబువలన మాకుఁ గుశలం బగుటయే గాక మాత
పంబు లన్నియును ఫలించినవి. పూర్వవృత్తం బొక్కటి యాలకింపుము.
పూర్వము మేమందఱము నజ్ఞానమోహితులమై పరబ్రహ్మజ్ఞానబోధం
బుకొఱకుఁ బ్రజాపతి యగుబ్రహ్మదేవు నుపాసించితిమి. శరణాగత
వత్సలుం డగునద్దేవుండు మాయందుఁ గరుణించి భగవానుం డగురు
ద్రుఁడే సకలశ్రేష్ఠుం డగుపరమకారణుం డనియు, అప్రతర్క్యుం డగు
నాతత్త్వస్వరూపుని భక్తులుమాత్రమే దర్శింపఁగల రనియు, భక్తియు,
మోక్షంబు నాతనిప్రసాదంబుననే లభించుననియు, కావున మీరాతని
ప్రసాదంబుకొఱకు నైమిశారణ్యంబున దీర్ఘసత్రయాగంబు నారంభించి
యద్దేవు నుపాసించుచుండవలయు ననియు, ఆయజ్ఞావసానంబున వా
యుదేవుం డటకు వచ్చు ననియు, ఆతనియుపదేశంబుచే మీకు జ్ఞాన
లాభంబును, గల్యాణంబు నగుననియు, నానతిచ్చి మమ్మిటకుఁ బంపి
యున్నాఁడు. మేము నిందుండి భవదాగమనంబుకొఱకు నిరీక్షించు
చుంటిమి. దీర్ఘసత్రానుష్ఠానంబు గావించి సహస్రదివ్యవర్షంబు లయ్యె
ను. తత్ఫలంబుగా మీ రిట కేతెంచిరి. ఇంతకంటె మాకుఁ బ్రార్థనీ
యం బేమున్నది? అని చెప్పుటయు వాయుదేవుండు ప్రీతుండై ముని
పరివేష్టితుండై యుండి వారికి భక్తివృద్ధ్యర్థమై మహాదేవతత్త్వముఁ
గూర్చి బోధింపఁదొడంగెను.

## —♦ మహర్షిపవనసంవాదము. ♦—

నైమిశారణ్యవాసు లగుమహర్షు లందఱును బవనదేవుని యథావిధిగ నర్చించి మహాత్మా! నీకు పరమేశ్వరజ్ఞానము లభించినవిధమును, నీవవ్యక్తజన్ముం డగుబ్రహ్మదేవునకు శిష్యుండ వైనవిధంబును దెలుపవలయు నని ప్రశ్నించుటయు వాయుదేవుం డిట్లనియెను. మునులారా! పందొమ్మిదవ శ్వేతలోహితకల్పంబునందు చతురాననుండు సృష్టికాముండై తపంబు గావించెను. పరమేశ్వరుం డగుమహాదేవుం డాతనితపంబునకు సంతుష్టుండై, కుమారుండు నతిసుందరుండు నగు శ్వేతమునిమూర్తిం దాల్చి దివ్యవాక్యోచ్చారణంబు సేయుచు దర్శనం బిచ్చుటయు వనజాసనుండు జగత్పతి యగునమ్మహాదేవుం గాంచి ప్రణామంబు గావించి యాతనియనుగ్రహంబున గాయత్రీసహితం బగు తత్త్వజ్ఞానముం బడసెను. అట్లు చతుర్ముఖుండు తత్త్వజ్ఞానసిద్ధుండై చరాచరంబు లగునిఖిలభూతములను సృజించెను. ఆపరమేశ్వరప్రసాదముచేఁ బద్మాసనుండు పొందఁగలిగినదివ్యతత్త్వజ్ఞానమును, దపఃప్రభావముచే నేనును బరమేష్ఠియనుగ్రహంబునఁ బడయఁగలిగితిని. అని చెప్పుటయు మహర్షిశేఖరు లోమహాత్మా! సత్యంబులకంటె సత్యతరంబును, శుభప్రదంబును, దన్నిష్ఠులగు మానవులకు సుఖప్రదంబును నగునయ్యీశ్వరజ్ఞానము నీకెట్లు లభించినదో యానతీయవలయు నని ప్రశ్నించిరి.

వాయుదేవుం డిట్లనియెను. మునిశేఖరులారా! పూర్వమునాకు లభించినజ్ఞానము జీవమాయాపరమేశ్వరసంబంధమైనది. సుఖార్థులగువారీజ్ఞానమునందే సంపూర్ణశ్రద్ధ గలవారై యుండవలయును. అజ్ఞానదుఃఖము లీజ్ఞానముచేతనే నివర్తితంబు లగును. వస్తుపరిచ్ఛేదమే జ్ఞానము. అజడము, జడము, నియంత యని వస్తువులు త్రివిధంబులు.

ఇవి పశువు (జీవుఁడు) పాశము (మాయ) పతి (ఈశ్వరుఁడు) యనునా మంబులచే వ్యవహరింపఁబడుచుండు. తత్త్వజ్ఞానులగువారు వీనికే అక్షరము, క్షరము, క్షరాక్షరపరము ననునామముల నుపయోగించుచుందురు. అక్షరం బనిన జీవుఁడును, క్షరం బనిన మాయయు, క్షరాక్షరపరం బనిన నీశ్వరుండు నని యెఱుంగునది. ప్రకృతి క్షరంబును, బురుషుఁ డక్షరుండు ననియు నెఱుంగవలయును. ఈ రెంటికిని బ్రేరకుండును, వీనికతీతుండు నగునాతఁడే పరమేశ్వరుఁడు. అని చెప్పుటయు మునులు దేవా! ప్రకృతి యన నేమి? పురుషుఁ డెవ్వఁడు? ఈప్రకృతిపురుషులకుఁ గలసంబంధ మెట్టిది? వీరికి బ్రేరకుండగునీశ్వరునిస్వరూప మెట్లుండును? అని ప్రశ్నించిరి.

వాయుదేవుం డిట్లనియెను. మాయయే ప్రకృతియని చెప్పంబడును. మాయావృతుం డగుబ్రహ్మయే పురుషుఁడు. మలకర్మంబులచే నీరెంటికిని సంబంధము గలిగెను. ఈయుభయంబునకును బ్రేరకుఁడగుపరుఁడే పరమేశ్వరుఁడు.

మునులిట్లు ప్రశ్నించిరి. మాయాస్వరూప మెట్టిది? మాయావృతుం డగుపురుషుం డెట్టివాఁడు? మలంబన నేమి? శివత్వం బెట్లు గలిగెను?

వాయుదేవుండిట్లనియెను. పరమేశ్వరశక్తియే మాయ. మాయావృతుం డగుపురుషుఁడు చైతన్యస్వరూపుఁడు. జ్ఞానచ్ఛాదకంబైనది మలంబని చెప్పంబడును. సహజవిశుద్ధంబును, సహజసిద్ధంబు నైనదియే శివత్వము.

మును లిట్లు ప్రశ్నించిరి. విశ్వవ్యాపకుం డగుపురుషుని మాయ యేకారణముచే నెట్లావరించినది? ఆపురుషుం డెందుకొఱకు మా

యావృతుం డయ్యెను? పురుషుం డెట్లు మాయానివృత్తుండు గాఁగ లుగును?

వాయుదేవుం డిట్లనియెను. వ్యాపకునకును గళాదులకుంబోలి యావరణంబు గలుగును. భోగార్థంబగుకర్మమే యావరణహేతువు. పూర్వోక్తం బగుమలక్షయంబైనచో నావరణనివృత్తియగును.

మును లిట్లు ప్రశ్నించిరి. మహాత్మా! కలాదు లెవ్వి? కర్మమన నేమి? దాని కాద్యంతము లెవ్వి? ఫలాశ్రయము లేవి? భోగ మెవ్వని కొఱకు? భోగ్యమన నేమి? భోగసాధన మేది? మలక్షయ మెట్లగు ను? క్షీణమలుం డగుపురుషుం డెట్లుండును?

వాయుదేవుం డిట్లనియెను. కళ, విద్య, రాగము, కాలము, నియతి యనునీయైదును గళాదులని చెప్పుదురు. పురుషుఁడే భోక్త. కర్మ పుణ్యాపాపభేదంబులచే ద్వివిధంబు. పుణకర్మంబులకు సుఖంబును, బాపకర్మంబులకు దుఃఖంబును ఫలంబులు. అవిద్యాభోగపర్యంతము ను గర్మము నిలిచి యుండును. అది యజ్ఞానాత్మ నాశ్రయించి యుండును. అవిద్యాభోగపూర్తి యైనచోఁ గర్మాంతం బగును. కర్మవినాశంబుకొఱకే భోగము. అవ్యక్తం బగుప్రకృతియే భోగ్యము. బాహ్యంతరేంద్రియమూలంబున శరీరము భోగసాధనం బగుచున్నది. నిరంతరశివతత్త్వధ్యానమూలంబున లభించినయీశ్వరానుగ్రహంబుచే తనే మలక్షయం బగును. ఆత్మమలక్షయం బైనంతనే పురుషుండు శివసమానుండు గాఁగలఁడు.

మును లిట్లు ప్రశ్నించిరి. కలాదిపంచతత్త్వంబులకంటెను గర్మ మేకారణముచే వేఱైనది? భోక్త యనియుఁ బురుషుఁడనియు నాత్మ యేకారణముచేఁ బ్రసిద్ధమైనది? అవ్యక్తస్వరూప మెట్టిది? దానికి భో

గ్యత్వ మెట్లు సంభవించెను? పురుషునకు భుక్తియం దాశ్రయ మేది? శరీర మన నేమి?

వాయుదేవుం డిట్లనియెను. విద్యాకళలు జ్ఞానవ్యంజకములు. రాగము ప్రవర్తకమైనది. అవచ్ఛేదకమైనది కాలము. నియమించునది నియతి. త్రిగుణాత్మకంబును, గారణంబునగునవ్యక్తమే ప్రధానమనియుఁ బ్రకృతియనియుఁ దత్త్వజ్ఞులు చెప్పుదురు. ఆప్రకృతినుండిసత్వరజస్తమోగుణంబు లుత్పన్నంబు లయ్యెను. తిలలయందుఁ దైలముంబోలి త్రిగుణంబులు బ్రకృతియందుసూక్ష్మరూపముతో నుండును. సమస్తసుఖంబులును, సుఖ హేతువులును సత్వసంబంధమైనవి. కేవలము తద్వ్యతిరిక్తములురాజసములు. స్తంభ మోహంబులు తామసంబులు. సత్వగుణంబుచే నూర్ధ్వగతియుఁ, దమోగుణంబుచే నధోగతియు, రజోగుణంబుచే మధ్యగతియు నగును. పంచతన్మాత్రలును, పంచభూతంబులును, పంచకర్మేంద్రియంబులును ప్రధానబుద్ధ్యహంకారమనంబులు ననునీచతుర్వింశతితత్త్వంబులసమష్టియే సవికారం బగునవ్యక్త మని చెప్పుదురు. అది కారణదశయందున్నప్పు డవ్యక్తంబనియు, ఘటపటాదికార్యదశయందున్నప్పుడు వ్యక్తంబనియు వ్యవహరింపఁబడుచుండును. ఘటాదికార్యంబులు కారణంబులగుమృదాదులకంటె భిన్నంబులు గానియట్లు శరీరాదికార్యంబులు కారణం బగునవ్యక్తంబుకంటె భిన్నంబులు గావు. కావున నవ్యక్తం బొక్కటియే కార్యకారణరూపంబుల విరాజిల్లుచుండును. అవ్యక్తాధారరూపం బగుశరీరమే పురుషునకు భోగ్యమైనది. తద్భిన్నం బగునది పురుషునకుభోగ్యంబు గానేరదు.

మును లిట్లు ప్రశ్నించిరి. బుద్ధీంద్రియశరీరంబుల కంటె నతిరిక్తంబుగా నాత్మయనునొకానొకవస్తు వెచ్చట నేవిధముగా నున్నది?

వాయుదేవుం డిట్లనియెను. బుద్ధీంద్రియశరీరాతిరిక్తంబును, ఆ

వినశ్వరంబును నగునాత్మయనునొకవస్తువున్నది. కాని దానికి హేతు
నిర్దేశంబు సేయుట సులభంబు గాదు. పండితు లగువారు బుద్ధీంద్రి
యశరీరముల కాత్మత్వము నంగీకరింపరు. బుద్ధియే యాత్మ యని
యంగీకరింతు మేని స్మృతి కవకాశము లేకుండఁబోవును. ఇంద్రియం
బులలో నేదేనొకటి యాత్మగా భావింతుమేని నానావిషయకజ్ఞానము
లేకుండఁబోవును. ఒకయింద్రియమునకు నొక్కటేవిషయజ్ఞానము గ
లుగనలసియుండును. ఇఁక శరీరమే యాత్మయందుమేని మనజ్ఞానమం
తయు శరీరమునందే వ్యాప్తమై యుండవలయును. అట్లు లేదు. కావు
న ననుభూతవిషయస్మృతియు, నతీంద్రియపదార్థజ్ఞాతయు, బుద్ధ్యాదుల
కతీతుండు నగువాఁ డొకఁ డావశ్యకముగా నుండితీరవలయును. ఆతఁడే
యంతర్యామి యని వేదవేదాంతములు కీర్తించుచున్నవి. ఆతనియం
దే సకలవస్తువులు నున్నవి. సకలవస్తువులందు నాతఁడు వ్యాపించి యుం
డును. ఆతఁడే యంతర్యామిస్వరూపుఁడు. ఆతఁడే నిత్యుఁడు. కాని యెవ్వ
రు నాతని ప్రత్యక్షస్వరూపునిగా దర్శింపలేరు. చక్షువులచేఁగాని, యిత
రేంద్రియంబులచేఁ గాని యాతఁడు గోచరింపఁడు. ఆమహాత్ముఁడు
కేవలయోగాభ్యాసవిశేషంబగుమనస్సుచేతనే గ్రహింపఁబడును. స్త్రీ
పుంనపుంసక భేదంబు లాతనికి లేవు. దిక్కాలావచ్ఛేదములును, దిగ్విదిక్కు
లును నాతనికి లేవు. లోకేశుం డయ్యు నాతఁడు నశ్వరంబులగు
దేహసమూహములందు నివసించి యుండును. అవ్యయుం డగునాతఁ
డు స్థాణుస్వరూపుఁడు. ధీరులగుమానవులు శ్రవణమననాద్యభ్యాసబ
లంబున నిత్యుఁ డాతని దర్శించుచుందురు. వేయుమాటలేల ? పురు
షుఁడు (ఆత్మ) దేహముకంటె భిన్నుండనియే యెఱుంగవలయును. అ
ది దేహముకంటె నభిన్నం బనితలంచువా రజ్ఞానులు. ఈశరీరము పురు
షుని దని చెప్పుటచేతనే పురుషుఁడు దేహముకంటె భిన్నుఁడుగాఁ దోఁ

చుచున్నారు. మలినంబును, విషయవశీభూతంబును, అనిత్యంబును, దుఃఖమయంబునగునీశరీరము నేమియుఁగానిదానిఁగాఁ దత్త్వజ్ఞులుభావింతురు. విపత్సమూహములకుఁ బుట్టినిల్లయిన యీశరీరము నాశ్రయించినపురుషుఁ డాత్మకర్మవశంబున నొకప్పుడు సుఖియు, నొకప్పుడు దుఃఖియు, నొకప్పుడు మూఢుఁడు నగుచుండును. క్షేత్రము జలప్లావితమై యంకురములఁ బుట్టించునట్లే కర్మమజ్ఞానసంకలితమై దేహముల నుద్భవింపఁజేయును. శరీరము నాశనశీలంబును, నసుఖావాసంబును, రోగభూయిష్ఠంబు నై యుండును. పురుషున కతీతంబులు, ననాగతంబులు నగుదేహములు వేలకొలఁది యుండును. శరీరములన్నియును మరల మరలఁ బుట్టుచు గిట్టుచుండును. కాని యాత్మమాత్ర మెప్పటికి నొక్కటేరీతి నుండును. ఏకాలమునందును, ఎచ్చటను, ఏవిధముగను దానికి శరీరముతోఁ జిరకాలసంబంధ మగపడుట లేదు. గగనతలంబున మేఘంబులచేఁ జంద్రబింబముంబోలి యాత్మయు శరీరంబులచేనప్పుడప్పు డాచ్ఛాదితంబును, విముక్తంబు నగుచుండును. ద్యూతక్రీడయందుముద్రాభేదంబుచేఁ బం దెములు వివిధములుగాఁ దోఁచునట్లే సంసారమునందు దేహభేదంబుచే నాత్మ వివిధవృత్తుల గోచరించుచుండును. ఆత్మ యెవ్వరిదియును గాదు. ఆత్మ కెవ్వరును లేరు. మార్గస్థునకు మార్గమునందుఁ బహువిధప్రజాసమ్మేళనంబువలెనే యాత్మకు దారపుత్రాదిసంబంధం బగుచుండును. నదీజలంబులఁగొట్టుకొనిపోవుకాష్ఠంబులకుంబోలె ప్రాణులకును సంయోగవియోగములు సంభవించుచుండును. శరీరము జడం బని యాత్మయెఱుంగును గాని శరీర మాత్మనెఱుంగుటకు సమర్థంబు గానేరదు. ఈశ్వరుండు దేహాత్మతత్త్వంబుల నెఱింగియుండును గాని దేహాత్మ లాతని గ్రహింపఁజాలవు. బ్రహ్మాదిస్థావరపర్యంతమును గలసకలపదార్థములును బశువు లని చెప్పంబడును.

పాశబద్ధుండును, సుఖదుఃఖభోగియు నగువాఁడే పశువు. ఇట్టిపశుసమూహమే యీశ్వరునకు లీలాసాధనంబని పండితులు వక్కాణింతురు. అజ్ఞుం డగుపశువు తనసుఖదుఃఖవిషయంబులఁ బరాధీనుండై యీశ్వరప్రేరణంబున స్వర్గనరకప్రాప్తుం డగుచుండును.

మునులిట్లు ప్రశ్నించిరి. మహాత్మా! నీచేవర్ణితంబులగునీపశుపాశంబులకు విలక్షణం బగువస్తువేది? పశుపాపవిమోచనంబునకు సమర్థుం డెవ్వఁడు?

—♦ శైవతత్త్వకథనము. ♦—

వాయుదేవుం డిట్లనియెను. మునికులతిలకులారా! అనంతరమణీయగుణాశ్రయుండును, విశ్వనిర్మాతయు, పశుపాశవిమోచకుండును నగు నధీశ్వరుం డొకఁడున్నాఁడు. ఆతఁడు లేకున్నచో జగత్సృష్టియే లేదు. ఏమనిన—పశుపాశంబులలోఁ బశువగుజీవుఁ డజ్ఞుండును, పాశం బగుప్రకృతి యచేతనంబు (జడము) నై యుండెను. ప్రధానప్రకృతియుఁ బరమాణువులుమొదలుగాఁగల స్థూలసూక్ష్మాదిసకలపదార్థములు నచేతనములే యై యున్నవి. బుద్ధిమత్కారణం బగుచైతన్యసంబంధము లేకుండ నవి జగత్కార్యనిర్వహణంబునకు సమర్థములు గాఁజాలవు. జగంబు సావయవంబును, గార్యరూపంబు నగుటంజేసి దీనికిఁ గర్తయొకఁ డావశ్యకముగ నుండితీఱవలయు నని తోఁచుచున్నది. కర్త లేకుండఁ గార్యోత్పత్తి కాఁజాలదుగదా! కావున జగంబంతయు నీశ్వరకార్యమే గాని జీవునికార్యమును, బ్రకృతికార్యమును గానేరదు. జీవునియందు మనకుఁ గానంబడుచుండు సమస్తకర్తృత్వమును గూడ నీశ్వరప్రేరితమైనదియే. అంధుండు నిజగమనంబున కసమర్థుం డగునట్లే జీవుండును స్వకార్యనిర్వహణమున కసమర్థుండై యున్నాఁడు. జీవుండును, దత్ప్రేరకుం డగునీశ్వరుండును బరస్పరభిన్నులని యెఱింగి

యీశ్వరోపాసనంబు గావించువా రీశ్వరప్రసాదమువలన నమృతత్వముం గాంచఁగలరు. సత్త్వముచే బశుపాశంబులకును, దదధీశ్వరునకును గలపరిభేదమును గ్రహించి బ్రహ్మజ్ఞుం డగువాఁడు జన్మమునుండి విముక్తుం డగును. జీవప్రకృతులు రెండును బరస్పరసంయుక్తములై యుండును. విశ్వవిమోచకుం డగుపరమేశ్వరుఁడు వ్యక్తావ్యక్తవస్తువ్యాప్తం బగునీవిశ్వమును భరించి యుండును. జ్ఞాతవ్యం బగువస్తువు భోక్త, భోగ్యము, ప్రేరకుఁడు నని ముత్తెఱంగుల నొప్పారుచుండును. ఇంతకంటె నధికముగాఁ దెలిసికొనఁదగిన దేదియును లేదు. తిలలయందుఁ దైలంబును, దధియందు ఘృతంబును, నదులయందు జలంబును, గాష్ఠంబులయం దగ్నియు నెట్లు వ్యాపించి యుండునో యట్లే తనయందుఁ దనకంటె విలక్షణంబును, సత్యంబు నగునాత్మ యున్నదని యెఱింగినవాఁడు నిత్యానందయుక్తుండై పరమాత్మసాక్షాత్కారముం గాంచఁగలఁడు. ఇంద్రజాలసదృశం బగుమాయతోఁ గూడియున్న పరమేశ్వరుఁడు తనయీశ్వరశక్తిచే సకలలోకములను సృజించి వానికెల్లనీశ్వరుఁడై యుండును. సృష్టికిఁ బూర్వంబున రుద్రుం డొక్కఁడుమాత్రమే యుండెను. ఆతనికంటె ద్వితీయుం డెవ్వఁడును లేఁడు. ఆతఁ డెట్లు విశ్వమును సృష్టించి పాలనంబును, సంకోచంబును గావించుచుండును. ఆతఁడు విశ్వతోముఖుండును, విశ్వవ్యాప్తబాహుపాదనయనుండును విశ్వేశ్వరుండు నై యుండును. ఏకాత్ముం డగునమ్మహేశ్వరుఁడే యాకాశమును, భూమిని సృజించెను. నిఖిలదేవగణంబులకు నాతఁడే యుత్పాదకుఁడు. దేవతలకంటె ముందుగా నాతఁడు హిరణ్యగర్భుని సృజించెను. మహర్షి యగురుద్రుండు విశ్వాధికుం డని వేదములు చెప్పుచున్నవి. ఆదిత్యవర్ణుండును, మహాత్ముండును, అమృతుండును, నిర్వికారుండును, నమాగుణాతీతుండు నగుపరిభు

వును నే నెఱుంగుదును. ఆపరమాత్మునికంటెఁ బరు లెవ్వరును లేరు. ఆతనికంటె నణుస్వరూపులుగాని మహత్స్వరూపులుగాని యెవ్వరును లేరు. ఈజగం బంతయు నాతనితో నిండి యున్నది. ఆతఁడు నిత్యము నేకాకియై వృక్షముంబోలి నిశ్చలభావంబునఁ గేవలము నాకాశస్థితుం డై యుండును. ఈచరాచరప్రపంచ మంతయు నాతనిసంకల్పముచేతనే జనించినది. ఆతనివదనమస్తకగ్రీవంబులు సర్వవ్యాప్తములై యుండును. భగవంతుం డగుశివుండు సర్వవ్యాపియు, సర్వగతుండును, సర్వభూత గుహాశ్రయుండు నై యుండును. ఆతఁడు జగమునందలిసమస్తవస్తువుల నాచ్ఛాదించి యుండును. ఆదేవుండు సకలేంద్రియగుణాభాసుండును, సర్వేంద్రియవివర్జితుండును, సర్వేశ్వరుండును, సర్వశరణ్యుండును, సర్వ సుహృత్స్వరూపుండును నై యుండును. ఆతఁడు కన్నులులేకయే చూడఁగలఁడు. చెవులులేకయే వినఁగలఁడు. సర్వజ్ఞుం డగునాతని నెవ్వ రు నెఱుంగఁజాలరు. ఆతఁడు పరమపురుషుం డని పండితులు నిర్దేశించి యున్నారు. అణువులకంటె నణుస్వరూపుఁడును, మహత్తులకంటె మ హత్స్వరూపుఁడును, అవ్యయుఁడు నగునద్దేవుఁడు జీవులబుద్ధిరూపగుహా శ్రయుండై యుండును. యజ్ఞరహితుం డగునాతని నుద్దేశించియే సకలయజ్ఞములు ననుష్ఠితంబు లగుచుండును. అతిమహిమాన్వితుం డగునాతని నీశ్వరప్రసాదంబున నపగతశోకుం డగువాఁడు సందర్శింపఁ గలఁడు. అజరుండును, పురాణుండును, సర్వాత్మకుండు నగునాప్రభుని నే నెఱుంగుదును. బ్రహ్మవాదు లాతనికి జన్మము లేదని చెప్పుదురు. అమ్మహేశ్వరుం డేకాకి యయ్యును శక్తిసంయోగముచే మాటిమాటి కిని ముందుగా లోకత్రయవిధానంబు గావించి యంతంబున సంహా రము గావించుచుండును. విశ్వవిధాయిని యగునీశ్వరశక్తి యజనామం బునఁ బ్రసిద్ధమై యుండును. దానినే పండితులు ప్రకృతి యని నిర్దే

శించి యున్నారు. ఆప్రకృతి సత్త్వరజస్తమోగుణశక్తిశాలినియై శుక్ల లోహితకృష్ణవర్ణంబులచే విలసిల్లుచుండును. ప్రజాప్రసవిని యగునా ప్రకృతి నజుం డనుసరించి సేవించుచు భోగాంతంబున దానిని ద్యజించుచుండును.

జీవాత్మయుఁ బరమాత్మయు ననురెండుపక్షులు బంధుభావముతోఁ గలసి మానవశరీరం బగువృక్షము నాశ్రయించి యుండును. అందొకటి మధురంబులగుకర్మఫలంబుల భుజియించుచుండును. మఱియొకటి యేమియు భుజింపక యూరక చూచుచుండును. ఆరెంటిలో నొకటియగుజీవవిహంగము సంసారవృక్షనిమగ్నమై, మోహావేశంబునఁ బరితపించుచుండును గాని ప్రసాదయుతుండును, బరమకారణుండును నగుపరమేశ్వరునిమహిమలను దర్శించునప్పుడుమాత్రము సుఖించుచుండును. మాయి యగుపరమేశ్వరుఁడు మాయామూలంబున విశ్వమధ్యమునందుఁ బ్రవేశించి ఛందంబులను, యజ్ఞంబులను, క్రతువులను, భూతభవ్యంబగువిశ్వంబును సృష్టించుచుండును. ప్రకృతి మాయ యనియు, పరమేశ్వరుఁడు మాయి యనియు నెఱుంగునది. ప్రకృత్యవయవంబులచే నీజగంబులన్నియు వ్యాప్తములై యున్నవి. ఈశ్వరుఁడు కలలమధ్యప్రదేశముకంటెను సూక్ష్మాతిసూక్ష్ముఁడై యుండును. పరమేశ్వరుఁడు మంగళమయుం డనియు, విశ్వస్రష్ట యనియు, విశ్వప్రేరకుఁడనియు నెఱింగినవానికి శాంతిలాభంబు గలుగును. విశ్వేశ్వరుండును, రక్షకుండును, కాలస్వరూపుండు నగుప్రభుం డాతఁడొక్కఁడే. ఆవిశ్వేశ్వరస్వరూపజ్ఞానము గలవాఁడు మృత్యుపాశ వినిర్ముక్తుం డగును. సర్వభూతనిగూఢస్థితుండును, సర్వేశ్వరుండు నగుశివునిదివ్యస్వరూపజ్ఞానము లభించినంతనే సర్వపాపవిముక్తి యగును. శివుఁడే ప్రధానదైవంబనియు, విశ్వవిధాత యనియు, మహేశ్వరుఁ డనియు నాతఁడు

తనహృదయస్థితుం డనియు గ్రహించినవాఁ డమృతత్వముం గాంచఁ గలఁడు. దివారాత్రులును, సమస్తసదసద్వస్తుసమూహంబును లేనిసమయంబునఁ గేవలము శివుం డొక్కఁడే విరాజిల్లుచుండెను. ఆతనినుండియే పురాతనం బగుప్రజ్ఞ యుత్పన్నం బయ్యెను. ఊర్ధ్వంబునఁగాని, మధ్యంబునఁగాని, పార్శ్వంబునఁగాని యెవ్వరు నాతని గ్రహింపఁజాలరు. ఆతనితో సమాను లెవ్వరును లేరు. ఆతనిదివ్యనామము మహాద్యశోవిలసితమైనది. జన్మభీరులగువా రయ్యీశ్వరునజుంగా నెఱింగి స్వసంరక్షణార్థమై యీరుద్రునిదక్షిణముఖంబు నాశ్రయింతురు. బ్రహ్మయు, పరుండు ననువారిరువురుమాత్రమే యనంతులు, నక్షరులునని కీర్తింపఁబడుచున్నారు. విద్యావిద్యలు వారియందే యతినిగూఢముగ సన్నిహితంబులై యుండును. అవిద్యాక్షయం బైనచో విద్య యమృతరూపముగాఁ బ్రశంసితం బగును. ఆయిరువురిని దనయధీనమందుంచుకొని పరమేశ్వరుఁడు వారికి భిన్నుఁడై యుండును. ఆతఁడు ప్రత్యేకముగ బహువిధజగంబు లనేకవస్తురూపంబున విస్తరింపఁజేయుటకును, సకలవస్తువులను సృష్టించుటకును, సకలజగంబులను దనయధికారము వ్యాపింపఁజేయుటకును సమర్థుఁడై యుండును. ఆతఁడు నిజతేజముచేఁ గ్రిందను, మీఁదను, పార్శ్వంబులను, సకలదిశలను బ్రకాశింపఁజేయుచుండును. అద్వితీయుండును, వరేణ్యుండును, సర్వకారణుండును, సర్వవస్తుస్వరూపుండు నగునాతఁడు సర్వశబ్దార్థములను, గుణాదులను భోగ్యభోక్తృత్వరూపంబునఁ బరిణమింపఁజేయుచు విద్యవ్యాపియై యుండును. జగంబులకుఁ బూర్వస్థితుండును, బ్రహ్మస్వరూపుండును, బ్రహ్మయోనియు, గుహ్యోపనిషద్విలసితుండు నగునాతని దేవతలును, మహర్షులు నెఱుంగుదురు. అద్దేవుండు భావగ్రాహ్యుండును, నివాసశూన్యుండును, సృష్టిప్రళయకర్తయు, కాలకాలుండు నని యను

భవంబుచే గ్రహింపఁగలమానవుల కీఁక మానవదేహంబు గలుగదు. మూఢులగువా రద్దేవుని స్వభావంబనియు, కాలంబనియుఁ జెప్పుదురు. జగంబుల నన్నిటిని భ్రమింపఁజేయుమహిమ యాతని కున్నది. ఆతఁడు కాలంబునకును గాలస్వరూపుఁడై జగంబు నావరించి యుండును. కర్మమూలంబగునీజగం బాతనిచేఁ బ్రేరితంబై భూతగణంబులతో వివర్తితం బగుచుండును.

ఆతఁడు సత్వగుణసహితుండై కాలాదితత్త్వయోగంబునఁ దఱచుగఁ గర్మారంభంబు సేయుచుండును. మఱియుఁ దఱచుగా నివర్తితుం డగుచుండును. ఆకాశాద్యష్టమూర్తులచేతను, సత్వాదిగుణత్రియంబుచేతను, విద్యావిద్యాద్వయంబుచేతను నేకం బగుకాలంబుచేతను, ఇచ్ఛాదులగునాత్మగుణంబులచేతను నీజగంబంతయు వ్యాప్తంబై యున్నది. ఆతఁడు సత్వాదిగుణంబులచేఁ గర్మారంభంబు చేసి ప్రాణులకుఁ బ్రకృతియోగముం గావించుచుండును. గుణాభావంబునఁ గర్మంబు చేయఁబడుచున్నను దానికి వినాశం బగును. పూర్వకర్మక్షయంబైనచో నాతఁ డట్టిదే మఱియొకకర్మంబునఁ బ్రవృత్తుం డగును. అతఁడే యాదియు, స్వయముగా భోక్తృభోగసంయోగకారణుండు నై యుండును. త్రికాలంబులకుఁ బరుండును, నిర్గుణుండును నగుపరమేశ్వరుని విశ్వయోగియగుభవునిగను, స్తుత్యునిగను, ప్రజాపతియగు దేవదేవునిగను, జగత్పూజ్యునిగను జిత్తంబున భావించి యుపాసింపవలయును. కాలాదులకుఁ బరుం డగునాతనినుండియే సకలజగంబును బరివర్తితం బగుచున్నది. ధర్మావహుండును, పాపహారియు, నైశ్వర్యాధనాథుండు నగునాతఁడే విశ్వాధారుఁడు. ఈశ్వరులలోఁ బరమేశ్వరుండును, దైవంబులలోఁ బరమదైవంబును, పతులలోఁ బర[illegible], సర్వశ్రేష్ఠుండు నగునద్దేవుని భువనేశ్వరేశ్వరునిగా నెఱుంగునది. ఆతని

కెట్టికార్యకారణంబులును లేవు.

ఆతనితో సమానులు గాని, యధికులుగాని యీజగంబునం దెవ్వరును లేరు. బహువిధంబులగు నాతనిదివ్యశక్తి వేదంబులచేఁ బ్రకీర్తితం బైనది. తజ్జ్ఞానక్రియాశక్తులచే నాతఁడు జగన్నిర్మాణంబు గావించెను. ఆతనికంటె నధికులు లేరు. ఆతని కెట్టిచిహ్నంబును లేదు. ఆకాశాదులకుఁ గారణుండును, బ్రభువులకుఁ బ్రభుండు నగునాతని కుత్పాదకు లెవ్వరును లేరు. ఆతఁ డెవ్వరివలనను జనించినవాఁడు గాఁడు. మలమాయాదు లేవియు నాతనికి జన్మకారణంబులు గావు. ఏకాకియగునాతఁడు సర్వతోభావంబుగ సర్వభూతంబులయందును నిగూఢముగ వ్యాపించి యుండును. సకలభూతాంతరాత్ముండును, సకలధర్మాధ్యక్షుండు నగునాతఁడు సర్వభూతాధారుండును, సర్వసాక్షియు నై యుండును. జగద్వ్యాపియు, నిర్గుణుండు నగునాతఁడు వశియు, వివశాత్ములగుయోగిగణంబులకు ముఖ్యుండు నై యుండును. ఆతఁ డేకాకి యయ్యును సమయోచితంబుగా ననేకబీజంబుల సృష్టించుచుండును.

మోక్షార్థులగువారు నిజహృదయస్థితుం డగునాతనిదర్శించి నిత్యసుఖంబులఁ గాంచుచుందురు. ఇతరుల కట్టిభాగ్యంబు లేదు. నిత్యంబులకు నిత్యుండును, చేతనంబులకుఁ జేతనుండు నగునయ్యీశ్వరుండు కేవలనిష్కాముం డయ్యును సర్వకామంబులఁ బ్రసాదించుచుండును. సాంఖ్యయోగాధిగమ్యుండును, గారణస్వరూపుండు నగునాతఁడే జగన్నాథుఁడు. ఆతని నెఱింగినజీవులు సర్వబంధవిముక్తు లగుదురు. విశ్వస్రష్టయు, విశ్వవిదుండును, కర్మజ్ఞుండును, కాలవిచ్ఛేదకారియు, గుణవంతుండును, ప్రకృతిపురుషనియంతయు, గుణాధీశ్వరుండును, బంధమోచకుండు నగునాతఁడు ప్రథమంబున బ్రహ్మనుసృష్టించి స్వయముగా నాతనికి వేదంబుల నుపదేశించెను. ఆత్మ బుద్ధిప్రసాదబలంబున

నేనమ్మహాదేవు నెఱింగి సంసారమునుండి ముక్తింగోరి నిష్కళుండును, నిష్క్రియుండును, శాంతుండును, నిరవద్యుండును, నిరంజనుండు నగు నాతనియాశ్రయముం గాంచితిని. జలంబుల సేతువును, దగ్ధకాష్ఠము ననలంబును నాచ్ఛాదించువిధంబున మానవులు చర్మముంబోలి యాకాశమును బరివేష్టింపఁ గలిగినప్పుడు తపఃప్రభావముచే వారికి శివస్వరూపదర్శనంబు లేకపోయినను దుఃఖవిమోచనము గాఁగలదు. వేదాంతరహస్యంబును, పవిత్రంబును, పాపనాశకంబును, చతుర్థాశ్రమోచితంబును నగుజ్ఞానము పూర్వకాలంబున నుపదిష్టంబైనది. నేను నా భాగ్యగౌరవంబుచే బ్రహ్మముఖమునుండి యీవిజ్ఞానలాభముంబడయఁ గలిగితిని. సర్వశ్రేష్ఠంబగునీజ్ఞానమును బ్రశాంతులకుమాత్రమే యుపదేశింపవలయును. అప్రశాంతులకును, అసద్వృత్తులకును, పుత్రేతరులకును దీనినుపదేశింపరాదు. ఈశ్వరునియందుఁ బరమభక్తులును, గురుని దేవునిగనే భావించువారు నగుశిష్యులకుఁ బండితు లీసకలార్థంబులను బోధింపవలయును. ఈయర్థంబు సంక్షేపించి చెప్పెద నాకర్ణింపుఁడు. ప్రకృతిపురుషులకంటె నీశ్వరుఁడు భిన్నుఁడై యున్నాఁడు. అతఁడు సృష్టికాలంబున సమస్తవస్తువులను సృష్టించును. మఱియు సంహారకాలంబున సర్వంబును సంహరించును.

## —♦ కాలప్రభావము. ♦—

కాలమునందే సకలవస్తువులు నుదయించి యందే విలీనంబు లగుచుండును. కాలనిరపేక్షం బగువస్తు వేదియును లేదు. ఈసమస్తప్రపంచమును గాలాంతర్గతమైనదియే. సృష్టిసంహారముద్రలతోనది చక్రమువలెఁ బరిభ్రమించుచుండును. హరిహరబ్రహ్మాదులును, సురాసురగణంబులునుగూడఁ గాలనియమము నతిక్రమింపఁజాలరు. భూతభవిష్యద్వర్తమానరూపంబులచే నిక్కాలము ప్రమాణములను విభజించి

క్రమముగా జీర్ణింపఁజేయుచుండును. అతిసమర్థంబును, నతిభయంక
రంబు నగుకాలము స్వేచ్ఛగా జరగిపోవుచుండును. పవనదేవా! మహా
త్మా! భగవత్స్వరూపుం డగు నీకాలుం డెవ్వఁడో, యాతఁ డెవ్వరికి
వశీభూతుఁడై యుండునో, యాతనికి వశుండు గానివాఁ డెవ్వఁడైన
నుండెనో యీవిషయంబులను సవిస్తరంబుగాఁ దెలుపవలయు నని
మునులందఱు నేకవాక్యముగాఁ బ్రశ్నించుటయు వాయుదేవుం డిట్లు
నియెను.

కళాకాష్ఠానిమేషాదిరూపసంకలితంబును, బరమేశ్వరతేజంబు నగు
కాలము కాలాత్మ యనునామంబున విఖ్యాతంబై యున్నది. సకల
స్థావరజంగమంబుల కలంఘ్యం బగు నీశ్వరనియోగరూపబలమే విశ్వ
నియామకమైనది. అగ్నియందుండి స్ఫులింగములవలెనే యమ్మహేశ్వరుని
దివ్యశక్తినుండి యొక్కసూక్ష్మాంశముమాత్రము వెలువడి మహాత్ముం
డగుకాలాత్మునియందు సంలగ్నమై యున్నది. అందుచేతనే యీవి
శ్వమంతయుఁ గాలవశం బయ్యెను. కాలుం డెన్నటికిని విశ్వమునకు
వశుండు గానేరఁడు. అప్రతిహతం బగుశివతేజము కాలునియందుఁ
బ్రతిష్ఠితం బగుటం జేసి కాలపరిమాణ మతిమహత్తరమును దురత్య
యంబు నయ్యెను. ప్రజ్ఞావిశేషముచే నెవ్వరును గాలము నతిక్రమిం
పఁజాలరు. కాలకర్మంబులనుండి యెవ్వఁడును దప్పించుకొనఁజాలఁడు.
చతురుదధివేలావలయితం బగుభూచక్రమంతను నేకచ్ఛత్రముగఁ
బరిపాలించుపరాక్రమశాలి యగుసార్వభౌముఁడుగూడఁ గాలము నతి
క్రమింపఁజాలఁడు. సకలేంద్రియంబులను, జగంబునుగూడ వశపఱచు
కొన్నవాఁడైనను గాలమును జయింపఁజాలఁడు. అట్టివారి నందఱను
గాలమే జయింపఁగలుగును. ఆయుర్వేదనిపుణులును, రసాయనానుష్ఠా
నపరులు నగువైద్యులైనను మృత్యువు నతిక్రమింపఁజాలరు. కాలా

తిక్రమణం బసాధ్యమైనది. మానవులు తమతమసంపత్సంకల్పబల
శీలాదులచేఁ గావింపందలంచినకార్యములను గాలము బలవంతముగ
నింకొకరీతిం జేసివైచును. ఎవ్వరును దలఁచుకొనకుండఁగనే కాలము
జీవులకుఁ బ్రియులతోడను, అప్రియులతోడను సంయోగవియోగము
లను గల్పించుచుండును. అందుచేఁ గొందఱికి సుఖంబును, గొందఱికి
దుఃఖంబును గలుగుచుండును. అవిజ్ఞేయస్వభావుం డగుకాలునిశక్తి
యతివిచిత్రమైనది. చూచుచుండఁగనే తరుణుఁడు వృద్ధుఁడుగను, బల
వంతుఁడు బలహీనుఁడుగను, శ్రీమంతుఁడు శ్రీహీనుఁడుగను నగుచుం
డును. ఇట్లే కాల మత్యాశ్చర్యముగా వస్తుపరివర్తనముం గావించు
చుండును. కాలవైపరీత్యంబునఁ గులీనత, సౌశీల్యము, శక్తి, నైపు
ణ్యము మొదలగునవి యేవియును బనిచేయఁజాలవు. అవనీనాథులు
మొదలనాథులవఱకును గలయెల్లవారియందును గాలప్రభావ మొక్క
రీతినే పనిచేయును. అకాలమునం దెంతబాగుగ నుపయోగించినను
రసాయనములచే నౌషధఫలంబు గలుగదు. కాని యుచితసమయము
నఁ బ్రయోగించినచో నట్టిరసాయనములు సఫలములై సుఖప్రదము
లు గాఁగలవు. ఎవ్వరికి నకాలమున జననమరణంబులు గలుగవు.
అకాలమున నెట్టివస్తువును వర్ధిల్లనేరదు. సుఖదుఃఖము లకాలమున సం
భవింపవు. అకాలమునం దెట్టివస్తువు నుత్పన్నంబు గానేరదు. శీతల
వాయుసంచాలనంబును, మేఘవృష్టియు, సస్యోత్పత్తియుఁ గాలవశం
బుననే యగుచుండును. కాలప్రభావముచేతనే జీవులు జీవింతురు.
కాలాత్మతత్త్వము నెఱింగినవిజ్ఞులుమాత్రము నతిక్రమించి కాలాతీతుం
డగుపరమేశ్వరుని దర్శింపఁగలరు. అకాలుండును, అబంధముక్తుండును,
అపురుషుండును, అప్రకృతుండును, అవిశ్వుండును, విచిత్రస్వరూపుం
డును, సర్వశ్రేష్ఠుండును, బరమేశ్వరుండు నగుశివునకు నమస్కారము.

## —♦ బ్రహ్మాద్యాయుఃపరిమాణకథనము. ♦—

వాయుదేవుం డిట్లనియెను. కాలమున కాదిమానము నిమేష ము. శాంత్యతీతకళయే దాని కవధి. కనుఱెప్పపాటుకాలము నిమేషం బనియును, బదునేనునిమిషములు కాష్ఠ యనియు, ముప్పదికాష్ఠలు కళ యనియు, ముప్పదికళలు ముహూర్త మనియు, ముప్పదిముహూ ర్తము లొకదినంబనియు, ముప్పదిదినంబు లొకమాసం బనియు నెఱుం గునది. మాసమునకు శుక్లంబనియుఁ, గృష్ణం బనియు రెండుపక్షము లు గలవు. మానవులయొకమాసము పితృదేవతల కొకదినం బగును. ఆఱుమాసము లొక్కయయనంబును, రెండయనంబు లొకవత్సరంబు నగును. అట్టివత్సరము దేవతల కొకదినం బగును. అందు దక్షిణాయ నము రాత్రియు, నుత్తరాయణము పగలు నని చెప్పుదురు. ఈమాన ముచేతనే దేవతలకు ముప్పదిదినంబులు మాసమును, ద్వాదశమాస ములు వత్సరంబు నగును.మానవులమూఁడువందలయఱువదివర్షములు దేవతల కొకవర్షంబగును. దేవమానముచేతనే యుగసంఖ్యాగణనంబు చేయవలయును. భారతవర్షంబునఁ జతుర్యుగంబులు వ్యవహృతంబు లగుచున్నవి. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలి యుగము నని నాలుగుయుగములు. దేవమానముచేఁ గృతయుగపరి మాణము చతుస్సహస్రవర్షములు. దానిసంధియు సంధ్యంశమును గూడఁ జతుశ్శతవర్షపరిమాణంబు గలిగియుండును. అవశిష్టంబు లగు మూఁడుయుగంబులును క్రమంబుగా నొకదానికంటెనొకటి వేయివర్షం బులు తక్కువగా నుండును. వానిసంధులును, సంధ్యంశలునుగూడఁ బరిమాణంబులం దట్లే యుండును. సహస్రచతుర్యుగంబు లొకకల్పం బగును. డెబ్బదియొక్కచతుర్యుగంబు లొకమన్వంతరంబు. ఒకకల్పం బునందుఁ జతుర్దశమన్వంతరంబులు గడచును. ఈవిధముగా శతశతం

బులును, సహస్రసహస్రంబులు నగుకల్పాంతరములు గడచిపోయినవి. అవి యన్నియు నజ్ఞేయములు, నసంఖ్యేయములు నగుటంజేసి వానిం గూర్చి తెలుపుట సాధ్యంబు గాదు. ఒకకల్ప మవ్యక్తం డగుబ్రహ్మ కొకపగలగును. సహస్రకల్పంబులు బ్రహ్మకొకవత్సరము. ఈరీతిగా నెనిమిదివేలవర్షంబులు బ్రహ్మకొకయుగంబును, అట్టిసహస్రయుగంబు లొకసవనంబును, అట్టిసవనంబులు త్రిసహస్రంబు లైనసొకత్రివృతంబు నగును. అదియే బ్రహ్మకు జీవితకాలము. బ్రహ్మ కొకదినంబగు లోపలఁ బదునాలుగురింద్రులును, మాసం బగులోపల నాలుగువందల యిరువదిమందిపురందరులును, సంవత్సరంబగులోపల నైదువేలనలువదిమందిశతమఖులును నిపతితు లగుదురు. బ్రహ్మజీవితకాలములోపల నైదులక్షలనలువదివేలకంటె నధికసంఖ్యలగునింద్రులు విలయంబు నందుదురు. విష్ణుదేవునికిఁ బ్రతిదినంబునందు నొకనూతనబ్రహ్మ యుదయించుచుండును. అట్లే రుద్రునియొక్కొక్కదినంబున కొక్కొక్కవిష్ణుం డుదయించుచుండును. మఱియు నీశ్వరునిదినదినంబునకు నొకనూతనరుద్రోదయ మగుచుండును. ఇట్లే సదాశివునకుఁ బ్రతిదినంబు నొకయీశ్వరవిలయంబగుచుండును. అట్టిసదాశివుఁడుగూడ సాక్షాచ్ఛివునియేకదినమాత్రస్థాయియే. సాక్షాచ్ఛివునిజీవితకాలంబున నైదులక్షలనలువదివేలమందిసదాశివులు విలయంబు నందుదురు. సాక్షాచ్ఛివప్రేరణముచేతనే కాలాత్ముఁడు ప్రవర్తించుచుండును. బ్రహ్మయొక్క సృష్టికొకకాలాంతర మగును. అట్టికాలాంతరము పరమేశ్వరున కొకదివంబును, నంతియకాలము రాత్రియు నగును. ఆతనిదివాభాగంబు సృష్టియు, రాత్రిభాగంబు ప్రళయంబు నగుచున్నది. కేవలలోకసంగ్రహార్థమై యీవిధముగాఁ గాలకల్పనంబు సేయుటయే గాని నిజముగా నాతనికి దినరాత్రిప్రభృతికాలంబు లేవియును లేవు. సకలజీవులు

ను, ప్రజాపతులును, సకలమూర్తులును, సకలదేవదానవులును, సకలేంద్రియంబులును, ఇంద్రియభోగ్యవస్తువులును, పంచభూతములును, తన్మాత్రలును, భూతాదులును, బుద్ధియు, సకలదేవతలునుగూడ నా పరమేశ్వరునిదివాభాగంబునఁ బ్రవర్తిల్లుచు నాతనిరాత్రిభాగంబున విలయంబు గాంచుచుందురు. రాత్రి గడచినతోడనే మరల దివాభాగంబున విశ్వసృష్టి యగుచుండును. ఎవ్వఁడు విశ్వాత్ముఁడో, యెవ్వని దివ్యశక్తి కర్మకాలస్వభావాదుల కలంఘ్యమైనదో, సకలజగంబు నెవ్వనియాజ్ఞాధీనమై యుండునో యట్టిమహాత్ముం డగుశంకరునకు నమస్కారము.

## శక్త్యాద్యుత్పత్తికథనము.

మును లిట్లు ప్రశ్నించిరి. మహాత్మా! పరమేశ్వరుం డీవిశ్వమునంతను దనయాజ్ఞచే నెట్లు సృష్టించి ప్రతిష్ఠించి పరమం బగులీలాఖేలనముం గావించుచున్నాఁడు? అందు ప్రథమంబున సంభవించిన దేది? క్రమముగా నీయఖిలజగంబు నెట్లు విస్తీర్ణంబయ్యెను? మరల నేది తనవిశాలకుక్షియం దీసమస్తమును గ్రసించుచున్నది?

వాయుదేవుం డిట్లనియెను. మహర్షిశేఖరులారా! శాంత్యతీతపదాలంకృత యగుశక్తియే పరమేశ్వరునుండి మొట్టమొదట నుదయించెను. దానినుండి మాయయు, మాయనుండి యవ్యక్తంబు నుదయించెను. మఱియు శక్తినుండి శాంత్యతీతపదంబును, దానినుండి క్రముగ శాంతిపదంబును, దానినుండి విద్యాపదంబును, దానినుండి ప్రతిష్ఠాపదంబును, దానినుండి నివృత్తిపదంబును గలిగెను. ఈశ్వరసృష్టిం గాంచి యిట్లు సంక్షేపముగాఁ జెప్పితిని. ఏక్రమముగా సృష్టియయ్యెనో దానికిఁ బ్రతిలోమక్రమంబుగా సంహారం బగుచుండును. ఈపంచపదోద్దిష్టం బగుసృష్టికంటె నితరసృష్టి యేదియును లేదు. వానిపం

చకళలచేతనే జగమంతయు వ్యాప్తంబై యున్నది. కారణం బగునవ్య
క్త మాత్మచే నధిష్ఠితమైయుండి మహదాదివిశేషాంతం బగుసమస్తము
ను సృష్టించుచుండుననుట సర్వసమ్మతసిద్ధాంతమే. కాని యవ్యక్తం
బచేతనం బగుటచేతను, బురుషుం డజ్ఞుం డగుటచేతను వారిరువురకు
ను సృష్టివిషయంబునం గర్తృత్వంబు లేదు. ప్రధానపరమాణ్వాదులు
సమస్తము నచేతనంబు లగుటంజేసి బుద్ధిమత్కారణం బగునొకవస్తుసా
హాయ్యములేకుండ నవి స్వయముగా నేమియుం జేయఁజాలవు. ఈజగం
బంతయు సావయవం బగుకార్యరూపంబునం దోఁచుచుండుటంజేసి దీని
కిఁ గర్తయొకఁ డుండితీరవలయు నని యంగీకరింపవలసి యున్నది. కా
వున సమర్థుండును, స్వతంత్రుండును, సర్వశక్తిమంతుండును, సర్వవి
దుండును, ఆదిమధ్యాంతరహితుండును, మహదైశ్వర్యసంపన్నుండును,
మహాదేవుండు నగుమహేశ్వరుం డొకఁడు సకలజగత్కర్తయై యుండె
నని గ్రహింపవలయును.

ఆసత్యవ్రతునిశాసనముచేతనే ప్రధానమునకుఁ (ప్రకృతి) బరి
ణామంబును, బురుషునకుఁ బ్రవృత్తియుఁ గలుగుచుండు నని పెద్దలు
చెప్పుదురు. మూఢు లగువా రీవిషయమును విశ్వసింపఁజాలరు.
సృష్ట్యారంభమునుండి ప్రళయపర్యంతమును గలకాలము బ్రహ్మకు
శతవర్షాయుష్కాలంబని చెప్పంబడియెను. ఆకాలమునకుఁ బరంబని
యు, దానియందర్ధభాగంబునకుఁ బరార్థంబనియు నామంబులు. పదార్థ
ద్వయంబు గడచినచో మహాప్రళయం బగును. మహాప్రళయసమ
యంబునందవ్యక్తము వికారోపసంహారంబు గావించుకొని యాత్మయం
దు విలీనమై యుండును. అప్పుడు తమస్సత్వంబులు సమత్వంబుచే
నొప్పుచుండును. ప్రకృతిపురుషులు సమానధర్మముతో నుందురు.
తమస్సత్వగుణంబుల కప్పుడు భిన్నభావమును, న్యూనాధికభావమును

లేకుండుటచే నవి పరస్పరము నోతప్రోతభావంబున విలసిల్లుచుండును.
ఈయుభయగుణంబులును సమత్వముం గాంచుటచే నెట్టివస్తువిభాగ
మునులేక సర్వము నంధకారమయమై యుండును. ఇట్లు జగంబంతయు
ప్రళయావస్థయందుండఁగాఁ బూర్వోక్తంబగుమహేశ్వరునిరాత్రి గడచి
పోవుచుండును. అట్లు గడచి మరల దినంబైనంతనే ప్రకృతి పురుషుని
యందుఁ బ్రవేశించి మాయాయోగంబునఁ బ్రచలితంబగుచుండును.
అనంతరము పరమేశ్వరాజ్ఞచే నవ్యక్తమునుండి మరల నుత్పత్తివిలయం
బులకై సకలభూతంబులును సృష్టింపంబడును. ఎవ్వనియిచ్ఛానుసారము
గా నుత్తరోత్తరవిచిత్రం బగువిశ్వముత్పన్నంబగుచుండునో, యెవ్వని
శక్త్యయందలియేకాంశముచేతనే సమస్తమును నిశ్శేషం బగుచుండునో,
అధ్వవిదులగువా రెవ్వని సమస్తధనియామకునిగాఁ బ్రశంసించుచుం
దురో యట్టిసకలలోకవిలక్షణుం డగుపరమాత్మునకు నమస్కారము.

## లోకోత్పత్తివర్ణనము.

వాయుదేవుఁ డిట్లనియెను. పూర్వము పురుషాధిష్ఠితం బగు
నవ్యక్తమునుండి క్రమముగా బుద్ధిమొదలుగవిశేషాంతంబువఱకునుగల
వికారము లన్నియు నుదయించెను. అనంతర మావికృతులనుండి
రుద్రుండును, విష్ణుండును, బ్రహ్మయునను దేవతలు జగత్కారణరూపు
లై యుదయించిరి. వారిశక్తి యెల్లయెడల నకుంఠితమై సర్వవ్యాప్త
మయ్యెను. వారివిజ్ఞానమును, అణిమాద్యైశ్వర్యములును నప్రతిమాన
ములైనవి. పరమేశ్వరుఁ డీబ్రహ్మవిష్ణురుద్రుల సృష్టిస్థితిలయకార్య
ములయందు హేతుత్వముం గాంచి ప్రభుత్వముతోఁ బ్రసన్నుఁడై
యుండును. కల్పాంతరమునందు మహేశ్వరుఁడు వారికే మరల సృష్టిస్థి
తిలయకార్యములను బ్రత్యేకముగ విభాగించి యొసంగును. వీరు పర
స్పరోత్పన్నులై, పరస్పరాధారులై, పరస్పరానుగమనంబు గావించుచుఁ

బరస్పరసాహాయ్యముచే బుద్ధిప్రాప్తు లగుచుందురు. ఒకచో బ్రహ్మ
యు మఱియొకచో విష్ణుండును, నింకొకచో రుద్రుండును బ్రశంసితు
లగుచుందురు. ఇంతమాత్రముచే వారొకరికంటె నొకరధికులుగాని,
యతిరిక్తులుగాని కారు. వీరిలో నొక్కని నధికునిగను, నితరుల నల్పు
లుగను భావించువారు పిశాచములు రాక్షసులునై జన్మింతురు.

గుణత్రయాతీతుం డగుమహేశ్వరుఁడు బ్రహ్మకాలవిష్ణురుద్రు
లనుచతుర్వ్యూహంబుగా విభక్తుండై, సర్వాత్మకుండును, సర్వాధారుం
డును, శక్తిసంభవకారణుండు నై యుండును. ఆతం డీశ్వరస్వరూపుఁడై
యుండి రుద్రాద్యాత్మమూర్తిత్రయంబునకును, బ్రకృతిపురుషులకును
క్రీడార్థమై జగత్సృష్టి గావించుచుండును. సర్వశ్రేష్ఠుండును, నిష్క-
లుండును నగుపరమేశ్వరుఁడు సకలవస్తువుల కాధారుండును, సకలవస్తు
వులయం దాత్మరూపముచే నధిష్ఠితుండు నై యుండును. కావుననే
మహేశ్వరుఁడును, ప్రకృతియుఁ, బురుషుండును, సదాశివుండును,
భవుండును, విష్ణుండును సకలంబును సదాశివాత్మకమని చెప్పంబడును.

ప్రధానమునుండి మొట్టమొదట బుద్ధి యుదయించెను. అది
మహత్తు, మఱియనునామంబులచేఁ బ్రసిద్ధమై యుండును. ఆమహ
త్సంక్షోభంబుచేఁ ద్రివిధంబులుగ నహంకారం బుత్పన్నం బయ్యెను.
అహంకారమునుండి పంచభూతములును, బంచతన్మాత్రలును, బంచేం
ద్రియంబులును బుట్టెను. సత్వాహంకారమునుండి సాత్వికవస్తువు లుద
యించెను. ఈవైకారిక, సాత్వికసర్గంబు లొక్క సమయమునందే ప్ర
వృత్తంబు లగుచుండును. సాత్వికాహంకారమునుండి జ్ఞానేంద్రియపం
చకంబును, గర్మేంద్రియపంచకంబును బుట్టెను. మనం బేకాదశేంద్రి
యము. అది యాత్మగుణానుసారంబుగాఁ గర్మజ్ఞానేంద్రియాత్మకమై
యుండును. తామసాహంకారమునుండి భూతములును, దన్మాత్రలు

నుదయించెను. ఇది భూతంబుల కాది యగుటచే దీనికి భూతాది య
నునామంబు గలిగెను. ఈభూతాదినుండి శబ్దతన్మాత్రయు, దానినుండి
యాకాశంబును, గగనమునుండి స్పర్శయు, దానినుండి వాయువును,
వాయువునుండి రూపంబును, దానినుండి తేజంబును, తేజమునుండి
రసంబును, దానినుండి యుదకంబును, జలమునుండి గంధంబును, దాని
నుండి పృథ్వియు నుద్భూతంబు లయ్యెను. అనంతరము పంచభూతం
బులనుండియుఁ జరాచరసృష్టి యయ్యెను.

పురుషాధిష్ఠానమువలనను, అవ్యక్తానుగ్రహమువలనను మహ
దాదివిశేషాంతంబును గలసృష్టిపదార్థము లన్నియు నొకయండము ను
ద్భవింపఁజేసెను. బ్రహ్మకుఁ గార్యకారణసంసిద్ధి లభించినప్పు డాయం
డమునందు బ్రహ్మసంజ్ఞుం డగుక్షేత్రజ్ఞుండు ప్రవృద్ధుం డయ్యెను. ప్రథ
మశరీరి యగునాతనినే పురుషుఁడందురు. ఆబ్రహ్మయే సకలభూతంబు
లకు నాదికర్త. అభిమానియగునాతనినుండి యప్రతిమానంబును,
జ్ఞానవైరాగ్యలక్షణయుక్తంబును, ధర్మైశ్వర్యకరంబును, బ్రాహ్మీనామ
కంబు నగుబుద్ధి యుత్పన్నం బయ్యెను. బ్రహ్మదేవుండు తనమనంబున
సంకల్పించినయెల్లవస్తువులునుగూడ నవ్యక్తమునుండి యుదయించెను.
ఆతఁడు స్వభావవశీకృతుండును, త్రిగుణపరాపేక్షుండునగుటచేఁ ద్రిలో
కమధ్యంబునఁ దన్నుఁదాను త్రిభాగములుగా విభజించుకొని యొక
రూపముతో సృష్టియు, నొకరూపముతో సంహారమును, నొకరూపము
తోఁ బాలనమును గావించుచుండును.

స్వయంభూతుం డగునాతఁడు బ్రహ్మత్వమునందుఁ జతుర్ము
ఖుండును, గాలత్వమునం దంతకుండును, బరిపాలనవిషయంబున సహ
స్రశీర్షుండునై మూఁడవస్థలచే విరాజిల్లుచుండును. ఆప్రభునకు సృష్టి
కార్యంబునందు సత్త్వరజోగుణంబులును, సంహారకార్యమునందుఁ ద

మోగుణంబును, సంరక్షణకార్యమునందుఁ గేవలసత్వగుణంబును నీవిధ ముగా ముత్తెఱంగుల గుణవృద్ధి యగుచుండును. ఆతనిబ్రహ్మత్వము నందు లోకసృష్టియు, కాలత్వమునందు లోకసంహారము నగుచుండు ను. పురుషత్వమునం దాతఁడుదాసీనుఁడై యుండును. ఇట్లాతనికర్మం బు త్రివిధంబై యున్నది. ఇట్లాతఁడు త్రివిధంబుల విభక్తుం డైనప్పుడు త్రిగుణుం డనియుఁ జతుర్విధంబుల విభక్తుం డైనప్పుడు చతుర్వ్యూ హుం డనియుఁ బ్రశంసితుం డగుచుండును. సకలంబునకు నాది యగు టచే నాదిదేవుం డనియు, జన్మము లేకుండుటచే నజుం డనియు నాతఁ డు కీర్తింపఁబడుచుండును. సమస్తప్రజలను బరిపాలించుటచే నాతని కిఁ బ్రజాపతి యనునామము గలిగెను.

అమ్మహాత్ముం డగుబ్రహ్మకు హిరణ్మయం బగుమేరువు గర్భా శయంబును, సముద్రంబు లన్నియు గర్భోదకంబులును, సకలపర్వతం బులును జరాయువు లై యుండును. ఆబ్రహ్మాండమధ్యంబునందు సక లలోకంబులును, సమస్తజగంబును, గ్రహనక్షత్రసహితులగుసూర్య చంద్రులును, వాయువును నివసించి యుందురు. అయ్యండోపరిభాగ ము దశగుణాధికజలంబుచేతను, ఆజలోపరిభాగము దశగుణాధికతేజము చేతను, ఆతేజోపరిభాగము దశగుణాధికవాయువుచేతను, అయ్యనిలోపరి భాగము దశగుణాధికాకాశముచేతను, అయ్యాకాశము పూర్వోక్తభూ తాదులచేతను, ఆభూతాదులు మహత్తత్వముచేతను, ఆమహత్తత్వ మవ్యక్తము (ప్రకృతి) చేతను నావృతంబులై యుండును. ఈవిధము గా బ్రహ్మాండము సప్తప్రాకృతావరణములచే నావృతమై యుండును. అయ్యండమును బరస్పరావృతంబు లగునష్టప్రకృతులు నావరించి యుండును.

వికారము (కార్యము) లన్నియు, వికారుల (కారణములు) యం

దాధారాధేయభావముతో నుండును. కూర్మము తనసకలాంగకముల
ను వ్యాకోచములుగను, సంకోచములుగను జేసికొనుచుండునట్లే, య
వ్యక్తము తనసకలకార్యములను విస్తరింపఁజేయుచుఁ దనయందే విలీన
ములుగాఁ జేసికొనుచుండును. అవ్యక్తప్రభవంబులగుసకలవస్తువులు
ననులోమక్రమంబున నుదయించి ప్రళయకాలంబునందుఁ బ్రతిలోమ
క్రమంబున విలీనంబులగుచుండును. త్రిగుణంబులును గాలవశంబున
సమంబులును, విషమంబులునై యుండును. వానిసమభావమునందే
లయంబును, వానివిషమభావమునందే సృష్టియు నగుచుండును.

బ్రహ్మాద్యవస్థానం బగునీబ్రహ్మాండము మహత్తత్త్వమైనది.
అది బ్రహ్మకు క్షేత్రంబగుటచే నాతనికి క్షేత్రజ్ఞుండనునామము గలిగె
ను. ఇట్టివి సహస్రకోటిబ్రహ్మాండములు గలవు. ప్రకృతి సర్వగతం
బగుటంజేసి యవియన్నియుఁ దిర్యగూర్ధ్వాధోభాగస్థితంబులై యుండు
ను. ప్రత్యండమునందును బ్రత్యేకముగ బ్రహ్మవిష్ణురుద్రులు నివసిం
చియుందురు. మహేశ్వరుఁడు ప్రకృతికిఁ బరుండై యుండును. బ్ర
హ్మాండము ప్రకృతిసంభూతమైనది. ఆయండమునుండి పరమైశ్వర్యశా
లియగు బ్రహ్మ యుదయించి సకలలోకంబులను సృజించెను. ఈప్రా
కృతసృష్టి కంతకును నజ్ఞానరూపం బగునవిద్యయే కారణము. పరిణా
మమునం దిది యంతయు నొక్కసారియే విలయంబు నొందును. ఇది
పరమేశ్వరుని కొక లీలామాత్రము.

అజ్ఞేయంబును, వ్యాపకంబు నగుప్రధానమే యీజగంబునకుఁ
గారణము. అన్యంబు లగుసకలకారణంబులును దానినుండియే సంభవిం
చెను. అది యాదిమధ్యాంతరహితంబును, అనంతవీర్యసంపన్నంబును,
సత్వరజోగుణాన్వితంబును, పురుషసంయుతంబు నై యుండును. ఈప్ర
ధాన ముత్పాదనక్షమంబును, అతిరిక్తరజస్సంయుక్తంబు నగుటంజేసి

యిది మొట్టమొదట లోకవిస్తారవృద్ధి హేతుభూతంబు లగునష్టవికార ములను సృజియించెను. అంతకాలంబున మరల నిదియే వీని నన్నిటి ని గ్రసించుచుండును. అప్రాకృతుండును, బరమైశ్వర్యశాలియు నగు మహేశ్వరునియిచ్ఛామాత్రముచేతనే ప్రళయకాలమునందు సకలకా రణంబులును బ్రకృతియందు విలీనంబు లగుటయు, సృష్టికాలంబున మరల నవి యన్నియుఁబ్రవృత్తంబులగుటయు సంభవించుచుండును.

## —♦ పృథ్వీమండలోద్ధారణము. ♦—

వాయుదేవుం డిట్లు చెప్పందొడంగెను. బ్రహ్మదేవునిజీవితకాల మునందలి పూర్వోత్తరభాగంబులు పరార్థపరిమితంబులై యుండును. ఆయుభయపరార్థంబులయందును సృష్టియు, సంహారము నగుచుండు ను. సకలంబున కాదియగు నాబ్రహ్మదేవుని యొక్కొక్కదినంబునకుఁ బదునలుగురు మనువులు పరివర్తితు లగుచుందురు. అనాదులును, అనంతములును, అవిజ్ఞేయములు నగుటంజేసి, సమస్తమన్వంతరములం గూర్చియు, సకలకల్పములంగూర్చియుఁ బ్రత్యేకముగ వర్ణించి చెప్పు ట యశక్యము. అట్లు ప్రత్యేకించి యభివర్ణించుటవలనఁగూడ విశేష ప్రయోజనం బేమియును లేదు. కావున నేనిప్పు డట్లు వర్ణింపఁదలఁచు కొనలేదు. సకలకల్పమధ్యంబునను నిప్పుడు జరగుచున్నకల్పమునందుఁ గూడ ననేకములగు సృష్టిప్రళయములు జరగుచునే యున్నవి. వర్త మానం బగునిది వారాహకల్పంబు. ఈకల్పమునందును జతుర్దశమ న్వంతరములు గలవు. స్వాయంభువాదు లగునేడ్వురును, సావర్ణికాదు లగునేడ్వురును గలసి చతుర్దశమనువులు. అందు వైవస్వతుం డనుసప్త మమనువు, వర్తమానకాలంబున కధీశ్వరుఁడు. సకలమన్వంతరముల యందును, సృష్టిసంహారము లొక్కరీతిగనే యుండు నని బుద్ధిమంతు లగువా రూహింపుకొనవలయును.

పూర్వకల్పాంతంబునఁ బ్రళయప్రభంజనాహతింజేసి సకలవనంబు లున్మూలితంబులగుచుండఁ, బ్రళయానలజ్వాలలచే సకలజగంబును తృణసమూహంబుంబోలి దగ్ధంబై పోవుచుండఁ, బ్రళయధారాధరంబు లెడతెగకుండ వర్షించుచుండ, సకలార్ణవంబులు నుద్వేలంబులై యతిదారుణంబుగఁ బొంగిపొరలుచుండ మహాత్తరం బగుజలంబుచే సకలదిశలును నిమగ్నములై పోయెను. అప్పు డాప్రళయసమూహము చటులోత్తుంగతరంగభుజమండలవిక్షేపంబు గావించుచు, భయంకర తాండవము సేయుచుండ నారాయణుండును, బ్రహ్మయు నభిన్నులై యాసలిలోపరిభాగంబున సుఖనిద్రం గాంచుచుండిరి. బ్రహ్మదేవుం డప్పుడు నారాయణు నుద్దేశించి "జలము నరప్రభవం బగుటచే దానికి నారం బనుపేరు గలిగెను. ఆనరుసకుఁ బ్రళయకాలమునం దానారమే విశ్రామస్థాన మయ్యెను గావున నాతనికి నారాయణుం డగునామము గలిగెను." అను నర్థమిచ్చుశ్లోకమును బఠించెను.

అట్లు శివయోగమయం బగునిద్రయందు నిమగ్నుండై త్రిదశేశ్వరుం డగునారాయణుం డున్నసమంబున సిద్ధులును, జనలోకనివాసులగు దేవగణంబులును నాతని మేల్కొల్పుటకై ప్రభాతస్తోత్రపాఠములఁ గావించుచుండిరి. అనంతరము భగవానుం డగునారాయణుండు ప్రబుద్ధుండై జలశయనంబునుండి లేచి యోగనిద్రాలసంబులగుకటాక్షంబులచే సకలదిశలను బరికించెను. అప్పు డాతనికిఁ దనకంటె నన్యం బేమియును గోచరింపలేదు. అందుచే నాతఁ డతివిస్మయంబునఁ గూర్చుండి చింతానిమగ్నుం డయ్యెను. మహామహీధరనదీనగరకాననాదినానావిధవస్తుపరిశోభితయు, మనోహారిణియు, భగవతియు నగుపృథ్వి యెటనున్న దని బ్రహ్మదేవుండు తనమనంబునఁ జింతించుచు భూస్థితిని గ్రహింపఁజాలక తనతండ్రి యగుత్రిలోచనుని స్మరించుకొనియె

ను. మహాదేవస్మరణమాత్రంబున నాతనికి భూదేవి సలిలనిమగ్నమై యున్నట్లు బోధపడియెను. అప్పుడు ధరణీపతి యగుప్రజాపతి పృథ్వి నుద్ధరించునుద్దేశముతో జలవిహారసమర్థంబగు దివ్యవరాహరూపమును స్మరించుకొనియెను.

ఆవరాహము శైలసన్నిభవిగ్రహంబుతోడను, మహామేఘనిస్వనంబుతోడను, నీలమేఘమువంటి కాంతితోడను, భయంకరాకారముతోడను, దారుణంబగుఘుర్ఘురధ్వానముతోడను, పీనవర్తులస్కంధంబులతోడను, పీనోన్నతకటిమండలముతోడను, హ్రస్వంబులును, వృత్తంబులు నగునూరుజంఘాగ్రములతోడను, సుతీక్ష్ణంబులగుఖురంబులతోడను, పద్మరాగమణులంబోని వర్తులంబులగు భీషణేక్షణంబులతోడను, వర్తులంబును, దీర్ఘంబునగుదేహముతోడను, స్తబ్ధంబులును, దీర్ఘంబులు నగుకర్ణంబులతోడను, ప్రళయార్ణము ఘూర్ణిల్లఁజేయుచున్నశ్వాసప్రశ్వాసంబులతోడను, గండభాగంబులఁ బ్రకాశించుచున్నజటాపటలంబుచే నాచ్ఛన్నంబులైన స్కంధప్రదేశములతోడను విరాజిల్లుచు విచిత్రమణిభూషణాలంకృతమై విద్యుద్విరాజితంబగుఘనాఘనముంబోలి శోభిల్లుచుండెను.

బ్రహ్మదేవుం డిట్లతిబలిష్ఠం బగువరాహమూర్తిం దాల్చి భూతలోద్ధరణార్థమై రసాతలంబునఁ బ్రవేశించెను. మహాశైలసన్నిభంబగు మహాకాయముం దాల్చి యున్నయావరాహమూర్తి శివలింగపాదపీఠముంబోలి విలసిల్లుచుండెను. అనంతర మాపృథ్వీధరం బగువరాహము ప్రళయజలధినిమగ్నం బగుధరామండలమును దనదంష్ట్రాగ్రంబులచే రసాతలమునుండి యుద్ధరించెను. అట్లు గావించిన వరాహమూర్తిం గాంచినంతనే జనలోకనివాసులగుసిద్ధమునిగణంబులు పరమానందముతో నృత్యంబులు సేయుచు నాతనియుత్తమాంగమునందుఁ బుష్పవృ

ష్టిం గురియించిరి. అప్పు డామహావరాహమూర్తి శరీరంబంతయుఁ బుష్పమాలికలచే నలంకృతమై, ఖద్యోతమాలికాశోభితంబగుసమున్న తనీలమహీధరముంబోలి శోభాసంపన్నం బయ్యెను.

అనంతర మవ్వరాహమూర్తి యతివిశాలంబగునీభూమండల ము నెప్పటియట్ల స్థాపించి మరల నిజస్వరూపముం దాల్చి దానిని సమ తలంబున నెలకొల్పి పర్వతంబులను యథాస్థానంబులఁ బ్రతిష్ఠించి పూర్వమువలెనే మరల భూమ్యాదిచతుర్లోకంబులను సృష్టించెను. విశ్వకర్మయగువిధాత యీవిధముగాఁ బర్వతసహితంబుగా భూమం డలమును బ్రళయార్ణవమునుండి యుద్ధరించి మరలఁ జరాచరాత్మకం బగుజగంబంతయును సృష్టించెను.

## —♦ సృష్టినిరూపణము. ♦—

బ్రహ్మదేవుండు బుద్ధిపూర్వకంబుగ సర్గచింతానిమగ్నుండై యున్నసమయంబునఁ దమోమయం బగుమోహం బుత్పన్న మయ్యెను. అప్పు డమ్మహాత్మునకుఁ దమోమోహము, మహామోహము, తామి స్రము, అంధతామిస్రము, అవిద్యయు సంభవించెను. ధ్యానపరాయ ణుండును, అభిమానియు నగుబ్రహ్మదేవునిచేఁ గావింపంబడుచున్నపం చవిధంబులగుసృష్టియు నప్పుడు బీజసమూహముచేఁ గుంభంబునుంబో లి యంతటను దమోగుణంబుచే నావృతంబయ్యెను. అది బహిరం తస్తేజోవిహీనంబును, స్తబ్ధంబును, నిస్సంజ్ఞంబు నై యుండెను. ఆవ స్తువుల కన్నిటికిని బుద్ధియు, ముఖ్యేంద్రియంబులునుగూడ సమాచ్ఛ న్నంబు లై పోవుటచే నవి నగంబు లయ్యెను. ఇట్లు ప్రథమసృష్టియం తయు ననాధకం బగుటం గాంచి బ్రహ్మదేవుండప్రసన్నహృదయుండై ద్వితీయసృష్టిని సంకల్పించెను. ఆతనిసంకల్పమువలన నప్పుడు తిర్య క్స్రోతంబగుసర్గం బయ్యెను. అది యంతఃప్రకాశకంబును, బహిరావృ

త్తంబు నగుటంజేసి యందలివస్తువు లన్నియును కుటిలగమనయుతంబులును, స్వభావముచే ననన్మార్గంబులును బహుస్వరూపములు నయ్యెను. ఆసృష్టియుఁ దనయభిప్రాయసాధనంబున కసమర్థం బగుటచే బ్రహ్మదేవుండు మఱియొకసృష్టిని సంకల్పించెను. అందువలన సత్వగుణప్రధానం బగు దేవసృష్టి యయ్యెను. అందలిజీవులు బహిరంతరములయందృష్టియావరణంబును లేక విశేషముగ సుఖప్రీతియుక్తులై యుండిరి. వారుప్రకాశమయులును, బ్రకాశమయస్వభావులు నగుటచే దేవనామంబునఁ బ్రసిద్ధులైరి. ఇంతమాత్రంబున విధాత సంతుష్టుండు గాక మరల ధ్యానపరాయణుం డయ్యెను. అందువలన నాతనియభిమతార్థసాధకంబును, దుఃఖబహుళంబు నగుప్రజాసర్గం బయ్యెను. అందలిజీవులు బహిష్ప్రకాశశీలురును, అంతస్తమోమయులును, రజోగుణప్రధానులు నై యుండిరి.

పంచమం బగుననుగ్రహసర్గము చతుర్విధంబులఁ బరగుచుండును. విపర్యము, శక్తి, తుష్టి, సిద్ధి యలునాల్గింటిచేతను నాల్గువిధంబులుగా నాసృష్టియయ్యెను. అందుఁజేరనివారందఱును స్త్రీధనాదులయందాసక్తులై యుందురు. వారు కేవలమును భక్షణాదులయం దాసక్తులును, భూతప్రేతపిశాచాదినామంబులచేఁ బ్రసిద్ధులు నై యుందురు. పరమేష్ఠి యగుబ్రహ్మ మొదట మహత్సృష్టిని, దదనంతరము తన్మాత్రసృష్టినిగావించెను. అదియే భూతసర్గము. తృతీయంబగువైకారికసృష్టికి, ఐంద్రియకం బగునామము గలదు. ఈప్రాకృతసర్గము బుద్ధిపూర్వకమైనది. స్థావరంబులు ముఖ్యంబులగుటంజేసి చతుర్థసర్గము ముఖ్యంబయ్యెను. తిర్యక్స్రోతనామకంబగుపంచమసృష్టియందుఁ, బశుపక్ష్యాదు లుత్పన్నంబులయ్యెను. తరువాత నూర్ధ్వస్రోతనామకం బగుషష్ఠసర్గము దేవసర్గం బని చెప్పుదురు. అనంతర మర్వాక్స్రోతా

దిసృష్టి. సప్తమం బగునది మానుషసర్గంబు. అష్టమం బనుగ్రహసర్గం బును, నవమంబు కౌమారసర్గంబు నని చెప్పుదురు.

ప్రథమోక్తంబు లగుప్రాకృతసర్గంబులుమూఁడును, అబుద్ధిపూర్వకములు. ముఖ్యాదివైకృతసర్గంబు లైదును బుద్ధిపూర్వకములు. పూర్వము బ్రహ్మదేవుండు తనమానసపుత్త్రులనుగా సనందుఁడు, సనకుఁడు, విద్వాంసుఁ డగుసనాతనుఁడు, ఋభుఁడు, సనత్కుమారుఁడు ననువారిని బ్రథమంబున సృజించెను. వారందఱును, వీతరాగులును, విమత్సరులు నగు యోగులై నిరంతరపరమేశ్వరధ్యానాసక్తు లగుట వలన వారికిఁ బ్రజాసృష్టియం దభిలాష లేకపోయెను. వారందఱును సృష్టిక్రియాపరాఙ్ముఖు లై పోవుటయు మరల సృష్టి చేయవలయు నని సంకల్పించి బ్రహ్మదేవుండు మహోగ్రం బగుతపంబు గావించెను.

ఇట్లు తపంబు చేయుచున్నయాతనిచే నేమియుం గాకపోయెను. చిరకాలము తపించుటచే నాతనికి దుఃఖము గలుగుటచేఁ గ్రోధ ముదయించెను. అందుచే నాతనినేత్రములనుండి యశ్రుబిందువులు వెలువడుటయు వానినుండి భూతప్రేతాదులు పుట్టెను. వానినన్నిటిం గాంచి యజుండు తన్నుఁదానే నిందించుకొనియెను. అప్పు డాతనికిఁ గ్రోధామర్షంబులచే మూర్ఛ గలుగుటయు, క్రోధావిష్టుం డగునాతఁడు ప్రాణములను విడిచెను. అప్పుడు ప్రాణేశ్వరుండును, నీలలోహితుండును, భగవానుండు నగురుద్రుండు పరమానుగ్రహంబు గావించుటకై ప్రభుండగు బ్రహ్మదేవునిముఖమునుండి ప్రాదుర్భవించి సకలేశ్వరుం డగు నాతఁడు తన్నుఁదా నేకాదశవిధంబులుగా విభజించుకొనియెను. వా రేకాదశరుద్రులైరి. వారయ్యీశ్వరునిచే "వత్సలారా! లోకానుగ్రహార్థమై మీరు నాచే సృష్టింపఁబడితిరి. కావున సమస్తలోకసంస్థాపనంబునకును, హితంబునకును బ్రజావృద్ధికిఁ దపస్విరూపులగుమీ రనలసు

లై ప్రయత్నింపుఁడు." అని బోధింపఁబడి వారందఱును రోదనము
చేయుచు నలుదెసలఁ బరుగులెత్త నారంభించెను. అందుచే వారికి
రుద్రనామంబు గలిగెను. ఆరుద్రులే ప్రాణస్వరూపులు. కావుననే
వారు మహాత్మకులు.

అనంతరము బ్రహ్మపుత్త్రుం డగుమహేశ్వరుఁడు దయావిష్టుం
డై మృతుం డగుబ్రహ్మను మరల జీవింపఁజేసి ప్రహృష్టహృదయుం
డై బ్రహ్మదేవు నుద్దేశించి సాధువాక్యంబులతో నిట్లనియెను. ఓజగ
ద్గురూ! విరించీ! నీవు భయపడవలదు. నేను నీకుఁ బ్రాణంబులఁ
గల్పించితిని. ఓసువ్రతా! నీవిఁక సుఖముగా లెమ్ము! అనుటయు
బ్రహ్మదేవుండు స్వప్నానుభూతుండునుబోలి యామనోహరవచనంబుల
నాకర్ణించి ప్రఫుల్లనయనకమలంబులతో నల్లనల్లన మహాదేవు నీక్షించి
యాదేవునివలనఁ దనకు మరలఁ బ్రాణంబులు లభించిన వని యెఱింగి
కృతాంజలియై మేఘగంభీరస్వరంబున నోమహాభాగా! నీవు నాహృద
యానందకరుండ వై తివి. ఓవిశ్వమూర్తీ! ఏకాదశరూపంబులతో ను
న్ననీవెవ్వరు? అని ప్రశ్నించుటయు సుముఖుం డగునమ్మహేశ్వరుండు
పద్మగర్భుని దనహస్తద్వయంబుచే స్పృశించుచు మహాత్మా! నేను
నీకుఁ బుత్త్రుండ నగుపరమాత్ముఁడ నని యెఱుంగుము. ఈయేకాదశ
రుద్రులును నీసంరక్షణంబుకొఱకు వచ్చియున్నారు. కావున నీవిఁక
నాయనుగ్రహంబుచే ఘోరమోహపరిత్యక్తుండవై, ప్రబుద్ధుండవై
మరల నెప్పటివలెఁ బ్రజాసృష్టి గావింపుము.

అని భగవానుం డానతిచ్చుటయు విశ్వాత్ముం డగువిధాత
యతిప్రీతుండై నామాష్టకంబున నద్దేవు నిట్లు వినుతింపఁదొడంగెను.
ఓరుద్రదేవా! భాస్కరామితతేజోమయుండ వగునీకు నమస్కారము.
ఓదేవా! రసజలమయాత్ముండవు, భవుండవు నగునీకు నమస్కారము.

ఓశర్వా! సర్వదా సౌరభమయక్షితిస్వరూపుఁడ వగునీకు నమస్కారము. ఓయీశ్వరా! స్పర్శమయవాయుస్వరూపుఁడ వగునీకు నమస్కారము. ఓపశుపతీ! అతితేజోమయపావకస్వరూపుఁడ వగునీకు నమస్కారము. ఓభీమా! శబ్దమయస్వరూపుఁడ వగునీకు నమస్కారము. ఓయుగ్రమూర్తీ! యజమానస్వరూపుఁడ వగునీకు నమస్కారము. ఓమహాదేవా! అమృతమయసోమస్వరూపుఁడ వగునీకునమస్కారము. అని యీవిధముగా స్తోత్రంబు సేయుచుఁ బద్మజుండు వినతుండై యాతని నిట్లు ప్రార్థింపందొడంగెను. భగవానుండ వగు నోమహేశ్వరా! నీవు నాకుఁ బుత్త్రుండవు. మఱియు భూతభవిష్యద్వస్తువుల కధీశ్వరుండవు. ఓయనంగదమనా! సృష్టివర్థనంబునకై నీవు మదీయాంగమునుండి యుదయించితివి. కావున నోప్రభూ! ఈమహత్సృష్టికార్యంబునఁ బ్రవృత్తుండనై యున్ననాకు సాహాయ్యంబు గావింపుము. ప్రజాదిసృష్టిం గావింపుము.

శంకరుండును, త్రిపురమర్దనుండు నగురుద్రుం డీరీతిగా విధాతచే యాచితుండై యట్లే చేయుదు నని యనుగ్రహించెను. అప్పుడు భగవంతుం డగుపద్మాసనుండు ప్రహృష్టాంతఃకరణుండై యద్దేవునకు వందనంబు లొనరించి యాతనిచే సృష్టికరణంబున కనుజ్ఞాతుండై మరలఁ దనమనంబునుండి మరీచి, భృగువు, అంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, దక్షుఁడు, అత్రి, వసిష్ఠుఁడు ననువారిని సృజించెను. వీరికంటె ముందుగా నాతఁడు ధర్మని, సంకల్పుని సృజించెను. రుద్రునితోఁగూడ నీపన్నిద్దఱును బ్రథమంబున బ్రహ్మనుండియుదయించిరి. వీరే ప్రాచీనగృహస్థులుగాఁ బ్రశంసితు లగుచున్నారు. వీరివలననే దివ్యంబులును, దేవగణార్చితంబులు నగు ద్వాదశవంశము లయ్యెను. ఈవంశము లన్నియుఁ బ్రజావంతములును, గ్రియావంతములును, మ

హార్ష సమలంకృతములు నై యుండెను.

అనంతరము బ్రహ్మదేవుండు రుద్రసహితుండై యాజలంబునం దు దేవాసురపితృమానవులను సృష్టింపఁదలంచి సమాధినిష్ఠుండై తన ముఖమునుండి దేవగణంబులను, కటిప్రదేశమునుండి పితృగణంబులను, జఘనమునుండి యసురగణంబులను, లింగమునుండి మానవగుణంబుల ను బుట్టించెను. ఆతనిమలనిర్గమస్థానమునుండి క్షుధావిష్టు లగురాక్షసు లుదయించిరి. వారందఱును రజస్తమోగుణప్రధానులును, బలిష్ఠులును నిశాచరులు నైరి. మఱియు నాతనిపార్శ్వదేశంబులనుండి నాగ, యక్ష, భూత, గంధర్వ, వయోగుణంబులును, వక్షస్థలమునుండి పక్షులును, ముఖమునుండి ఛాగంబులును, పాదంబులనుండి గజ, తురగ, శరభ, గవయాదిసకలమృగంబులును, రోమంబులనుండి యోషధులును, సకల ఫలమూలంబులును నుదయించెను.

ఆతఁడు తనప్రథమముఖమునుండి గాయత్రియు, ఋగ్వేదంబు ను, త్రివృత్స్తోమంబును, రథంతరంబును, అగ్నిష్టోమంబును బుట్టించె ను. దక్షిణముఖమునుండి యజుర్వేదమును, త్రిష్టుప్ఛందమును, పంచ దశస్తోమమును, బృహత్స్తోమమును, ఉక్థంబును సృజించెను. పశ్చిమ ముఖమునుండి సామవేదమును, జగతీచ్ఛందమును, సప్తదశస్తోమమును, వైరూపాతిరాత్రింబులను గలిగించెను. ఉత్తరముఖమునుండి యథర్వ వేదమును, ఆప్తోర్యామాణంబును, అనుష్టుప్ఛందంబును, వైరాజ నామకం బగుసామమును బుట్టించెను. ఆతనిశరీరమునుండి నానావిధ భూత, యక్ష, పిశాచ, గంధర్వగణంబులును, అప్సరోగణంబులు నుద యించిరి. మఱియు నర, కిన్నర, రాక్షస, పశు, పక్షి, మృగ, సర్పా దులును, స్థావరజంగమాత్మకంబు నవ్యయంబు నగునీజగంబంతయు నుదయించెను.

వీరికందఱకును బూర్వసృష్టియం దెట్టి కర్మము గలదో ప్రతి సృష్టియందునట్టికర్మమే ప్రాప్తించుచుండును. జీవులందఱు నీశ్వరపేరితులై హింసాహింసి, మృదుక్రూర, ధర్మాధర్మ, సత్యాసత్యములం దాసక్తులై యుందురు. దేనియందాసక్తిగలవారి కదియే ప్రియముగా నుండును. విధాత స్వయముగా మహాభూతములయందును, ఇంద్రియంబులయందును, భోగ్యవస్తువులందును, ముక్తులయందును నానావిధత్వమును, జీవులకు వానియందు వివిధప్రవృత్తులను గల్పించెను. అనంతరమాతఁడు వేదశబ్దములనుండి ప్రథమంబునఁ బ్రాకృతభూతాదులకు నామరూపంబుల విస్తరింపఁజేసెను. అజుండు తననిశావసానంబునందు సృష్టింపంబడినసకలపదార్థములకును వేదంబులయందు నిర్దిష్టంబులైన నామస్థానంబులను బ్రసాదించెను. కారణోద్భూతం బగునీ బ్రహ్మసృష్టి యంతయు మహదాదివిశేషాంతంబునుగల వస్తువులయొక్కయు, సాక్షాత్ప్రకృతియొక్కయు వికారస్వరూపమే.

అది చంద్రసూర్యప్రభలచేఁ బ్రకాశితంబును, గ్రహనక్షత్రాదులచే రమణీయంబును, నదీనదసాగరశైలనగిరజనపదాదులచే నలంకృతంబును నై యుండును. ఈబ్రహ్మస్వరూపసనాతనవృక్షముమహేశ్వరానుగ్రహంబనుజలంబుచేఁ దడుపఁబడి యవ్యక్తమునుండి యుత్పన్నంబైనది. ఈమహావృక్షము బుద్ధి యనుస్కంధంబు చేతను, మహత్తను శాఖాసమూహము చేతను, కోటరంబు లనునింద్రియగణంబుల చేతను, పరిమాణం బనుమహాభూతసముదాయముచేతను, విశేషంబులనుపల్లవంబులచేతను, ధర్మాధర్మము లనుకుసుమంబులచేతను, సుఖదుఃఖము లనుఫలంబులచేతను, విరాజిల్లుచు సర్వభూతాశ్రయమై యుండును. స్వర్గమాతనిమస్తకంబుగను, ఆకాశము నాభిగను, సూర్యచంద్రులు నయనములుగను, దిక్కులు కర్ణములుగను, పృథ్వి పాదపీఠము

గను నిర్దేశింపఁబడియెను. అచింత్యుండును, సర్వభూతనిర్మాతయు న గునాతనిముఖమునుండి బ్రాహ్మణులును, వక్షమునుండి క్షత్రియులు లును, ఊరువులనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును సం భవించిరి.

## —♦ శేషశాయివర్ణనము. ♦—

అని బోధించుటయు మహర్షులందఱును వాయుదేవు నుద్దేశించి మహాత్మా! పరమాత్ముం డగుభవుండు చతుర్ముఖునిముఖమునుండి పు ట్టె నని చెప్పితివి. ఈవిషయంబున మాకధికతరం బగుసంశయము గ లిగియున్నది. విరూపాక్షుం డగుమహాదేవుఁడు సర్వదేవతాశ్రేష్ఠుండు ను, దీప్తత్రిశూలధరుండును, కపర్దియు, నీలలోహితుండును, భగవా నుండును, రుద్రుండును, కాలస్వరూపుఁడు నై యుండును. యుగాం తమునం దాతఁడు క్రుద్ధుఁడై బ్రహ్మవిష్ణులతోఁగూడ సకలలోకసంహా రంబు గావించును. బ్రహ్మవిష్ణువు లాతనికిఁ బ్రణతులై లోకసంహార కారి యగునాదేవున కధీనులై యుందురు. ఆమహాదేవుఁడే మొదట బ్రహ్మవిష్ణులను సృజించెను. నిరంతరము నాతఁడే వారికి యోగక్షే మకరుఁడై యుండును. అట్టిపురాతనుండును, ఆదిదేవుండు నగురుద్రుం డు, అవ్యక్తప్రభవు డగుబ్రహ్మదేవునకుఁ బుత్రుం డెట్లయ్యెను? ప్ర జాపతి యగుబ్రహ్మయు; విష్ణుండును రుద్రప్రేరితులై పరస్పరాంగము లనుండి పరస్పరము నుదయించినట్లు మేము విని యుంటిమి. సర్వభూ తకారణస్వరూపు లగువారు మరలఁ బ్రధానాప్రధానభావములతో నొ కరినుండి యొకరెట్లుదయించిరి? మీరెఱుంగనిదియు, నాకర్ణింపనిది యు నగువిషయ మేదియు నుండదు. భగవానుండగుబ్రహ్మదేవునకు శిష్యుండవగునీవు సర్వంబు నాతనివలన వినియే యుందువు. మహా త్మా! విరించి నీకుపదేశించినవిధంబున మాకీసర్వవృత్తాంతమును సవిస్త

రముగా నెఱింగింపుము.

అని ప్రార్థించుటయు వాయుదేవుం డిట్లనియెను. విప్రశ్రేష్ఠులారా! నిపుణులగు మీరు యుక్తాయుక్తముగనే ప్రశ్నించితిరి. బ్రహ్మదేవునిచే నేను వినినవిధంబుగనే త్రిమూర్త్యుత్పత్తిం గూర్చి మీకుఁ జెప్పెదను. కారణస్వరూపు లగు బ్రహ్మవిష్ణురుద్రులు మువ్వురును మహేశ్వరునుండి యుద్భవించిరి. వారే యీచరాచరవిశ్వంబునకు సృష్టిస్థితిలయకారణులు; పరమేశ్వరప్రేరితులు; పరమైశ్వర్యసంయుక్తులు. వా రాపరమేశ్వరునిశక్తిచే నధిష్ఠితులై కార్యకరణసమర్థులై యుందురు. పరమేశ్వరుఁడే ప్రథమంబున నామువ్వురను స్వకర్మనియోజితులం గావించెను. బ్రహ్మ సృష్టికార్యమును, విష్ణువు పాలనకార్యమును, రుద్రుఁడు సంహారకార్యమును జేయుచుందురు. మాత్సర్యంబుచే వారు పరస్పరాధిక్యమును వాంఛించి జనకుండగుపరమేశ్వరుం గూర్చి తపంబు సేయుచుందురు. పరమేశ్వరానుగ్రహంబున వారు సర్వాత్మకత్వముం గాంచఁగలిగిరి. కావుననే యొకకల్పమునందు రుద్రుఁడు బ్రహ్మవిష్ణువులను, మఱియొకకల్పమునందు జగన్మయుం డగుబ్రహ్మదేవుండు రుద్రవిష్ణులను, మఱల నింకొకకల్పంబున విష్ణుదేవుండు బ్రహ్మరుద్రులను సృష్టించుచుండును. ఈవిధముగాఁ బ్రతికల్పమునందును నొకరినొకరు జయించు నభిలాషతో నొకరినుండి యొకరుగా బ్రహ్మవిష్ణురుద్రులు మువ్వురు నుదయించుచుందురు. వారియుత్పత్తిం గూర్చి యాయాకల్పములం దా యామహర్షులు తథావిధంబుగఁ గీర్తించుచుందురు.

పూర్వము మేఘవాహనకల్పమునందు నారాయణుండు దివ్యవర్షసహస్రంబులు మేఘరూపముం దాల్చి పరమేశ్వరుని వహించి యుండెను. అప్పుడు విశ్వగురుం డగుమహాదేవుం డాతనిమనోభావమును గ్రహించి యాతనికి సర్వవిధంబుల నవ్యయంబగుశక్తిని బ్రసాదించెను.

ఇట్లు సర్వేశ్వరానుగ్రహంబున శక్తిమంతుండై భగవానుం డగువిష్ణుం డు బ్రహ్మసహితుండై విశ్వసృష్టిం గావించుచుండెను. విష్ణునిచే నూతనముగ సృష్టింపఁబడినబ్రహ్మ యప్పుడు విష్ణుదేవునిశక్తిం గాంచి యసూయాగ్రస్తుఁడై హాస్యంబు సేయుచు నోవిష్ణూ! హమ్మ! నీసృష్టికారణమును నేనెఱుంగుదును. మనయిరువురికంటె నధికశక్తిమంతుం డగురుద్రుం డొకఁడున్నాఁడు. ఆవిషయంబున సంశయము లేదు. సర్వోన్నతపదారూఢుం డగునాపరమేశ్వరునియనుగ్రహముచేతనే నీ విప్పుడు సృష్టికర్తవైతివి. నేనుగూడఁ దపంబుచే నాపరమేశ్వరు నారాధించి నీతోఁగూడ నీజగంబంతయును సృష్టించెదను.

అని పద్మసంభవుండు నారాయణుని దిరస్కరించి తపంబు గావించి శంకరుని సాక్షాత్కరింపఁజేసికొని యిట్లు ప్రార్థించెను. ఓదేవదేవా! విశ్వేశ్వరా! విష్ణుండు నీవామాంగమునుండియు, నేను నీదక్షిణాంగమునుండియు నుదయించితిమి. అయినను విష్ణుండు నాతోఁగూడ నీ సకలజగంబును సృష్టించి యున్నాఁడు. నేను నీయనుగ్రహబలంబున నే యాతనిని దిరస్కరించివచ్చితిని. ఆతనికి నాకంటెను నీయం దధిక భక్తి యున్నదేమో చూడవలయును. మేమిరువురమును నీనుండి సమానముగనే యుదయించితిమే. కాని నీవు ముందుగ నాతనియెడలఁ బ్రసన్నుండవై దివ్యశక్తిని బ్రసాదించితివి. అట్లే యిప్పుడు నాయెడలఁగూడ ననుగ్రహించి నాకట్టిశక్తిని దయచేయవలయును. అని యిట్లు బ్రహ్మ ప్రార్థించుటయు దయానిధి యగుమహాదేవుండు మందహాసంబు సేయుచు నాతనికి సర్వంబును బ్రసాదించెను.

ఇట్లు విరించి సర్వాత్మశక్తిలాభముంగాంచి యాక్షణంబుననే విష్ణునొద్దకు నతివేగముగఁ బోయెను. పంకజాక్షుం డగువిష్ణుండు క్షీరసముద్రతీరంబున నిచ్ఛానురూపంబుగ సృష్టించుకొన్నమణిహేమమయ

విమానాంతరమునందు శేషపర్యంకమున హాయిగ శయనించి యుండె ను. చతుర్భుజుం డగునాతఁడు వివిధాలంకారభూషితుండును, శంఖ చక్రధరుండును, సౌమ్యాకారుండును, శ్రీవత్సాంకితవక్షుండును, మం దహాససుందరవదనమండలుండును నై యుండెను. ఆతనిపాదపద్మములు భూదేవికరపల్లవంబుల స్పర్శంబుచే రంజితములై యుండెను. అట్లాతఁ డమృతసన్నిభం బగుక్షీరసాగరమున శయనించి యోగనిద్రాసక్తుండై యుండెను. ఆతఁడు తమోగుణంబునఁ గాలరుద్రుండును, రజోగుణం బున బ్రహ్మయు, సత్వగుణంబున సర్వాత్ముండగువిష్ణుండును, నిర్గుణ భావంబున మహేశ్వరుండు నై యుండెను.

బ్రహ్మ యాపురుషునిం గాంచి ప్రగల్భభావముతో విష్ణుదేవా! తొల్లి నీవు నన్నుఁగ్రసించినట్లే నేనిప్పుడు నిన్నుఁ గ్రసించెద నని పలుకు టయు మహాబాహుం డగువిష్ణుం డావాక్యశ్రవణంబునఁ బ్రబుద్ధుండై బ్రహ్మదేవు నవలోకించి మందహాసంబు గావించెను. ఇంతలోనే మ హాత్ముం డగుబ్రహ్మ యాతని గ్రసించి యావెంటనే యశ్రమంబునఁ దనభ్రూమధ్యమునుండి యవ్విష్ణుదేవుని మరల సృష్టించెను. ఆసమ యంబున భగవానుండు నిందుభూషణుండు నగుమహాదేవుం డమూ ర్తుండయ్యును మూర్తిధరుండై వారిశక్తిని బరీక్షించుటకును, వారి న నుగ్రహించుటకును నవతీర్ణుండై వారిరువురును నిలిచియున్నస్థానంబున కు విచ్చేసెను. అప్పుడు బ్రహ్మవిష్ణు లామహాదేవుం గాంచి ప్రీతులు ను, భీతులునై కౌతుకవశంబున నాతనిం గూర్చి స్తోత్రముచేయుచు సన్మానపూర్వకముగా దూరమునుండియే యద్దేవునకుఁ బ్రణామములం గావించిరి. పినాకధరుం డగుమహాదేవుండును వారిరువురి ననుగ్రహిం చి వారిదర్శనపథంబుననే మరల నంతర్ధానుండయ్యెను.

## రుద్రోత్పత్తి.

వాయుదేవుం డిట్లనియెను. మునులారా! ప్రతికల్పంబునను రుద్రావిర్భావంబునకుం గారణ మెఱింగించెద వినుండు. కల్పకల్పంబునను బ్రహ్మాండమునుండి బ్రహ్మ యుదయించి ప్రజాసృష్టి సేయుచు నెంత చేసినను దానియభివృద్ధిం గానక యత్యంతదుఃఖముచే మూర్ఛితుం డగుచుండును. అప్పుడు రుద్రగణాధీశ్వరుండును, గాలస్వరూపుండును నగురుద్రుండు బ్రహ్మాముఖశాంతికొఱకును, ప్రజాభివృద్ధికొఱకును నీశ్వరునిచే నాజ్ఞాపింపఁబడి యాబ్రహ్మకుం దనయుఁడుగా నుదయించి యాతనికిని, లోకములకును ననుగ్రహము జూపుచుండును. భగవానుండును, ఈశ్వరుండును, నీలలోహితుండును, తేజోమయుండును, అనామయుండును, ఆద్యంతరహితుండును, విధాతయు, భూతసంహర్తయు నగువిభుం డాతఁడే. పరమైశ్వర్యశాలియు, బరమేశ్వరుండు నగునాతఁడు మహాదేవప్రేరితుండై యాతనిశక్తిచే సధిష్ఠితుండును, నాతనిచిహ్నలచేఁ జిహ్నితుండునై యుండును. ఆతఁడు శివరూపంబును, శివనామంబును దాల్చి కార్యకరణక్షముండై యుండును. ఆతఁడు శివతుల్యుండును, దదాజ్ఞాపాలకుండు నై యుండును. సహస్రార్కప్రభుండును, చంద్రకళాధరుండు, భుజంగహారభూషితుండును, కేయూరవలయవిరాజితుండును, కపాలధరుండును, పింగళకేశకలాపుండును, గంగాతుంగతరంగాభిషిక్తుండును, కైలాసవాసుండును, కర్ణకుండలాలంకృతుండును, వృషభవాహనుండును, మేఘగంభీరనినదుండును, మహానలతేజుండును, మహాబలపరాక్రమశాలియు, భయంకరాకారుండు నగు రుద్రుండు బ్రహ్మపుత్త్రుండై పుట్టి యాతనికి జ్ఞానదానముం గావించి సృష్టికార్యంబున నాతనికిఁ దోడ్పడుచుండును. ఇట్లు ప్రతికల్పంబునను రుద్రుం డుదయించి బ్రహ్మకు సహాయుం డగుచుండుటచే నాతనియు

నుగ్రహముచేఁ బ్రహ్మారూపమునఁ బ్రహ్మసృష్టి వర్ధిల్లుచుండును.

ఒకప్పుడు నీలలోహితుం డగునావిభుండు ప్రజాసృష్టివిషయం బున బ్రహ్మచేఁ బ్రార్థితుండై తనమనంబునుండి తనతో సమానులగు ప్రజలను సృష్టించెను. వారు జటాధరులును, నిరాతంకులును, నీలగ్రీవులును, త్రిలోచనులును, జరామరణవర్జితులును, శూలధరులు నై జనించి యొక్కసారిగాఁ జతుర్దశభువనములను వ్యాపించిరి. అప్పుడు బ్రహ్మ రుద్రస్వరూపు లగువారిం గాంచి తనకుమారుఁ డగురుద్రుని నుద్దేశించి యోదేవదేవా! నీకు నమస్కారము. ఇఁక నీవిట్టిప్రజలను సృజింపవలదు. నీకు శుభమగుఁగాక ! మఱియొకరీతిని మరణశీలురగు ప్రజలను సృజింపుము. అని ప్రార్థించుటయు రుద్రుండు మందహాసం బు సేయుచు నేనట్టిసృష్టిం గావింపను. నీవు మరణశీలురగు ప్రజలను సృజింపుము. నాముఖంబునుండి యుదయించి మహాబలులగు నీయాజ్ఞకు లందఱును నిరంతరము నాతోడనే యుందురు. అనిచెప్పి నిఖిల భూతేశ్వరుం డగురుద్రుండు సృష్టికార్యమునందు నివృత్తుండై రుద్ర గణంబులతోఁ గూడి యుండెను. అదిమొదలుగ నాతఁడట్టికార్యము ను గావింపక ప్రళయకాలపర్యంతము నూర్ధ్వరేతస్కుఁడై యుండెను.

## —• అర్ధనారీశ్వరసాక్షాత్కారము. •—

బ్రహ్మదేవుండు తనమానసికసృష్టి క్రమముగా వర్ధిల్లకుండు సమయంబున మిథునసంబంధ మగుసృష్టి గావింపవలయు నని యాలోచించెను. ప్రథమమునం దీశ్వరుఁడు స్త్రీజనమును సృజింపకుండుటచే నట్టిసృష్టిసేయుట కాతఁ డసమర్థుండై తనయభీష్టలాభంబుకొఱకుఁ బరమేశ్వరుని దర్శించి యేదేనొకయుపాయంబు గరయవలయు నని నిశ్చయించుకొని తపంబు సేయ నారంభించెను. అప్పుడు లోకకారణంబును, సూక్ష్మతరంబును, విశుద్ధంబును, భక్తిగమ్యంబును, నిష్కలంబు

ను, నిరుపప్లవంబును, నిరంతరంబును, నిత్యంబును, నిత్యైశ్వర్యసమీప స్థంబును, పరమంబు నగునొకశక్తి బ్రహ్మమానసమునుండి యావిర్భవించెను. ఆదివ్యశక్తితో నాతఁడు తనహృదయమునందుఁద్రిలోచనుండగుమహాదేవుని ధ్యానించుచుఁ దపంబు సేయందొడంగెను.

యోగయుక్తుం డగు నవ్విరించితీవ్రతపంబునకు జనకుం డగు మహేశ్వరుం డచిరకాలంబుననే సంతుష్టుండై తనయేకాంశముచే నర్ధనారీశ్వరరూపముం దాల్చి విధాతకు సాక్షాత్కరించెను. అద్వితీయుండును, అనిర్దేశ్యుండును, అకృతాత్ములకదృశ్యుండును, సర్వలోకకారణుండును, శక్తిమంతుండును, అప్రతర్క్యుండును, అజ్ఞేయుండును, అమేయుండును, అజరుండును, నిత్యుండును, అచలుండును, నిర్గుణుండును, శాంతుండును, అనంతమహిమాస్పదుండును, సర్వదుండును, సర్వగతుండును, సదసద్వ్యక్తిరహితుండును, అప్రతిముండును, శరణ్యుండును, తమోరహితుండును, అవ్యయుండును, శాశ్వతుండు నగునమ్మహాదేవుం గాంచి బ్రహ్మదేవుండు దండప్రణామంబు గావించి కృతాంజలిపుటుండై లేచి శ్రద్ధావినయసంపన్నంబులును, సుసంస్కృతంబులును, మనోహరంబులును, సత్యంబులును, అర్థవంతంబులును, శ్రుతిసమ్మతంబులు నగుసూక్తంబులచే నమ్మహాదేవుని, దేవిని వినుతింప నారంభించెను.

జయేశ్వరా! మహేశ్వరా! సర్వగుణశ్రేష్ఠా! సురేశ్వరా! నీకు జయమగుఁగాక! ఓకల్యాణప్రకృతీ! ప్రకృతినామా! ప్రకృతిదూరాంగీ! ప్రకృతిసుందరీ! నీకు జయమగుఁగాక! మహాదేవా! అమోఘమహామాయాశాలీ! అవ్యర్థమనోరథా! లీలామయా! అమోఘమహాబలా! నీకు జయమగుఁగాక! ఓజగన్మాతా! విశ్వమయీ! విశ్వజగద్ధాత్రీ! విశ్వజగత్స్రష్టీ! నీకు జయమగుఁగాక! ఓనిత్యైశ్వర్యశాలీ! నిత్యవస్త్వాశ్రయా!

నిత్యాకారా! నిత్యవస్త్వనుగతా! నీకు జయమగుఁగాక! ఆత్మత్రియ నిర్మాత్రీ! ఆత్మత్రయపాలనీ! ఆత్మత్రయసంహర్త్రీ! ఆత్మత్రయనాయికా! మహాశక్తీ! నీకు జయమగుఁగాక! అవలోకనమాత్రంబున నధీనంబులగుజగత్కారణంబులను విస్తరింపఁజేయువాఁడా! అయత్నంబుగ నుద్భూతంబైననేత్రాగ్నిలంబుచేఁ గామదేవుని దహించినవాఁడా! నీకు జయమగుఁగాక! దేవాదులకుఁగూడ నవిజ్ఞేయంబగుసూక్ష్మరూపంబుచేఁ బ్రకాశించుచుండుదేవీ! స్థూలాత్మశక్త్యంశయందు సమస్తచరాచరప్రపంచమును వ్యాపింపఁజేయుదేవీ! నీకు జయమగుఁగాక! నిఖిలవిశ్వతత్త్వంబుల ననేకరూపంబులచే విన్యస్తంబులుగాఁ జేయుదేవా! అసురగణమస్తకన్యస్తపదారవిందులగుననుచరగణంబులు గలదేవా! నీకు జయమగుఁగాక! ఆశ్రితజనులను సంరక్షించుసామర్థ్యముగల తల్లీ! సంసారవిషవృక్షాంకురము నున్మూలింపఁగలతల్లీ! నీకు జయమగుఁగాక! ఆశ్రితులకు మహావీర్యశౌర్యైశ్వర్యములఁ బ్రసాదించుతండ్రీ! విశ్వబహిర్భూతం బగుననంతవైభవము గలతండ్రీ! సృజింపంబడినపంచభూతంబులను నడపించుటయందుఁ బరబ్రహ్మస్వరూపుఁడవగుతండ్రీ! నీకు జయమగుఁగాక! ఓపంచార్థవిజ్ఞానామృతపరివాహస్వరూపిణీ! దారుణసంసారమహారోగభిషక్స్వరూపిణీ! అనాదిమలాజ్ఞానతమఃపటలచంద్రికా! నీకు జయమగుఁగాక! ఓత్రిపురకాలాగ్నిస్వరూపా! త్రిపురభైరవా! త్రిగుణాతీతా! నీకు జయమగుఁగాక! త్రిగుణవినాశినీ! నీకు జయమగుఁగాక! ఓసర్వజ్ఞా! దేవా! సర్వప్రబోధికా! దేవీ! సర్వాంగసుందరా! దేవా! సర్వాభీష్టప్రదాయినీ! దేవీ! మీకు జయమగుఁగాక! ఓదేవా! నీపరమధామం బెక్కడ? నేనెక్కడ? నాస్తోత్రపాఠము లెక్కడ? ప్రభూ! అయినను భక్తివశంబునఁ బ్రలపించుచున్ననన్ను క్షమింపుము.

అని యిట్లు వినుతించుచు విధాత యారుద్రాణీరుద్రులకుఁ

బునఃపునఃప్రణామంబులఁ గావించుచుండెను. బ్రహ్మోక్తం బగునీ
యర్ధనారీశ్వరస్తోత్రము సర్వశ్రేష్ఠంబును, బవిత్రంబును, బార్వతీపరమే
శ్వరులకతిప్రియంబు నైనది. ఎవ్వరేఫలంబును గోరి యీస్తోత్రమును
బఠించినను శివానుగ్రహంబుచే వారి కాఫలంబు సిద్ధించును. సకల
భువనభూతభావనులును, జననమరణవిరహితులును, నరనారీరూపధరులు
నగుశంకరీశంకరులకు నమస్కారము.

## —♦ మిథునసంబంధసర్గారంభము. ♦—

బ్రహ్మదేవుం డిట్లు వినుతించుటయు మహాదేవుండు ప్రీతుండై
జలదనిస్వనగంభీరంబులును, మధురంబులును, విశదంబులును, సరస
వర్ణమయంబులును, ప్రతిపదార్థయుక్తంబులును, రాజలక్షణాన్వితంబు
లును; సకలవిషయారంభరక్షావిలయదక్షంబులును, మనోహరతరం
బులును, ఉదారంబులును, మధురమందహాసకలితంబులు నగువచనంబు
లం దిట్లనియెను. ఓవత్సా! మహాభాగా! నీవు నాపుత్రుండవు.
నేను నీసకలవాక్యంబులయందలి గౌరవమును గ్రహించితిని. నీవిప్పుడు
ప్రజాభివృద్ధిం గోరి తపంబు గావించితివి. నీతపంబునకు నేను పరితు
ష్టుండ నైతిని. నీయభిలషితవరప్రదానంబు గావించెదను. అని యను
గ్రహించి పరమోదారుండును, దేవశ్రేష్ఠుండు నగుమహాదేవుండు తన
శరీరభాగమునుండి యొకదేవీమూర్తిని సృజించెను. ఆదేవినే బ్రహ్మ
విదులగువారు పరమాత్ముం డగుమహాదేవుని దివ్యశక్తి యని ప్రశం
సించుచుందురు. ఆమెకు జన్మమృత్యుజరాదులు లేవు. భవునియందే
మునుపే యుదయించుటచే భవానీనామంబున విలసిల్లినా మెయపార
మహిమను వర్ణింపఁజాలక మనంబును, నింద్రియసహితంబుగా వాక్యం
బులును నివృత్తంబు లగుచుండును. మహాదేవశరీరోత్పన్నయై ప్రతిభా
సించుచుండునద్దేవి తనమహిమచే సకలజగంబును వ్యాపించి యుండె

దివ్యశరీరిణి యగునామె విచిత్రాకృతితో గోచరించుచుండును. అమ్మ హాదేవి తనమాయచే సకలజగంబులను మోహింపఁజేయుచుండును. వస్తుత్వముచే జన్మశూన్య యగునామె మహేశ్వరుని దివ్యదేహము నుండి యుద్భవించెను. ఆమెపరమభావము దేవతలకుఁగూడ నగోచర మైనది. సకలదేవతలకు నామె యధీశ్వరి. ఆమె తనస్వామి యగు మహాదేవుని దేహమునుండి విభక్తయై యుండును. అట్టి సర్వలోకేశ్వరి యు, సర్వసాక్షియు, సర్వగతయు, సూక్ష్మరూపిణియు, సదసద్వ్యక్తివిహీన యు, దివ్యదేహప్రభావిభాసితసకలజగన్మండలయు నగు పరమేశ్వరిం గాంచి బ్రహ్మదేవుండు సాష్టాంగప్రణామంబు గావించి యిట్లు స్తుతింప నారంభించెను.

ఓసర్వజగన్మయీ! దేవీ! నేను పరమేశ్వరునిచే సృజింపఁబడి, సృష్టికార్యమునందు నియోగింపఁబడి సర్వజగంబులను సృజించుచుం టిని. నేను ముందుగా నామానసమునుండి పుట్టించిన దేవతాదులు మరలమరల నెన్నిసారులు సృష్టింపఁబడుచుండినను నభివృద్ధిం గాంచుట లేదు. అందుచే నేనిప్పుడు మిథునసంబంధ మగుసృష్టిచేఁ బ్రజాభివృద్ధిం గావింప నభిలషించుచుంటిని. ఇంతకుఁబూర్వము నీవలన నక్షయం బగునారీకులము సంభవించి యుండలేదు. అందుచే నారీకులమును సృష్టించుశక్తి నాకు లేకపోయెను. అందఱకును నీమూలముననే శక్తి లభించుచున్నది. కావున నోసర్వవ్యాపినీ! సర్వశక్తిప్రదాయినీ! సురే శ్వరీ! వరదాత్రీ! నాప్రార్థనమును మన్నించి నాకొక్కవరంబు దయ సేయుము. చరాచరంబులయభివృద్ధికొఱకు నీవొకయంశముచే నాతన యుఁడగు దక్షునకుఁ దనయవై పరిణయంపుము.

అని యిట్లు వేదవక్త యగు విరించి ప్రార్థించుటయు, నద్దేవదే వి తన భ్రూమధ్యమునుండి తనతో సమానప్రభావము గల యొక

దివ్యశక్తిని బుట్టించెను. దేవదేవుం డగుమహేశ్వరుం డామెం గాంచి మందహాసము సేయుచు నీవు తపంబుచే బ్రహ్మదేవు నారాధించుచు నాతనికి మనోరథసంపాదనంబు గావింపుమని యాజ్ఞాపించెను. ఆదేవియు మహాదేవునియాజ్ఞను శిరంబునందాల్చి బ్రహ్మవచనానుసారంబుగా దక్షపుత్రికయై జన్మించెను. అనంతరము బ్రహ్మస్వరూపిణి యగు నయ్యాదిశక్తి విధాత కనంతశక్తిప్రదానంబు గావించి మరల మహేశ్వరునిదివ్యదేహంబునం బ్రవేశించెను. అప్పు డమ్మహాదేవుండు నంతర్హితుం డయ్యెను. అదిమొదలుగ నీప్రపంచమునందు స్త్రీసంభోగము ప్రతిష్ఠితం బయ్యెను. ఓమునులారా! అప్పటినుండియే మిథునసంబంధ మగుప్రజాసృష్టియు నారంభమయ్యెను. దేవియగునాదిశక్తినుండి సర్వశక్తులు నెట్లుత్పన్నంబు లయ్యెనో భూతసృష్టిప్రసంగమునందు మీకుం జెప్పియుంటిని. ఈచరిత్ర మతిపవిత్రంబును, మధురంబును, ధనప్రవృద్ధికరంబు నైనది. ప్రతిదినంబును దీనిని బఠించువారికి సకలాభీష్టసిద్ధియు సత్పుత్రలాభంబును గలుగును.

## —♦ స్వాయంభువవంశప్రశంస. ♦—

ఈశ్వరుండును, మహాదేవుండు నగుమహేశ్వరునియనుగ్రహంబున నీవిధముగా నిత్యంబును, శ్రేష్ఠంబు నగుశక్తిలాభముం గాంచి బ్రహ్మదేవుండు మిథునసంబంధసర్గముం గావించు నభిలాషతోం దనదేహమును రెండుభాగములుగం జేసి యొకభాగమునుండి విరాట్పురుషుం డగుస్వాయంభువమనువును సృష్టించెను. దేవియగుశతరూప యతిదుస్సహం బగుమహాతపంబు గావించి ప్రదీప్తయశుండగు నమ్మనువును భర్తగాం బడసెను. పిమ్మట నామె స్వాయంభువమనువువలనం బ్రియవ్రతుండు, నుత్తానపాదుండు ననునిరువురుతనయులం గాంచెను. అయ్యిరువురుపుత్రులునుగూడం గ్రమముగ సంతానవంతులైరి. అమ్మను

దంపతు కీతనయులేకాక యిరువురుతనయలుగూడఁ గలిగిరి. వారును సంతానవతులై రి. ఆకూతి, ప్రసూతి యనునామంబులచే వారు ప్రసిద్ధులై యుండిరి.

స్వాయంభువమనువు ప్రసూతిని దక్షునకును, ఆకూతిని రుచి యనుప్రజాపతికిని నొసంగి పరిణయములంగావించెను. బ్రహ్మమానస పుత్రుం డగురుచివలన నాకూతిగర్భమునుండి యొకమిథునం బుదయిం చెను. అందుఁ బురుషునిపేరుయజ్ఞుఁడు ; స్త్రీపేరు దక్షిణ. వారిరువు రును సంతానవంతులై జగద్వర్ధనముం గావించిరి. మహాప్రభావ సంపన్నుండగుదక్షుండును మనుకన్యయగుప్రసూతిగర్భమునుండి యిరు వదినలుగురులోకమాతలను బుట్టించెను. వారిలో శ్రద్ధ, లక్ష్మి, ధృ తి, పుష్టి, తుష్టి, మేధ, క్రియ, బుద్ధి, లజ్జ, వసువు, శాంతి, సిద్ధి, కీ ర్తి యను పదుముగ్గురుకన్యలను బ్రహ్మభావశాలి యగుధర్ముండు ధర్మప త్నులుగాఁ గైకొనియెను. తక్కిన ఖ్యాతి, సతి, సంభూతి, స్మృతి, ప్రీ తి, క్షమ, సన్నతి, అనసూయ, ఊర్జ, స్వాహ, స్వధ, యనుకన్యలను యథాక్రమంబుగ భృగువు, మహాదేవుఁడు, మరీచి, అంగిరుఁడు, పుల హుఁడు, క్రతువు, పులస్త్యుఁడు, అత్రి, వసిష్ఠుఁడు, అగ్ని, పితృగణం బులును దమతమభార్యలుగాఁ బరిగ్రహించిరి. ధర్మునకు శ్రద్ధాదిత్ర యోదశపత్నులయందును గాముఁడుమొదలు యశునివఱకును గలపదు ముగ్గురుపుత్రులు గలిగిరి. వీరందఱును సుఖప్రదాయకులై యుండిరి. మఱియు ధర్మునకు హింసాగర్భంబున జనించినయాధర్ముండనుపుత్రుఁ డుమాత్రము దుఃఖదాయకుఁడయ్యెను. ఆయధర్మునకు జనించిననిష్కృ త్యాదులగుపుత్రులుగూడ సధర్మలక్షణయుతులై యుండిరి. నియమ శూన్యులగువారికి భార్యలుగాని, పుత్రులుగాని లేకుండిరి. అదియే తామససర్గము. అధర్ముఁడు దాని కధీశ్వరుఁడు.

దక్షపుత్రికయు, రుద్రాణియు నగుసతీదేవి పతినింద్రాశ్రవణంబు సహింపక బంధుసహితుండగుదక్షుని, నాతనిభార్యను నిందించుచు దేహత్యాగంబు చేసి హిమాలయగృహంబున మేనాగర్భమునుండి మరల౯ బుత్రికయై జనించెను. రుద్రుం డాసతిం గాంచి యసంఖ్యాకులగు రుద్రగణంబులను బుట్టించినవృత్తాంతమును మీకిదివఱకే చెప్పియుంటిని. భృగునకు ఖ్యాతిగర్భమునుండి నారాయణప్రియ యగులక్ష్మీదేవి తనయయై పుట్టెను. మఱియు మన్వంతరసంచారశీలురగుధాతయు, విధాతయు నను నిరువురు దేవమూర్తులుగూడ నుదయించిరి. ఆయిరువురు దేవతలకును శతసహస్రపుత్రపౌత్రాదు లుత్పన్నులైరి. స్వాయంభువమన్వంతరాతీతు లగువారందఱును భార్గవు లని ప్రసిద్ధులైరి. మరీచి సంభూతి యనుపత్నివలన౯ బౌర్ణమాసుండనుపుత్రుని,నలువురుపుత్రికలను బడసెను. ఆపుత్రికాపుత్రికులవంశము లతివిస్తారము లయ్యెను. వారివంశమునందే బహుపుత్రవంతుం డగుకశ్యపమహర్షి యుదయించెను. అంగిరుండు స్మృతియనుపత్నివలన ఆగ్నీధ్రుండును, శరభుండునను నిరువురుకొమరులను నలువురుతనయలను గనియెను. వీరివంశము సహస్రసహస్రపుత్రపౌత్రాదులచే నతీతమైపోయెను. పులస్త్యునకు౯ బ్రీతియందు దంతనామంబున నగ్ని యుదయించెను. ఆతఁడు పూర్వజన్మమునం దగస్త్యనామముచే౯ బ్రసిద్ధుం డయ్యెను. స్వాయంభువమన్వంతరమునం దాతనిపుత్రపౌత్రాదిసంతతి యంతయును బౌలస్త్యనామంబున విఖ్యాతం బగుచుండెను. పులహుండు క్షమాదేవివలన౯ గర్దముఁడు, ఆసురీయుఁడు, సహిష్ణుఁడు నను త్రేతాగ్నితుల్యులగుముగ్గురుపుత్రులను బడసెను. వీరివంశము లన్నియును సుప్రతిష్ఠితము లయ్యెను. క్రతునకు సన్నతివలన౯ గ్రతుతుల్యు లగునసేకపుత్రులు గలిగిరి. వారికి భార్యలుగాని, పుత్రులుగాని యెవ్వరును లేరు. వారందఱు

నూర్ధ్వరేతస్కులై యుండిరి. ఆయఱువదివేలమందియు వాలఖిల్యనామంబునఁ బ్రఖ్యాతులైరి. వారు సూర్యసారథి యగునసూరునితోఁగూడ సూర్యుని బరివేష్టించి యగ్రగమనంబు గావించుచుందురు.

అత్రి కనసూయగర్భమునుండి యైదుగురుపుత్రులును, శ్రుతి యనునొకపుత్రికయుఁ బుట్టిరి. ఆశ్రుతియే శంఖపదునకు జనని యయ్యెను. సత్యనేత్రుఁడు, హవ్యుఁడు, ఆపోమూర్తి, శనైశ్చరుఁడు, సోముఁడు ననునీయైదుగురు నత్రిపుత్రులు. స్వాయంభువమన్వంతరంబున మహాత్ములగునయ్యాత్రేయులు శతసహస్రపుత్రపౌత్రాదులచే వంశాభివృద్ధిం గావించిరి. ఊర్జయను దేవియందు వసిష్ఠుండు రజుఁడు, గాత్రుఁడు, ఊర్ధ్వబాహుఁడు, సవనుఁడు, అనయుఁడు, సుతపుఁడు, శుక్రుఁడు, ననునేడ్గురుతనయులం గాంచెను. వీరు సప్తర్షినామంబున విఖ్యాతులైరి. స్వాయంభువమన్వంతరంబున వీరినామంబులచే శతార్బుదసంఖ్యాతీతంబు లగువంశము లుత్పన్నంబు లయ్యెను. సానుబంధం బగునీఋషిసర్గ మతిసంక్షేపముగఁగాని, యతివిస్తరముగఁగాని వర్ణించుట కశక్యకమైనది.

వహ్నిదేవుండు భార్యయగుస్వాహాదేవివలన నమితతేజులగుముగ్వురు తనయులంగాంచెను. పావకుఁడు, పవమానుఁడు, శుచి, యని వారినామములు. అంతర్జన్మ్య [illegible] మానుం డనియు, వైద్యుతాగ్ని పావకుండనియు, సూర్యకిరణజన్యం బగునగ్ని శుచి యనియుఁ జెప్పంబడును. ఆముగ్వురకును గ్రమముగా హవ్యవాహుఁడు, కవ్యవాహుఁడు, సహరక్షుఁడు ననుముగ్వురుసుతు లుదయించిరి. వారు క్రమముగా దేవపితృదైత్యసంబంధనామములచేఁ బ్రసిద్ధులైరి. వారిపుత్రపౌత్రసంఖ్య నలువదితొమ్మిది. వారందఱును గామ్య, నైమిత్తిక, నిత్యకర్మంబులయందుఁ బ్రయోజనీయులైరి. అందఱును, దపస్వులు, వ్రత

ధారులు, రుద్రస్వరూపులు, రుద్రపరాయణులునై యుండిరి. అందు చేతనే యగ్నిముఖమునం దర్పించిన యఖిలపదార్థంబులును రుద్రదత్తంబు లగుచుండును.

ఇఁకఁ బితృదేవతలంగూర్చి సంక్షేపముగఁ బ్రశంసించెదను. జగత్పితృస్వరూపుఁ డగుబ్రహ్మదేవుఁడు సృష్టించుటకుఁ బ్రవృత్తుండైనసమయంబున నాతనినుండి షడృతువులు నుదయించెను. స్థానాభిమాను లగుపితృదేవతలకు ఋతువు లాశ్రయంబు లగుటంజేసి వానికిఁ బితృనామంబు విఖ్యాతం బయ్యెను. దీనికి వేదప్రమాణంబుగలదు. ఋతువులయందు స్థావరజంగమంబు లుత్పన్నంబు లగుటంజేసి వేదంబులయం దార్తవగణంబులకుఁ బితృగణంబు లనునామము నిర్దేశింపఁబడియెను. ఈవిధముగా ఋతుకాలాభిమాను లగుపితృదేవతలకు ఋతుత్వమును, ఆర్తవత్వమును, పితృత్వమును గలిగెను. అట్టియభిమానులును, మహాత్ములు నగుపితృదేవతలందఱును మన్వంతరములయందు మహైశ్వర్యసంపన్నులై గగనతలంబున నివసించి యుందురు. అగ్నిష్వాత్తులు, బర్హిషదులు నని పితృదేవత లిరుదెఱంగులవారై యుందురు. మఱియు వా రయజ్వలును, యజ్వలు నని విఖ్యాతులై యుందురు. వారందఱును గృహస్థులు. ఆపితృగణంబులవలన స్వధాదేవి లోకవిశ్రుతచరిత్ర లగునిరువు రాత్మజలం గనియెను. క్రమంబుగ వారినామంబులు మేనయు, ధరణియు నని ప్రసిద్ధము లయ్యెను. వారిరువురు నీసమస్తజగంబును ధరించియుందురు. మేనాదేవి యగ్నిష్వాత్తులకును, ధరణీదేవి బర్హిషదులకును, జనించిరి. హిమాలయపత్ని యగుమేనాదేవి మైనాకపర్వతమును, క్రౌంచపర్వతమును, శివాలింగనపావని యగు గౌరిని, గంగను బ్రసవించెను. మేరుశైలపత్ని యగుధరణి దివ్యౌషధిసమన్వితంబును, విచిత్రసుందరకందరయుతంబు నగుమందరపర్వతము

ను గనియెను. శ్రీమంతంబగు నామందరపర్వతము నిజతపఃప్రభావ
ముచే శ్రీకంఠనాథుం డగుమహాదేవున కావాసం బయ్యెను. ఆధరణీ
దేవి మరల వేళ, నియతి, ఆయతి యనుముగ్గురు పుత్త్రికలం గనియె
ను. పూర్వము స్వాయంభువమన్వంతరంబున నీనియతియు, ఆయతియు
భృగుపుత్త్రులకుఁ బత్నులైరి.

వేళాదేవి సాగరునివలనఁ బ్రాచీనబర్హికి సవర్ణయుఁ బత్నియు
నగు సాముద్రి యనుపుత్త్రికను బ్రసవించెను. ఆప్రాచీనబర్హికి సా
ముద్రివలనఁ బదుగురుతనయులు గలిగిరి. ధనుర్వేదపారగు లగువా
రందఱును ప్రాచేతసనామంబున విఖ్యాతు లైరి. పూర్వము చాక్షుష
మన్వంతరంబున మహాదేవశాపముచే దక్షుండు వీరికిఁ బుత్త్రుం డయ్యె
ను. నేనిప్పుడు బ్రహ్మపుత్త్రు లగుధర్మాదుల సకలవంశములనుగూ
ర్చియు నాతిసంక్షేపంబుగను, నాతివిస్తరంబుగను బ్రశంసించితిని.
ఆవంశములన్నియుఁ గ్రియావంతములును, బ్రజావంతములును, మహా
సమృద్ధిమంతంబులు నై విరాజిల్లుచుండెను. ప్రజాపతిమొదలుగ నుద
యించిన యీప్రజల నందఱను శతకోటివర్షంబులకైనను లెక్కింపఁ
జాలము.

ఈభూమండలమున రాజవంశములు చంద్రవంశమనియు, సూ
ర్యవంశ మనియు ద్వివిధంబుల విలసిల్లుచుండును. ఇక్ష్వాకుండు, అం
బరీషుండు, యయాతి, నహుషుండు మొదలగుపుణ్యశ్లోకులును, బవి
త్రచరిత్రులు నగుమహారాజు లీప్రసిద్ధవంశములందే జనియించిరి.
ఈవంశములందు జనించిన మహాపరాక్రమవంతులును, దపోనిధులు
నగు ననేకరాజర్షిగణంబుల చరిత్రములను బూర్వమే కీర్తించియుంటిని.
ఆపురాతనచరిత్రముల నిప్పుడు మరలఁ జెప్పుటవలనఁ బ్రయోజనంబు
లేదు. మఱియు నీశ్వరప్రసంగసమయంబున నితరవిషయంబులంగూర్చి

యుగ్గడించుట పండితసమ్మతంబు గానేరదు. ఈశ్వరకథాప్రసంగమునఁ దత్ప్రిభావద్యోతనంబునకు సృష్ట్యాదివిషయంబు లెంతవఱ కావశ్యక ములో యంతవఱకుమాత్రిమే వర్ణించుట యుచితము. అతివిస్తరంబు వలనఁ బ్రియోజనంబు లేదు.

## —♦ సతీదేహత్యాగము. ♦—

అనుటయు మహర్షులిట్లనిరి. వాయుదేవా! దక్షకన్యయగుసతీ దేవి యేకారణంబుచే దాక్షాయణీరూపంబును ద్యజించి మేనాగర్భంబు న హిమాలయపుత్రికయై జన్మించెను? మహాత్ముం డగుదక్షుండేకార ణముచే మహేశ్వరనిందనముం గావించెను. మహాదేవుం డెందుచే నిందితుం డయ్యెను? మహాదేవశాపముచే జాక్షుషమన్వంతరమునందు దక్షుండేవిధముగా జన్మించెను? ఈసమస్తవిషయంబులను సవిస్తరంబు గా మాకెఱింగింపవలయును.

అని మునిగణంబులు ప్రార్థించుటయు వాయుదేవుం డిట్లు చె ప్పందొడంగెను. మునులారా! లఘుచేతస్కుం డగుదక్షునిపాపహేతు కం బగుప్రమాదమువలనం గలిగిన దేవదూషితం బగుచరిత్రముం గూర్చి చెప్పెద నాకర్ణింపుఁడు. పూర్వకాలమునం దొకప్పుడు సకల సురాసురసిద్ధగంధర్వాదులును, మహర్షిగణంబులును మహాదేవసందర్శ నార్థమై హిమాలయశిఖరంబునకుం జనిరి. దివ్యాసనాసీనుండగుమహా దేవుండు దేవీసహితుండై యందఱకును దర్శనంబిచ్చెను. ఆసమయం బునఁ దనజామాతను, పుత్రికను గాంచవలయుననుకుతూహలముతో నమరగణంబులంగూడి దక్షుండుగూడ నచ్చటికి వచ్చియుండెను. సతీ దేవి పరమాత్మస్వరూపిణి యగుటంజేసి తనజనకుం డగుదక్షుండు వచ్చి యున్నను నాతనికి దేవతలకంటె నధికసన్మానంబులం గావింపలేదు. దక్షుం డమ్మహాదేవిదివ్యతత్త్వము నెఱుంగఁజాలక కేవలము తనపుత్రిక

మే యనుజ్ఞానముచే విముఖుండై తన్ను గౌరవించిన దనుభావముచే నాతఁ డామెయెడల వైరభావముం బూనియుండెను.

అంతట నొకప్పుడు దక్షుండు యజ్ఞదీక్షితుండై నియతివశంబున విద్వేషంబు వహించి యమ్మఖంబున కల్లుం డగుశివు నాహ్వానంబు సేయఁడయ్యెను. కాని యితరులగు నల్లుండ్రు నందఱను బిలిచి వారికందఱకును విశేషసన్మానములం గావించెను. ఆసంగతి నారదునివలన నెఱింగి సతీదేవి రుద్రునితోఁ జెప్పి పితృగృహమునకుం బ్రయాణమై సర్వలక్షణసంపన్నంబును, మనోహరంబును, గామగమనంబును, దప్తకాంచనప్రభావిలసితంబును, వివిధరత్నాలంకృతంబును, ముక్తామయచంద్రాతపవిరాజితంబును, వివిధమాల్యవిభూషితంబును, గనకమయంబును, శతసహస్రరత్నస్తంభశోభితంబును, వజ్రసోపానకలితంబును, ప్రవాళమణితోరణాలంకృతంబును నగువిమానరాజము నధిరోహించెను. మఱియు నాదివ్యవిమానంబు పుష్పమాలికలచేతను, విచిత్రరత్నాసనంబులచేతను, వజ్రజాలవాతాయనాదిమణికుట్టిమంబులచేతను, మహావృషభలాంఛితంబులును, మణిస్తంభవిలసితంబులు నగుశుభ్రపతాకలచేతను విరాజిల్లుచుండెను. రత్నకంచుకధరులును, వేత్రపాణులును, దుర్జయులు నగు గణాధిపతు లవ్విమానద్వారంబుల నధిష్ఠించి యుండిరి. మృదంగవేణుగీతవాద్యగానవిశారద లగురమణీమణు లందు విలసిల్లుచుండిరి.

సఖీజనపరివృతయై దివ్యాసనంబున నాసీనయై యున్నయాదేవదేవి కిరువంకల నిరువురు సుందరీరత్నములు నిలిచి చామరంబుల విసరుచుండిరి. ఆచామరమధ్యమునందలి యీశానీవదనము స్పర్ధయుద్ధాసక్తములగు రెండుహంసములనడుమనున్న పద్మమువలె శోభిల్లుచుండెను. ప్రియసఖి యగుసుమాలిని యనుదేవి కిరీటోపరిభాగంబున ముక్తామణిఖచితంబును, సుధాంశుసన్నిభంబు నగుఛత్రమును బట్టి యుండె

ను. ఆయుజ్జ్వలచ్ఛత్రి మాదేవివదనమండలోపరిభాగంబునఁ జంద్రోపరి
గంబునున్న వర్తులామృతభాండముంబోలి ప్రకాశించుచుండెను.
ప్రావతి యనునొకసఖి మందహాసవదనారవిందయై యాసతీదేవి నక్షు
కచే నానందింపఁజేయుచుండెను. చెలియగు పయశ యద్దేవిరత్న
పుకలను దరసమున్నతవక్షంబునం జేర్చుకొని యామెను సేవించు
చుండెను. కాంచనవర్ణ యనునొకసహచరి యారుద్రాణియెదుట నిలువు
ద్దముంబూని నిలిచి యుండెను. మఱియుఁ గొందఱుసఖీమణులు తా
వృంతంబులను, గొందఱు తాంబూలపేటికలను, గొందఱు క్రీడా
హంగములను హస్తములం దాల్చియుండిరి. కొందఱుచెలులు మనో
రసురభికుసుమంబులను, కొందఱ అమూల్యాభరణంబులను, గొందఱు
పుష్పమాల్యంబులను, గొందఱు పరిమళవిలేపనద్రవ్యములను బూని
యుండిరి. సులోచనలగు నితరసఖులు యథాయోగ్యముగ నుచితక
ర్మంబుల నిర్వహించుచు నమ్మహాదేవిని సేవించుచుండిరి.

అప్పుడాపరమేశ్వరి తారకాగణమధ్యస్థిత యగుశరత్కాలచం
ద్రరేఖయుంబోలి సఖీజనమధ్యవర్తినియై విరాజిల్లుచుండెను. అప్పుడు
శంఖధ్వని యగుటయు మహానాదసంపన్న మగుప్రయాణభేరి మ్రో
గింపఁబడియెను. తాళశబ్దంబులతో మధురవాద్యంబులును, అనాహ
తంబులగు శతసహస్రకాహళవాద్యంబులును వెలువడియెను. మహే
శ్వరసమతేజస్సంపన్నులును, అస్త్రధారులు నగునష్టోత్తరశతసంఖ్యగణా
ధ్యక్షులు ముందు నడచుచుండిరి. గజారూఢుం డగుకార్తికేయునిం
బోలి వృషభారూఢుండును, శ్రీమంతుండును, దేవవందితుండును, శివా
నందదాయకుండు నగుగణపతి వారినడుమనుండి పయనము సాగించు
చుండెను. గగనతలంబున మధురశబ్దంబులతో దేవదుందుభులు మ్రో
గుచుండ మునిగణంబు లానందముతో నృత్యము సేయుచుండిరి.

మేఘములు పుష్పవర్షముం గురియించుచుండెను. అట్లు మహోత్సాహముతో నమ్మహేశ్వరి ప్రయాణంబు చేసి మార్గమధ్యంబున లకు శుభసందర్శనంబును బ్రసాదించుచు నచిరకాల హంబును జేరుకొనియెను.

ఆమెం గాంచి దక్షుం డతికుపితుండై యామె బుగా నామెను సన్మానింపక యగ్రదేవికనిష్ఠసోదరీమణుల వింప నారంభించెను. అప్పుడు చంద్రముఖి యగునంబి తుండగుజనకుం గాంచి యత్యగ్రభావంబున యుక్త నంబులతో నిట్లనియెను. తండ్రీ! పితామహుండగుబ్ర పిశాచంబులవఱకును గలసకలజీవులు నెవ్వనియాజ్ఞలను దల చుందురో యట్టిమహాదేవుని నీవిప్పు డర్చించుట లేదు. జ్యేష్ఠపుత్రిక నగునేనిచ్చటికి వచ్చియుండఁగా నన్నుఁబలుకరింప మాని కనిష్ఠలగువీరెనందఱిని సన్మానించితివి. ఇది లోకగర్హిత గాదా? అని సతీదేవి తూలనాడుటయు దక్షుండు తనకోపము కొనఁజాలక నీకనిష్ఠసోదరీమణులు నీకంటె శ్రేష్ఠలును, వరిష్ఠ జేసి నేను వీరిని సన్మానించితిని. మఱియు వీరిభర్తలు సు నాయాదరమునకుఁ బాత్రులై యుందురు. వారు నీభర్త తృనికంటె నధికగుణవంతులు. తమోగుణయుతుండగునీపతి నాకుఁ బరమశత్రుఁడు. ఆతని నాశ్రయించిననీవును నాతిరస్కా కుఁ బాత్రురాలవు. అని నిందించెను.

ఆమాటల నాకర్ణించి సతీదేవి క్రోధావేశవివశయై దఱియెదుటను దండ్రినుద్దేశించి యిట్లనియెను. దక్షా! ఇ నేవిధంబుగను నిందించియెఱుఁగని సర్వలోకేశ్వరుండగు నాభర్తను నీవిప్పు డకారణముగ నిందించితివి. విద్యా

రుద్రోహితము, నీశ్వరదూషకులును మహాపాపాత్ములుగావున నట్టివా రు సద్యోదండార్హు లని శ్రుతులు చెప్పుచున్నవి. ఇందుకొఱ కమ్మహేశ్వరునిచే నీమహాపాపంబునకుఁ దగినశిక్ష గాఁగలదు. నీవాతనిఁ బూజింపక నిరాకరించినకారణముచే నీదుష్టకులం బంతయు వినష్టంబు గాఁగలదని నిశ్చయించుకొనుము. అని యిట్లు సతీదేవి క్రోధావేశంబునఁ బలికి మూఁదక్షుని, నాతనివలనంగలిగినయాత్మశరీరమును బరిత్యజించి హిమాలయముంగూర్చి బయలుదేఱెను. శ్రీమంతుండగు హిమాచలుండు దేవిప్రాప్తికొఱకుఁ జిరకాలమునుండి ఘోరం బగుతపంబు గావించుచుండెను. ఇప్పటి కాతనితపఃఫలంబు సిద్ధించినది. ఆతనితపఃప్రభావముచేఁ బరమేశ్వరి యనుగ్రహించి తనయోగమాయచే నాతనిముగ్ధనిం గావించి తండ్రిగాఁ జేసికొనియెను.

ఇట్లు సతీదేవి దక్షుని నిందించి శరీరమును బరిత్యజించి పోయినతోడనే భయవ్యాకులంబులై యజ్ఞవిహితంబు లగుమంత్రము లన్నియుఁ దిరోహితంబు లయ్యెను. అందుచే యజ్ఞముగూడ వినష్టంబై పోయెను. త్రిపురమర్దనుం డగుమహాదేవుండు దక్షాలయమునుండి దేవి వెడలిపోయినవార్త నాలకించి దక్షునియెడలను, మహర్షులయెడలను గుపితుండై వారికీవిధంబుగ శాపంబొసంగెను. ఓదక్షా! నీవు నామూలమున నిరపరాధయగుసతీదేవి నవమానించి తక్కినతనయలనందఱిని వారిభర్తలతోఁగూడ సన్మానించితివి గావున వైవస్వతమన్వంతరంబున బ్రహ్మయజ్ఞమునందు నీజామాతలందఱు నయోనిజులై జన్మింతురు గాక! నీవును చాక్షుషమన్వంతరంబునఁ బ్రాచీనబర్హికిఁ బౌత్రుండుగను, ప్రచేతసులకుఁ బుత్రుండుగను నృపాలుండవై జనియింతువుగాక! ఓదుర్మతీ! అప్పుడును నీధర్మార్థయుతంబులగుసకలకర్మంబులకును నామూలమున విఘ్నంబులు సంభవించుఁగాక! దక్షుం డీవిధముగా నీశ్వ

రునిచే శపింపఁబడి స్వాయంభువం బగుదేహమును విడిచి దుఃఖితుండై భూతలపతితుం డయ్యెను. అనంతర మాతఁడు చాక్షుషమన్వంతరం బునఁ బ్రాచేతసనామంబుతోఁ బ్రచేతసులకుఁ బుత్త్రుండై పుట్టెను. భృగుప్రభృతు లగుమునిగణంబులు వైవస్వతమన్వంతరంబున బ్రహ్మ యజ్ఞమునందు వారుణశరీరధారులై పుట్టిరి. వైవస్వతమనుసమయం బునఁ దురాత్ముం డగుదక్షుండు గావించు సకలకర్మంబులకును మహా దేవునిమూలమున విఘ్నములు గలుగుచుండెను.

## వీరభద్రాగమనము.

హిమాచలేంద్రుఁడు తనతపఃప్రభావముచే విశ్వమాత యగు నాదిదేవికిఁ బితృత్వముం గాంచి మహానందహృదయుండయ్యెను. హిమగిరిశిఖరవాసుం డగుమహాదేవుండును హైమవతిం బెండ్లియాడి యామెతోఁ గలసి వినోదక్రీడలం దేలుచుండెను. ఇట్లు చిరకాలంబు గడచుటయు వైవస్వతమన్వంతరం బయ్యెను. అప్పుడు ప్రాచేతసుం డగు దక్షుం డశ్వమేధయాగంబు గావించుటకు సంకల్పించి సిద్ధగణసేవితం బగు గంగోత్పత్తిస్థానంబున, హిమాలయశుభోపరిభాగంబున యజ్ఞాను ష్ఠానముం గావించి యుండెను. ఆదిత్యవసురుద్రగణంబులును, సాధ్యగణంబులును, మరుత్సోమపితృగణంబులును, ఆజ్యపధూమపగణంబులును, అశ్వినీకుమారులును, దదితరమహర్షిగణంబులును విష్ణుసహితం బుగా యజ్ఞభాగా[illegible]మునకు విచ్చేసి యుండిరి. అట్లు వా[illegible] యేతెంచియుండుటంగాంచి దధీచి [illegible] దక్షునుద్దేశించి యిట్లనియెను.

[illegible] [illegible]జించువారికిని, బూజ్యులను బూజింపని[illegible] [illegible]ట కెట్టిసంశయమును లేదు. దుర్మార్గులకు సన్మానమును, సన్మార్గులకుఁ బరాభవంబును గలుగువో

ట నాక్షణమునందే దైవకృతంబగుదారుణదండనము గలుగకమానదు. సమస్తజగత్ప్రభుండును, బరమపూజ్యుండును, బశుపతియు నగుమహాదేవుని నీ వేకారణముచేఁ బూజింపకుంటివి?

అని బ్రహ్మర్షియగుదధీచి యుగ్గడించుటయు దక్షుండు మునీంద్రా! త్రిశూలధరులును, గపర్దులు నగునేకాదశరుద్రులను నేనెఱుంగుదును. వారికంటె భిన్నుండగుమహేశ్వరుఁ డెవ్వఁడో నేనెఱుంగ నని చెప్పెను. అప్పుడు దధీచి దృఢస్వరముతో నీయజ్ఞమునం దీసకలరుద్రులను, వచ్చినయీసకలదేవతలను బూజించుటవలన నేమిలాభము? నీ విప్పుడు యజ్ఞరక్షకుం డగురుద్రుని బూజించుట లేదు. అవ్యయుండును, సర్వలోకప్రభుండును, బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు స్రష్టయు, బ్రహ్మాదిపిశాచపర్యంతముం గలయెల్లవారిని దనభృత్యులుగా గ్రహించినవాఁడును, బ్రకృతిపురుషులకుఁ బరుండును, యోగశాస్త్రవిశారదులును, దత్త్వజ్ఞులు నగుమహర్షులచే నిరంతరచింతితుండును, అక్షరుండును, అసత్స్వరూపుఁడును, సదసత్స్వరూపుఁడును, పరబ్రహ్మస్వరూపుఁడును, ఆదిమధ్యాంతరహితుండును, అప్రతర్క్యుండును, సనాతనుండును, స్రష్టయు, సంహర్తయు, భర్తయు నగుమహాదేవుండుగాక యజ్ఞంబులకు శుభఫలదాయకుం డింకెవ్వఁడని నీవు తలంచితివి?

అనుటయు దక్షుండు సవ్వచు నప్రతిమప్రభావుండగునీవిష్ణుదేవుఁడే యీయజ్ఞంబున కధీశ్వరుఁడు. నేనిప్పుడు విధిపూర్వకంబులగు మంత్రంబులచేఁ బవిత్రింబును, ఆహావనీయంబును నగుహవిస్సును సువర్ణపాత్రమునందుంచి యుంచి యజ్ఞభాగము నీయజ్ఞేశ్వరునకే సమర్పించెద నని చెప్పెను. ఆమాట విని దధీచి మునీంద్రుం డోహో పాపాదక్షా! సర్వదేవేశ్వరుం డగుమహాదేవు నర్చింపనికారణంబుచే నీయజ్ఞము సంపూర్ణంబు గానేరదని క్రోధోద్రేకముచేఁ బలుకుచుఁ దక్షుణంబ య

మ్మఖశాలవెలువడి తనయాశ్రమంబునకుం బోయెను. అట్లు దధీచి కోపముతో వెడలిపోవుటయు భావ్యర్థం బవశ్యఘటనీయంబని నిశ్చయించియు దేవతలందఱును దక్షుని ద్యజింపఁజాలక నిలిచియుండిరి.

ఈవృత్తాంతమంతయు నాకర్ణించి మహాదేవి దక్షయజ్ఞవిధ్వంసనార్థమై మహాదేవుని బ్రోత్సహించెను. అప్పుడు మహేశ్వరుండు దేవిచేఁ బ్రేరితుండై దక్షమఖవిధ్వంసనోద్దేశముతోఁ బ్రబలపరాక్రముండగు వీరభద్రుం డను గణాధ్యక్షుని సృష్టించెను. ఆవీరభద్రుండు మహా[illegible], సహస్రాక్షుండును, ముద్గరశరకార్ముకసహస్రధారియునై ప[illegible]చుండెను. మఱియు నాతఁడు గదాఖడ్గత్రిశూలహస్తుండును, బాలచంద్రావతంసుండును, వజ్రోద్భాసితకరుండును, వి[illegible]కలాపుండును, కరాళదంష్ట్రుండును, విద్యుజ్జిహ్వుండును, ప్రలంబోష్ఠుండును, మేఘసాగరనిస్వనుండును, వ్యాఘ్రచర్మాంబరుండును, కుండలపరిభాసితగండమండలుండును, శ్రేష్ఠామరకపాలమాలికాలంకృతశేఖరుండును, రణన్నూపురకేయూరాదిభూషణభూషితుండును, రత్నాలంకారపరిదీప్తుండును, తారహారావృతవక్షోభాగుండును, మహాశరభశార్దూలసింహసదృశవిక్రముండును, మదగజమంథరగమనుండును, శంఖచామరకుందేందుపరిభావిలసితుండునునై తుషారాచ్ఛన్నం బగుజంగమపర్వతముం బోలి యుండెను. ఆతనినలుదెసల నగ్నిశిఖాసదృశం బగుతేజఃపుంజము విస్తృతం బగుచుండెను. ముక్తామణిహారంబులచే నాతనిదేహ మలంకృతమై యుండెను. అందుచే నాతఁడు ప్రళయకాలానలముం బోలి దేదీప్యమానుండై యుండెను.

అప్పు డాగణాధ్యక్షుండు భూతలంబున మోకరించి కృతాంజలియై పరిణామపూర్వకంబుగ నమ్మహేశ్వరునిపార్శ్వంబున నిలిచియుండెను. ఆవీరభద్రుండు తనకుఁ గర్మసాక్షిస్వరూపిణియు, సహచారిణియు

ఁగను మహేశ్వరిభద్రకాళిని దనక్రోధమునుండి సృష్టించెను. అంతశంక రుండు కాలాగ్నిసన్నిభుండగువీరభద్రుని భద్రకాళీసహితంబుగఁ గాంచి మీకు భద్రం బగుఁగాక యని యాశీర్వదించెను. అప్పుడు దేవీసహితుం డగువీరభద్రుండు మహాదేవుం గాంచి దేవదేవా! నేనేమి చేయవలయునో యాజ్ఞాపింపుమని ప్రార్థించుటయుఁ ద్రిపురహరుం డయగునీశ్వరుండు పార్వతీప్రియంబు నెఱవేర్పందలంచి యోగీశ్వరా! నీవు భద్రకాళీసహితుండవై పోయి దక్షాధ్వరవినాశంబు గావింపుము. నేనును పార్వతీసహితుండనై యాశ్రమసమీపమునం దుండి మీదుస్సహవిక్రమముం గాంచుచుండెదను. సువర్ణశృంగంబున గంగాద్వారసమీపంబున మేరుమందరసదృశమహీరుహంబులచే విలసిల్లు కనఖలక్షేత్రంబున నిప్పుడు దక్షయజ్ఞంబు జరుగుచున్నది. నీవతిశీఘ్రముగఁ బోయి యమ్మఖధ్వంసంబు గావింపుము. ఆలస్యము చేయవలదని యాజ్ఞాపించెను.

అనంతరము హిమాచలతనయ, ధేనువు వత్సముంజూచుపోలిక భద్రకాళీసహితుం డగువీరభద్రుం దిలకించి షడాననుం డగుకుమారునింబోలి మూర్ధాఘ్రాణంబు గావించి మందహాసంబు సేయుచు మధురస్వరముతో నిట్లనియెను. వత్సా! మహాబలపరాక్రముండ వగు భద్రా! నీవు నాకుఁ బ్రియంబు గావించుటకై యుదయించితివి. కావున నాదుఃఖమును దూరముచేయుము. దక్షుండు వైరభావముతో యజ్ఞేశ్వరు నాహ్వానింపక యజ్ఞకర్మరతుండై యున్నాఁడు. నీవు గణేశ్వరసహితుండవై పోయి యమ్మఖభంగంబు గావింపుము. నీవు నా యాజ్ఞం దలఁదాల్చి భద్రాసహితంబుగఁ బోయి యాయజ్ఞలక్ష్మి నలక్ష్మిం గావించి యజమానుని నిహతుం గావింపు మనిబోధించెను.

వీరభద్రుండును పార్వతీపరమేశ్వరులయాజ్ఞలను బుష్పమాలిక

లంబోలి మస్తకంబునం దాల్చి వారికి నమస్కారంబు గావించి ప్రయా ణం బయ్యెను. అనంతరము దేవీదుఃఖనాశకుండును, శ్మశానవాసియు, వీరభద్రరూపుండు నగుమహాదేవుండు క్రుద్ధుండై తనరోమకూపంబుల నుండి రోమజులను ననేకగణేశ్వరులను, దక్షిణబాహువునుండి శతకోటి గణేశ్వరులను వామబాహువునుండి రుద్రసదృశపరాక్రమవంతులును, భీకరదర్శనులును, దారుణకర్ములును, సపత్నీకులు నగుసర్వతోభద్రుల ను సృజించెను. ఇట్లే యాతఁడు తనపాదములనుండియు, ఊరువులనుం డియు, పృష్ఠమునుండియు, పార్శ్వములనుండియు, ముఖమునుండియు, గళప్రదేశమునుండియు, గుహ్యమునుండియు, శిరోమధ్యమునుండియు, కంఠమునుండియు, వదనమునుండియు ననేకగణేశ్వరులను సృష్టించెను.

అప్పుడు వీరభద్రతుల్యులగుభద్రగణేశ్వరులమూలంబున సకల జగంబులు నాచ్ఛన్నంబు లయ్యెను. వారందఱును సహస్రహస్తులును, సహస్రాయుధధారులును, రుద్రానుచరులును, రుద్రపరాక్రములును, శక్తిశూలగదాఖడ్గశిలాధరులును, కాలాగ్నిసదృశులును, త్రిలోచనులును, జటాధరులును నై యుండిరి. వీరభద్రజాతు లగునాగణేశ్వరు లందఱు ను సింహారూఢులై మేఘంబులంబోలి గర్జించుచుండిరి. భగవానుం డగువీరభద్రుం డాభద్రగణంబులచేఁ బరివేష్టితుండై కాలానలశతపరి వృతుండగు కాలభైరవునింబోలి విరాజిల్లుచుండెను. వారినడుమ వృ షభధ్వజుండగువీరభద్రుండు వృషభారూఢుండై మేఘారూఢుం డగు మహాదేవుంబోలి ప్రయాణము సేయుచుండెను. భసితప్రభుండను గణేశ్వరుఁ డొకచేతితో నాతనికిఁ జామరమును విసరుచు మఱియొక చేతితో ముత్యాలగొడుగు పట్టియుండెను. అప్పు డావీరభద్రునిపా ర్శ్వంబుననున్న భసితప్రభుండు విశ్వగురుండగుమహాదేవునిపార్శ్వము నందుండు హిమాచలేంద్రునిం బోలి యుండెను. శుభ్రసౌమ్యచామర

హస్తుండగు భసితప్రభునితోఁ గూడియున్న వీరభద్రుఁడు కేవలము మహాదేవునివలె విరాజిల్లుచుండెను.

మహాతేజుండగు భానుకంపుం డనుగణేశ్వరుఁడు వీరభద్రునిముందు నిలిచి మణిసోమమయంబగు శంఖమును బూరించుచుండెను. ఆకాశమున దేవదుందుభులు మ్రోఁగుచుండెను. జలధరంబులు మాటిమాటికిని బుష్పవృష్టిం గురియించుచుండెను. మార్గమునందు మకరందకలితవికచకుసుమసౌరభంబులతో ననుకూలపవనంబులు వీతెంచుచుండెను. మహోన్మత్తులగు గణేశ్వరులు మహోత్సాహయుక్తులై తమతమపరాక్రమోద్ధతిం జూపుచు నానందనృత్యములం గావించుచు, సింహనాదములుసేయుచు, హసించుచుఁ బరస్పరోత్సాహదాయకులై గానముసేయుచుండిరి. ఆవీరగణమధ్యస్థితులగు భద్రకాళీవీరభద్రులు రుద్రగణమధ్యవర్తులగు పార్వతీపరమేశ్వరులం బోలి శోభిల్లుచుండిరి.

అట్లు ప్రయాణంబు సాగించి వీరభద్రుండు తుణహాత్రింబున హిరణ్మయంబగు దక్షయజ్ఞశాలం బ్రవేశించెను. ప్రళయకాలంబున విశ్వదహనంబు గావించుటకై ప్రవేశించిన మహాకాలుండునుం బోలి వీరభద్రుండు దక్షునిప్రధానయజ్ఞానుష్ఠానభూమియందుఁ బ్రవేశించెను.

—♦ దక్షాధ్వరధ్వంసము. ♦—

అమితతేజులగు విష్ణుప్రభృతిసకలదేవతలయు విచిత్రధ్వజమండపంబులచేఁ బరిశోభితంబగు మహాయజ్ఞమును వీరభద్రుఁడు సందర్శించెను. ఆయజ్ఞమునందు శుభకరంబులగు కుశలు ఋజుభావముతో నాస్తీర్ణములై యుండెను. అగ్ని బాగుగఁ బ్రజ్వలించుచుండెను. యజ్ఞభూమి యంతయు సముజ్జ్వలంబు లగు కాంచనపాత్రలచే నలంకృతమై యుండెను. యజ్ఞకర్మనిపుణులును, యజ్ఞోచితకర్ములు నగు ఋషులచే విధిపూర్వకంబుగ బహువిధక్రియలు నిర్వర్తింపఁబడుచుండెను. అనం

ఘృతాప్సరోగణసంగీతంబులచేతను, వేదపాఠంబులచేతను యజ్ఞశాలయం
తయు మాఱుమ్రోఁగుచుండెను. అదియంతయుం గాంచి ప్రతాపశాలి
యు వీరశ్రేష్ఠుండును నగువీరభద్రుండు సింహనాదంబు సేయుటయు గ
ణేశ్వరులందఱు నాయజ్ఞశాలయందు గగనవిదారితంబులును, సాగర
గంభీరంబులు నగుకిలకిలారావంబులఁ గావింపం దొడంగిరి. ఆదారుణా
రావంబుల నాకర్ణించి సకలదేవతలును భయభ్రాంతులై తత్తఱము
తో వసనభూషణాదులు విస్రస్తంబులగుచుండ నలుదెసలకును బరుగు
లెత్త నారంభించిరి.

మేరుశైలము విభిన్నం బయ్యెనో, భూమండల మాకస్మికము
గ విదీర్ణంబయ్యెనో యని దేవతలందఱును దల్లడిల్లుచుండిరి. వనంబున
మృగేంద్రగర్జనము నాలించి భయంబుచే గజగణంబులు ప్రాణంబుల
విడుచునట్లాభయంకరధ్వనులనాలించి కొందఱుదేవతలు గతాసులై
పోయిరి. ఆదారుణారావంబునను సకలపర్వతములును విదీర్ణములయ్యె
ను. భూమండలము పరికంపితమయ్యెను. వాయువులు విజృంభింపఁ
దొడఁగెను. సకలసముద్రంబులును సంక్షుభితంబు లయ్యెను. అగ్ను
లు జ్వాలాశూన్యంబు లయ్యెను. సూర్యచంద్రగ్రహనక్షత్రములు
ప్రభావిహీనములై పోయెను.

అప్పుడు మహావీరుం డగువీరభద్రుండు భద్రకాళీభద్రగణ
సహితుండై యజ్ఞశాలం బ్రవేశించుటం గాంచి దక్షుండు మనంబున
భయభ్రాంతుం డయ్యును నైక స్థైర్యమును బ్రకటించుచుఁ గ్రుద్ధస్వ
రముతో "ఎవరు మీరు? ఇచ్చటి కేలవచ్చితిరి?" అని యదలించెను.
ఆదక్షునివాక్యంబు లాలించి మహాతేజుం డగువీరభద్రుండు మందహాస
ము సేయుచు దక్షునివంకను, దేవగణంబులవంకను, ఋత్విగ్గణంబుల
వంకను దృష్టిపాతంబు సేయుచు గంభీరము సుస్పష్టభాషణముతో మేఘ

గంభీరస్వరంబున నిట్లనియెను. మేమందఱము నమితతేజుం డగుమహా దేవుని యనుచరులము. యజ్ఞభాగంబుల నపేక్షించి యిచ్చటికి వచ్చితిమి. మాయజ్ఞభాగములను మాకిర్పింపవలయును. ఈయజ్ఞమునందు మానిమిత్తమై యుచితభాగంబులు రక్షితంబులై యున్నవా? లేకున్నచో నట్లులేకుండుటకుఁ గారణముం దెలుపుఁడు. అట్లు చేయుట మీకిష్టంబు లేదేని మాతో యుద్ధము చేయుఁడు.

అర్థవంతరంబులును, సముచితంబు . . గుపసంభ్రమ వచనంబుల నాకర్ణించి దక్షప్రముఖు లగుదేవగణంబులు మంత్రిగణంబుల నుద్దేశించి మీరీవిషయంబున ధర్మనిర్దేశంబు గావింపవలయు నని కోరిరి. అప్పుడు మంత్రిగణంబు లోదేవతలారా! మీచిత్తంబు లజ్ఞానాచ్ఛాదితములై పోయినవి. కావుననే మీరీయజ్ఞమునందుఁ బ్రథమభాగార్హుం డగుమహేశ్వరు నర్చించుట మానితిరి. అని బోధించినను, మూఢచిత్తు లగుదేవతలు వీరభద్రప్రహారాభిలాషులై వారికి యజ్ఞభాగంబుల నర్పింపకుండిరి. సత్యంబును, హితకరంబు నగుతమప్రబోధనంబు విఫలం బగుటచే మంత్రిగణంబులు కోపించి యాయజ్ఞశాలం బరిత్యజించి సనాతనం బగుబ్రహ్మలోకమునకుం బోయిరి. అప్పుడు గణాధ్యక్షుం డగువీరభద్రుండు విష్ణుపురస్సరు లగుదేవతల నందఱను సంబోధించి మీరందఱు నాత్మబలగర్వితులై మంత్రిగణంబులప్రబోధమును బ్రమాణముగా నంగీకరింపకుంటిరి. ఓదేవతలారా! మీరందఱు నీయజ్ఞమునందు మమ్మిట్టివిధముగా నవమానించితిరి. కావున నిఁక మీప్రాణములతోఁగూడ మీగర్వములు దూరము లగుఁగాక! అని క్రోధావేశముతోఁ బలుకుచుఁ బూర్వము మహాదేవుండు త్రిపురదహనముం గావించినవిధంబున బహువిధాన్నాదిసమస్తపదార్థంబులతోఁ గూడ నయ్యజ్ఞవాటమును దననేత్రానలంబుచే భస్మీభూతముం గావించెను.

అప్పుడు పర్వతాకారమహాకాయులగు గణేశ్వరులు విజృంభించి [illegible] తాటితంబులుగను, రజ్జువులచే హోత్రుకంఠంబు [illegible] యజ్ఞపాత్రంబుల విచూర్ణంబులుగను [illegible] ంబులను గంగాజలనిమగ్నములుగాఁ జేయ [illegible]. మఱియు సర్వీరగణంబులు బహువిధసుగంధభక్ష్యంబుల భుజించుచు, సుస్వాదుపానీయ, లేహ్య, చోష్యంబుల నారగించుచు నెల్లవస్తువులను జిందఱవందఱగఁ జేసివైవఁదొడంగిరి. బలవంతులగు సర్వీరగణంబులు వజ్రచక్రత్రిశూలశక్తిప్రాసముసలఖడ్గాదిసాధనంబుల గరంబులం దాల్చి క్రోధోద్ధతులై లోకపాలప్రముఖులగు దేవగణంబులఁ జీల్చి చెండాడుచు "కొట్టుఁడు! చంపుఁడు!" అని బొబ్బలు పెట్టుచుండిరి. మహారణోచితంబులును, క్రోధోత్పన్నంబులు నగు నాదారుణాలాపంబులచే నలుదెసలును బ్రతిధ్వనించుచుండెను. కొందఱు విస్ఫారితనేత్రులై దంతంబులచే నోష్ఠతాలుదంశనంబు గావించుచు నాశ్రమస్థులగు [illegible] దఱిమికొట్టుచుండిరి. మఱియు వారిస్రువంబుల నపహరించి [illegible] యందుఁ బాఱవైచుచుండిరి. వారిట్లు [illegible] లవస్తువుల నతలకుతలంబులుగఁ జేయుచు [illegible] జేసివైచుచుండిరి. సింహపరాక్రములగు [illegible] హితంబుగ దేవతలనందఱను మథించి రక్తాసవపానవినోదంబులఁ దేలియాడుచుండిరి. అమితప్రభావసంపన్నులగు వారట్లతిభయంకరకృత్యములం గావించుచు, నృత్యము సేయుచు శత్రువులను బరిహరించుచుఁ బారఁద్రోలుచు, నున్మత్తవిహారము గావించుచుండిరి. అందుఁ గొందఱు మదోన్మత్తులై నృత్యములు సేయుచుండిరి. కొందఱట్టహాసములం గావించుచుండిరి. కొందఱు పరుగులువారుచుండిరి. కొందఱు జలధరపటలంబులను తాటితంబుల

గఁ జేయఁ జూచుచుండిరి. కొందఱాకసంబున కెగసి సూర్యదేవుని గ్రహింపఁజూచుచుండిరి. గారుడవిహంగములు భుజంగములం దాల్చి నవిధంబునఁ గృపాణపాణులై కొందఱు గగనతలంబున వాయువేగంబున సంచరించుచుండిరి. కొందఱు దేవతాగణంబులను గగనవీథులఁ బాఱఁదోలుచుండిరి. కొందఱు ద్వారజాలకవేదికాసహితంబుగ గృహంబులను శకలించివైచుచుండిరి. ప్రళయకాలజలధరంబులంబోలి యాప్రమథగణంబు లాసకలగృహంబులను జలనిక్షిప్తంబులుగఁ జేయుచుండిరి. అట్లు ప్రమథగణంబుల దారుణకృత్యంబులచే ద్వారకవాటసద్యంబు లుద్వర్తితంబులై, శాలావలభీగవాక్షాదులు విధ్వస్తంబులగుటయు నయ్యజ్ఞవాటం బనాప్తవాక్యంబునుంబోలి యప్రశస్యంబై పోయెను. ఇట్లు గృహంబులన్నియు వినాశంబునందుటయు నారీమణులు భయభ్రాంతలై “హానాథా! హాతండ్రీ! హాతాతా! హాభ్రాతా! హాజననీ! హామాతులా!” అని యీవిధముగా సంబోధించుచు నార్తనాదములఁ గావింపనారంభించిరి.

—♦ విష్ణుప్రమథగణంబులయుద్ధము. ♦—

అప్పుడు విష్ణుండును, మహేంద్రప్రభృతి సకలదేవతలును భయార్తులై పలాయనంబు గావింపందొడంగిరి. వందార్హులగు దేవతలలోఁ గొందఱు నక్షతశరీరులై యెట్లో పాఱిపోవలెంచుటంగాంచి రోషముప్పొంగ కోపోద్రిక్తుండై సర్వశక్తివినాశకం బగుత్రిశూలకంబుం దాల్చి యూర్ధ్వంబునకు దృష్టినిగుడించి, వదనంబునుండి యనలజ్వాలలం గ్రక్కుచు నరించుచుఁ బంచాననము మదగజబృందంబులం బోలి యాదేవతలను దఱుమ నారంభించెను. అప్పు డాతనిగమనంబు మదగజగమనంబునుంబోలి యతిమనోహరమై యుండెను. అట్లు వీరభద్రుండు మదమాతంగము మహాసరోవరంబునుంబోలి యతితరం బగుదేవసైన్యమును సంక్షుభిత

ముగాఁ జేసినవాఁడై, ఛేదితులును, పీడితులును, క్రందితులును, విదారితులును, మథితులు నగునా దేవతలసమూహముసమునఁ దృణసమూహంబుననుమ వెలుంగు మహానలుండునుంబోలి విజృంభించుచుండెను. ఆతఁడు త్రిశూలధారియై వాయువేగంబుతో రణరంగమున విహరించుచున్నప్పుడు దేవతల కాతనియేకమూర్తి వేయిమూర్తులుగా గోచరించు చుండెను.

మహారణమదోద్ధత యగుభద్రకాళియు మహాక్రోధావిష్టయై రణస్థలంబున ముక్తామణిసముజ్జ్వలం బగుత్రిశూలంబుచే దేవతాగణంబులను నిర్భిన్నులం గావింపఁదొడంగెను. రుద్రక్రోధసంజనితుం డగు వీరభద్రుం డప్పుడు భద్రకాళీసహితుఁడై, చంచలధూమధూమ్రం బగునాత్మప్రభతో వెలుంగుప్రళయకాలానలుండునుంబోలి శోభిల్లుచుండెను. దేవగణక్షోభప్రదకారిణి యగుభద్రకాళియు, విశ్వవినాశంబు గావించు కల్పాంతానలజ్వాలంబోలి భీకరస్వరూపిణియై యుండెను. అప్పుడు రుద్రగణాగ్రణి యగువీరభద్రుండు హయసహితుం డగుసూర్యుని, రుద్రగణంబులను వామపదాహతులం గావించి పరాభవించి ఖడ్గంబుచే నగ్నిని, ఖడ్గసంబుచే యముని, దృఢశూలంబుచే రుద్రులను ముద్గరంబుచే వరుణుని, పరిఘామూలంబున నిర్ఋతిని, టంకంబుచే వాయువును విభిన్నులం గావించెను. అనంతరము దీప్తిమంతుం డగువీరుండు తననఖాగ్రంబులచే వేదమాత యగుసరస్వతీదేవి శుభదాయకం బగునాసాగ్రమును ఛేదించివైచెను. మఱియు నాతఁడు కుఠారంబుచే విభావసునిబాహుదండంబును, హవ్యాస్వాదనోపయుక్తంబగు నంగుళిద్వయపరిమితజిహ్వాగ్రంబును ఛేదించివైచెను. అట్లే తననఖాగ్రంబులచే స్వాహాదేవిదక్షిణనాసాపుటంబును, వామస్తనమాచుకంబును జిదిమివైచెను. మఱియు నాతఁడు భగునినిశాలనయనపద్మంబులను బెకి

లించి తనధనుష్కోటిచే ముక్తామణిసన్నిభంబు లగుపూషునిదంతముల నుత్పాటితంబులుగాఁ జేసివైచెను. ఆకారణముచేతనే పూషుం డప్పటినుండి దంతహీనుం డయ్యెను.

అనంతర మాతఁడు చంద్రునిం బట్టి క్రిందఁబడవైచి తనపదాంగుళులచేఁ గ్రిమింబోలి నలిపివైచెను. పిమ్మట నమ్మహావీరుండు దక్షమస్తకచ్ఛేదంబు గావించి దక్షపత్నులరోదనధ్వనులను జెవిని బెట్టకయే యాశిరంబును దెచ్చి దేవి యగుభద్రకాళి కుపహారంబు గావించెను. తాళఫలసదృశంబగునమ్మస్తకమును జేతఁబూని భద్రకాళియు మహానందముతో రణరంగమునందుఁ గందుకక్రీడం గావింపనారంభించెను. అప్పుడు గణేశ్వరులందఱును జేరి దక్షపత్నులనాక్రమించి దుశ్శీలలగు భార్యలను భర్తలుపరిహరించువిధంబున నిర్దయులై ప్రహరింపనారంభించిరి. మఱియు వా రుద్ధతులై సింహపరాక్రమంబుఁ జూపుచు, అరిష్టనేమి, సోముఁడు, ధర్ముఁడు, ప్రజాపతి, బహుపుత్రుండగునంగిరుఁడు, భృంగాశ్వుఁడు, కశ్యపుఁడు మొదలగువారిగళంబుల బిగించిపట్టి తిరస్కారవచనంబులచేఁ బరాభవించుచు వారిమస్తకంబులపై ముష్టిప్రహారంబులఁ గావింప నారంభించిరి. కలియుగంబున బలవంతులగు జారులచేఁ గులవధూగణంబులుంబోలి యాగణాధ్యక్షులచేఁ దాళవైతాళాదిగణంబులు పుత్రవధూసహితంబుగఁ బరాభూతులైరి.

ఇట్లు గణాధ్యక్షులచే వినష్టం బగుయజ్ఞవాటంబు పరిధ్వస్తంబు లగుకలశంబులతోడను, భగ్నంబు లగుయూపంబులతోడను, వినష్టంబులగునుత్సవంబులతోడను, దగ్ధంబు లగువిశాలగృహంబులతోడను, విభిన్నంబు లగుతోరణద్వారములతోడను, ఉత్పాటితంబు లగుదేవసైన్యంబులతోడను, ఉత్పీడితంబు లగుఋషిగణంబులతోడను, ప్రశాంతంబులగుబ్రహ్మఘోషంబులతోడను, ప్రక్షీణంబులగుపరిచారక

ప్రేతకగణంబులతోడను, రోరుద్యమానంబులగు స్త్రీసమూహంబుల తోడను, విదూషితంబు లగుసకలోపకరణంబులతోడను, శూన్యారణ్య ముంబోలి చూపట్టుచుండెను. త్రిశూలాఘాతంబులచే విభిన్నంబు లగునూరుబాహుమస్తకంబులు గలిగి దేవతాగణంబులు భూపతితు లగుచుండిరి. ఈరీతిగా నేలకూలఁదిదేవతలు ధరణీతలంబునం బడిపోవు టయు సర్వగణేశ్వరుం డగువీరభద్రుం డొక్కక్షణంబులో మరల య జ్ఞశాలం బ్రవేశించెను.

ప్రళయానలాకారుం డగునాతనిం గాంచి యజ్ఞపురుషుండు మృగరూపముం దాల్చి పలాయితుం డగుచుండుటయు ధనుర్ధరుండగు వీరభద్రుండు భీషణంబుగ గుణధ్వానంబు సేయుచు శరసంధానంబు గావించి యాతని వెంబడించి తఱుమ నారంభించెను. ఆకర్ణాకృష్టం బగునాతనికార్ముకంబునుండి వెలువడుగుణధ్వని భూమ్యాకాశములఁ బ్రతిధ్వనించుచుండెను. వీరభద్రుం డాయజ్ఞపురుషు నట్లు తఱిమితఱి మి పోయి యతినిశితంబగు నొకయర్ధచంద్రబాణముచే "చచ్చితిని; చచ్చితిని." అని ప్రలపించుచున్న యాతనియుత్తమాంగము నొక్కపెట్టున విచ్ఛేదంబు గావించెను. సూర్యాత్మజుం డగుయజ్ఞపురుషుం డట్లు హతుం డగుటం గాంచి విష్ణుదేవుండు మహాక్రోధపరవశుండై యుద్ధంబునకుద్యుక్తుం డయ్యెను.

అప్పు డాతఁడు పక్షీంద్రుండును, బన్నగాశనుండును, మహావే గుండు నగుగరుడునిమూపుపై నధివసించి హతశేషులగు దేవతలను, దేవేంద్రుని గూర్చుకొని యుద్ధసన్నద్ధుండై యుండెను. సృగాలపరివృ తం బగువ్యాఘ్రముం గాంచినసింహముంబోలి భూతపతి యగువీరభ ద్రుండు దేవగణసహితుం డగువిష్ణుదేవుం గాంచి యలక్ష్యముగా హ సింప నారంభించెను. అప్పు డతిరమణీయంబును, వృషభధ్వజవిలసితం

బును, సహస్రసూర్యప్రభాసమానంబు నగునొకదివ్యరథం బాకాశము నుండి యావిర్భూతం బయ్యెను. అది యుత్తమాశ్వద్వయసంయోజితంబును, చతుశ్చక్రవిలసితంబును, దివ్యాస్త్రసంచితంబును. పూర్వము త్రిపురమథనసమయంబున మహాదేవునకు సారథ్యంబు గావించి యాతఁడే యిప్పు డారథంబునకు సారథియై [illegible]

యగుబ్రహ్మదేవుండు మహాదేవునాజ్ఞచే నారథంబును విష్ణుండు చూచు చుండ వీరభద్రునిసన్నిధికిం దీసికొనిపోయి మహాత్మా! సుందరవిశాలలోచనా! వీరభద్రా! భగవానుండును, అవ్యయుండును, కాలేంద్ర భూషణుండు నగుదేవదేవుండు నిన్నీరథంబు నధిష్ఠింపు మని యాజ్ఞాపించి యున్నాఁడు. ఆదేవుం డంబికాసహితుండై కైలాసశ్రీమత్సమీపమునందు నివసించి దుస్సహంబగు నీపరాక్రమం బంతయు నవలోకించు చున్నాఁ డని విన్నపంబు చేసెను.

రణకుంజరుం డగుభద్రుం డావచనంబుల నాకర్ణించి బ్రహ్మ మొదలఁ బ్రసన్నుండై రథారోహణంబు గావించెను. బ్రహ్మసారథికం బగునారథంబునందున్న వీరభద్రుండు త్రిపురసంహారోద్యుక్తుం డగు మహాదేవునిం బోలి శోభిల్లుచుండెను. అప్పుడు భానుకంపుండు కుందేందుసన్నిభప్రభామయం బగునుత్తమశంఖమును మ్రోగించుటయు సంక్షుభితసాగరఘోషమును బోలి యున్నయాదారుణశంఖారావము నాకర్ణించి సకలదేవతలును భయభ్రాంతులై పోయిరి. రణసందర్శన కుతూహలంబుచే నాగయక్షగంధర్వసిద్ధసాధ్యాదిగణంబు లొక్కనిమిషములో గగనతలం బంతటను నిండిపోయిరి. అప్పుడు శార్ఙ్గం బనునిం ద్రధనువుం దాల్చిన నారాయణుం డనునీలమేఘము శరపరంపరలను వర్షధారలచే గణేశ్వరు లనువృషభములను బీడింప నారంభించెను. అట్లు పరాక్రమించుచున్న విష్ణుదేవునిం గాంచి వీరభద్రుండు సహస్ర

శరమోచనక్షమంబగు విజయకార్ముకముం దాల్చి మేరుధనుర్ధరుండగు
మహాదేవునిం బోలి బ్రహ్మాండము కంపించునట్లు గుణధ్వానంబు గా
వింప నారంభించెను. అనంతర మత్యుగ్రప్రతాపుం డగునాగణాధ్య
క్షుండు ప్రదీప్తం బగుసర్పముఖశరంబును వింట సంధించుటయు నాతని
హస్తమునం దాబాణము విశాలోరగవదనమునందలి క్షుద్రసర్పాకృతిం
దాల్చియుండెను. భద్రుం డతిక్రోధముతో నతితీక్ష్ణంబగు నాదివ్య
శరంబును బ్రయోగించి విష్ణుదేవునిలలాటప్రదేశమును విద్ధంబు గావిం
చెను. అందుచే విష్ణుండు సింహాధిక్షిప్తం బగు వృషేంద్రంబునుం
బోలి క్రుద్ధుండై భీషణముఖంబును, వజ్రకల్పంబు నగు మహాబాణ
ముచే వీరభద్రునిభుజంబును ఛేదించెను.

వీరభద్రుండును మరల నయుతసూర్యప్రభామయంబగు నొక
బాణముచే విష్ణుదేవునిభుజంబును నొప్పించెను. ఇట్లయ్యిరువురు నొండొ
రులపై దివ్యాస్త్రంబులఁబ్రయోగించుకొనుచుఁ దుములసంగ్రామము
సేయందొడంగిరి. పరస్పరజయార్థులై యిట్లు పోరాడుచున్నయామహా
యోధులం గాంచి గగనతలంబునయున్న ఖేచరగణంబులు హాహాకార
ములం గావింప నారంభించిరి. అప్పుడు వీరభద్రుం డాదిత్యసంకాశం
బును, అగ్నిముఖంబు నగుదివ్యాస్త్రముం బ్రయోగించి యతిదృఢం
బుగ నవ్విష్ణుదేవుని విశాలవక్షమును భేదించుటయు నారాయణుం డా
తీవ్రశరాఘాతంబుచే వ్యథితుండై మూర్ఛిల్లి యంతలోనే చైతన్య
ముం గాంచి లేచి క్రుద్ధుండై స్వనామాంకితంబులును, నెల్లయెడల
నవ్యర్థంబులు నగుదివ్యశరంబులఁ బ్రయోగింప నారంభించెను. వీరభ
ద్రుండును భద్రనామాంకితంబులగు ననేకశరంబులచే మార్గమధ్యమునం
దే యావిష్ణుదేవునిశరంబుల నన్నిటిని శతచ్ఛిద్రములుగాఁ జేయు
చుండెను. మఱియు నాతఁ డవలీలగా నొకబాణంబుచే విష్ణుకార్ముకం

బును, శరద్వయముచే గరుడుని పక్షద్వయంబును ఖండించివై చెను. అప్పుడు విష్ణుండు యోగబలంబునఁ దనశరీరమునుండి భీషణాకారులు ను శంఖచక్రగదాధరులు నగువేలకొలఁదిదేవతలను సృజించుటయు మహాబాహుండగుశంకరుండు తననేత్రానలంబుచేఁ ద్రిపురవాసులంబోలి వీరభద్రుం డాదేవతలనందఱను భస్మీభూతులం గావించెను. అది యంతయుం గాంచి విష్ణుదేవుండు క్రోధారక్తలోచనుండై దక్షిణకరంబున సుదర్శనచక్రముం దాల్చి వీరభద్రునిపైఁ బ్రయోగింపఁజూచుటయు భద్రుండు మందహాసంబు సేయుచు నవలీలగా నాతనిస్తంభితునిం గావించెను. ఇట్లు స్తంభితుండగునారాయణుం డెంతప్రయత్నించినను చక్రప్రయోగంబు సేయఁజాలకయవశుండై యాక్రోశించుచుఁ జక్రసహితంబుగా నెత్తినబాహు వెత్తినట్లే యుండ శిలావిగ్రహముంబోలి నిశ్చలభావంబున దేహశూన్యుండగుజీవునివలెను, శృంగశూన్యంబగు వృషభమువలెను, దంతశూన్యంబగుసింహమువలెను, నిరాధారుండై నిలువఁబడిపోయెను.

ఈవిధముగా దుర్దశాపన్నుం డై పోయినవిష్ణుదేవునిం గాంచి దేవతలందఱును గృద్ధులై పంచాననంబుపయిందాఁకుబలీవర్దంబులంబోలి యొక్కుమ్మడి వీరభద్రుందలపడి యుద్ధము సేయ నారంభించిరి. వీరభద్రుండును మృగసమూహంబులపై విజృంభించు మృగేంద్రుండునుంబోలియట్టహాసంబు సేయుచు దేవతాగణంబులనందఱ నాక్షణంబ స్తంభితులం గావించెను. అప్పుడింద్రాదులు వజ్రాద్యాయుధంబులతో నెత్తినబాహువు లెత్తినట్లుండఁ జిత్రప్రతిమలవలె నిలిచిపోయిరి. కల్పాంతభైరవునింబోలి వెలుంగుచు విజృభించుచున్నవీరభద్రునియెదుట నిలువఁజాలక సకలదేవతలును భయభ్రాంతులై పలాయితులగుచుండుటయు భద్రుండు శిలావృష్టిచే శైలంబులభేదించు మేఘుం

డునుంబోలె దేవతాసమూహమును శరవర్షంబుచే ముంచివైచుచుండె
ను. అగ్నిజ్వాలలఁ గ్రక్కుచుండు మహానాగంబునుంబోలె దివ్యాస్త్రం
బులచే వెలుంగుచుండు నవ్వీరునిమహాబాహువు శోభిల్లుచుండెను. ఆ
దికాలంబున నానావిధభూతంబుల సృష్టించుప్రజాపతింబోలి వీరభ
ద్రుండు వివిధంబు లగుదివ్యాస్త్రశస్త్రంబులసృజించుచు సూర్యుండు
సహస్రకిరంబులచే బ్రహ్మాండము నాక్రమించునట్లే యొకక్షణంబు
లో దివ్యాస్త్రములచే సకలదిశల నాచ్ఛాదితంబులుగాఁ జేసివైచెను.

హేమమయంబులగు నవ్వీరభద్రునిదివ్యశరంబు లన్నియు నాక
సంబున కెగసి విద్యుత్స్వరంపరలంబోలి వెలుంగుచు దుందుభంబులు మం
డూకంబులవధించి రుధిరపానంబు చేయువిధంబున దేవతాసంహారంబు
గావించి వారిరుధిరాసవపానంబు గావించుచుండెను. విచ్ఛిన్నబాహులు
ను, విభిన్నమస్తకులును, విదారితపార్శ్వులునై దేవతలందఱును భూతల
పతితులగుచుండిరి. కొందఱు మృతులగుచుండిరి. కొందఱు భూమండల
మునకుఁ బాటిపోవుచుండిరి. కొందఱు స్వర్గాభిముఖులై పలాయితు లగు
చుండిరి. కొందఱెందు దాఁగుటకును దోఁపకుండుటచేఁ బరస్పరము
నొకరివెనుకనొకరొదిఁగి నిలుచుచుండిరి. కొందఱు భూగర్భములందును
గొందఱు పర్వతగుహాలయందును దాఁగుచుండిరి. కొందఱు గగనత
లంబునను, గొందఱు జలాంతరంబునను నంతర్హితు లగుచుండిరి.
వీరుండగు భద్రుండు ప్రళయకాలంబునఁ బ్రజాసంహారంబు సేయు
భైరవుండునుం బోలె విజృంభించుచు సకలదేవతాగణంబులను భిన్న
భిన్నంబులుగాఁ జేయుచు దీనులగువారిరుధిరంబులచే నతిభీషణంబుల
గురక్తవాహినులను బ్రవహింపఁజేయుచుండెను.

అప్పుడు రక్తార్ద్రం బగునయ్యజ్ఞభూమి శుంభదైత్యసంహారసమ
యంబున రుధిరసిక్తవసనయు, శ్యామాంగియు నగుకౌశికింబోలి శోభి

ల్లింపుచుండెను. అతిదారుణం బగునమ్మహారణావసానసమయంబున భయవిహ్వలమగుభూమండల మంతయుఁ బ్రకంపిత మగుచుండెను. బృహత్తరంగసహితంబులును, గంభీరావర్తసంయుక్తంబులునై సకలసముద్రంబులును సంక్షుభితంబు లగుచుండెను. నానావిధోత్పాతసూచకంబులై యుల్కాపాతంబు లగుచుండెను. సకలవృక్షంబులును శాఖావిహీనములై పోవునట్లు సకలదిశలు నప్రసన్నములై పోవునట్లు భయంకరప్రభంజనములు వీచుచుండెను. దైవప్రాతికూల్యముచే నయ్యశ్వమేధాధ్వరంబున కీవిధముగా దుర్దశ సంభవించెను.

ఏయజ్ఞమునందు స్వయముగా బ్రహ్మపుత్త్రుం డగుదక్షప్రజాపతి యజమానుండును, ధర్మప్రభృతులు సదస్యులును, విష్ణుదేవుండు రక్షకుండునై యింద్రాదిదేవతలు తమతమహావిర్భాగంబులను స్వయముగా గ్రహించుటకు వచ్చియుండిరో యట్టిమహాయజ్ఞమునందు యజమానునకును బురోహితాదులకునుగూడ సద్యస్సమయంబున శిరశ్ఛేదంబులై పోయెను. కర్మఫలం బనుభవింపక తీఱదుగదా! కేవలవేదవిరుద్ధంబును, నీశ్వరబహిష్కృతంబును, అసత్పరిగృహీతంబునగుకర్మం బెన్నటికిని జేయఁగూడదు. మహత్తరంబు లగుపుణ్యకర్మంబులను, శతాధికంబు లగుయజ్ఞంబులను గావించినను శివభక్తి లేకయున్నచో నట్టిసకలకర్మంబులును నిష్ఫలంబులై పోవును. మహాపాపాత్ముండైనను భక్తిపూర్వకంబుగా మహాదేవు నర్చించినచో నాతనిసకలపాపంబులును వినష్టంబులై పోవును. ఈవిషయంబున విశేషవాగాడంబరముం జూపుటవలనఁ బ్రయోజనంబు లేదు. శివనిందాపరాయణు లగువారి దానతపోయజ్ఞహోమాదిసకలకార్యంబులును నిష్ఫలంబులు.

అట్లు వీరభద్రునిదారుణాస్త్రంబులచే విభిన్నశరీరులగు నారాయణ రుద్ర, దిక్పాలాదిదేవతాగణంబులు మహావ్యథాభిభూతులై

పలాయితు లగుచుండిరి. కొందఱు వీరగణమధ్యంబున నాలులాయిత కేశపాశులై భయభ్రాంతిచే దిక్కుదోఁపక చిక్కియుండిరి. కొందఱు గహ్వరస్థానములం దాఁగియుండిరి. కొందఱు మొగంబు లగపడకుండ బొరిగిలఁబడి యుండిరి. కొందఱదృశ్యులై పోయిరి. కొందఱెందును బోఁజాలక శరీరశరాసనవసనాదులఁ బరిత్యజించి భూతలపతితులై యుండిరి. అపుడ దేహుండును, మహాపరాక్రమశాలియు నగువీరభద్రుండును మాత్రము దక్షయజ్ఞధ్వంసంబు గావించి వృషభంబులనమువెలుంగు సింహంబును బోలి వీరగణపరివేష్టితుండై శోభిల్లుచుండెను.

## పార్వతీపరమేశ్వరానుగ్రహము.

ఇట్లు భిన్నభిన్నాంగులగువిష్ణుప్రభృతులును, అల్పావశిష్టు లగు దేవగణంబులును, కష్టదశావిపర్యయంబున భయభ్రాంతులైపోయిరి. వీరగణంబులు వీరభద్రప్రేరితులై రణరంగంబున వారివారిదోషంబుల కుఁ దగినదండంబులం గావించిరి. ఆసమయంబున సారథ్యంబు గావించిన బ్రహ్మదేవుండు వీరభద్రునియనుగ్రహంబు వడసి ప్రణామపూర్వకంబుగ నాతనిం గూర్చి యిట్లు ప్రార్థించెను. మహాత్మా! నీకిఁకఁ గ్రోధంబుతోఁ బ్రయోజనము లేదు. దేవతలందఱును నశించిపోయిరి. ప్రసన్నుండవై యిఁక సురగణేశ్వరులను రణరంగమునుండి మరలింపుము. అని ప్రార్థించుటయు వీరభద్రుం డాతనిమెడల గౌరవముచేఁ బ్రశాంతుం డయ్యెను. స్తోత్రపారనిపుణులగుదేవగణంబు లాసమయము నెఱింగి నిటలతటఘటితాంజలిపుటులై బహువిధస్తోత్రపాఠంబులచే న వ్వీరభద్రుని వినుతింపనారంభించిరి.

ఓశాంతమూర్తీ! మఖధ్వంసకా! త్రిశూలపాణీ! రుద్రభద్రా! రుద్రేశ్వరా! కాలాగ్నిరుద్రమూర్తీ! శివా! నీకు నమస్కారము. నీవు దేవగణంబుల సర్వాంగకములను, దక్షునిమస్తకమును ఛేదించితివి. ఓ

వీరభద్రా! మేము స్వయముగా నిర్దోషులమైనను, సాహసియుఁ బాపా
త్ముండు నగుదక్షునితోడిసంసర్గమువలనఁ గలుషితులమైతిమి. అందుచే
తనే మహారణంబున నీచే దండితులమైతిమి. ప్రభూ! మే[illegible]డును
నీభయముచే దగ్ధులమైపోవుచుంటిమి. నీవే మాగతివి. కావున శరణా
గతుల మగు మమ్ము రక్షింపుము.

అని యిట్లు దేవతలు స్తుతించుటయుఁ బ్రభుం డగువీరభద్రుం
డు ప్రసన్నుండై వారినందఱను నిగళముక్తులం గావించి మహేశ్వ[illegible]
సన్నిధానమునకుఁ దీసికొనిపోయెను. అప్పుడు సకల[illegible]
గతుండును, సర్వలోకేశ్వరుండును, ప్రభుండు నగుమహేశ్వరుండు గణ
పరివృతుండై గగనతలంబున నిలిచి యుండెను. పరమైశ్వర్యసంపన్నుం
డగునమ్మహాదేవుం గాంచినంతనే సకలదేవతలును బ్రీతులును భీతులు
నై యాతనికిఁ బ్రణామములం గావించిరి. ప్రణతార్తిహరుం డగు
నమ్మహాదేవుండు భయభ్రాంతులగుదేవతలం గాంచి మందహాసంబు
సేయుచుఁ బార్వతివంకఁ గనుంగొని యిట్లనియెను. ఓదేవతలారా!
మీకిఁక భయములేదు. నేనిప్పుడు మీపాపముల నన్నిటిని బరిమార్జిత
ములుగాఁ జేసితిని. నేను నిజముగాఁ గోపించినచో నిప్పటికే మీజీవి
తంబులును, స్థితులును వినష్టంబు లందియే యుండును. అని యనుగ్ర
హించుటయు దేవతలందఱు నాక్షణంబుననే భయవిరహితులై యా
నందావేశంబున నృత్యంబులు సేయ నారంభించిరి. ఆశుభసమయముం
గాంచి బ్రహ్మదేవుండు కృతాంజలిపుటుండై త్రిశూలధరుం డగుమహా
దేవునకుఁ బ్రణమిల్లి యిట్లు విన్నపంబు గావించెను. ఓప్రణతార్తిభం
జనా! నీకు విజయం బగుఁగాక! ఇట్టిమహాపరాధములను క్షమించు మ
హాత్ములు నీకంటె నెవ్వరున్నారు? పరమేశ్వరా! యుద్ధనిహతులగుసకల
దేవతలను బునరుజ్జీవితులం గావింపుము. నీవు ప్రసన్నుండవైనచో

నెవ్వరికి సుఖంబులు లభింపకుండును? దూషితంబులగుసకల యజ్ఞాంగ
కములను మరల భూషితంబులుగాఁ జేయుము.

అని బ్రహ్మదేవుండు ప్రార్థించుటయు దేవదేవుండు మందహా
సంబు సేయుచు దేవివంకఁ గటాక్షపాతంబు గావించి ప్రసన్నుండగు
పద్మసంభవునియందలివాత్సల్యముచే దేవతల సందఱను బునర్జీవితు
లం గావించెను. తోడనే యింద్రాదిదేవత లందఱును బరమేశ్వరాను
గ్రహంబుచే యథారూపంబులం దాల్చి యాదేవదేవునకుఁ బ్రణా
మంబులఁ గావించిరి. విభిన్నంబులగు దేవతలసకలాంగకంబులును
యథారూపంబున విరాజిల్లుచుండెను. అప్పుడు భగవంతుం డగుపితా
మహుండు వృద్ధచ్ఛాగశిరంబుచే దక్షశిరంబును మరల నిర్మించెను. తో
డనే దక్షుండు చైతన్యముం గాంచి లేచి కృతాంజలిపుటుండై భయో
ద్రేకంబుచే బహువిధంబులఁ బ్రలాపించుచుఁ బరమేశ్వరుని స్తుతింప
నారంభించెను. కృతాపరాధుం డగుదక్షుం డిట్లు భయవ్యాకులుండై
ప్రలపించుచుండుటం గాంచి దయానిధి యగుమహాదేవుండు దక్షునిం
గాంచి మందహాసంబు సేయుచు భయపడవలదని యూఱడించెను.

అనంతరము మహాదేవుండు బ్రహ్మదేవునకుఁ బ్రియంబు సేయం
దలంచి యాతనితనయుం డగుదక్షునకు శాశ్వతం బగుగాణపత్యపదం
బును బ్రసాదించెను. అప్పుడు విరించి కృతాంజలిపుటుండై యభివాద
నంబు సేయుచుఁ బార్వతీపరమేశ్వరులను శుభవచనంబులచే వినుతింప
నారంభించెను. అనంతరము విష్ణుదేవుండును, దేవతాగణంబులును,
మహర్షిగణంబులును యథాక్రమంబుగ మహాదేవుని, మహాదేవిని
వినుతింపఁదొడంగిరి. అప్పుడు గిరిరాజదుహిత యగునంబికాదేవి తన
పార్శ్వమునందుఁ గృతాంజలిపుటుండై నిలిచియున్న నిజాజ్ఞానిర్వాహ
కుండగువీరభద్రునిం గాంచి ప్రసన్నుం డగునాతనికేలు కేలం గీలించి

యాకర్షించి భద్రకాళీసహితంబుగ నాతని దనతొడలపైఁ గూర్చుండఁజేసికొని కార్తికేయునివలెనే గాఢాలింగనముం గావించుకొని యాతనిమూర్ధాఘ్రాణంబు చేసెను. అనంతర మాదేవి పరమానందముతోఁ ద్రిశూలధారి యగువీరభద్రున కనేకసహస్రవరంబులఁ బ్రసాదించెను.

అప్పుడు విష్ణుదేవుఁడు, ఇంద్రుఁడు, పితామహుఁడు మొదలగు ప్రధానదేవగణంబులు సర్వలోకేశ్వరుం డగుమహాదేవునకు శరణాగతులై స్తోత్రంబులు సేయందొడంగిరి. పరమకారుణికుం డగు పరమేశ్వరుండును, మందహాసవదనముతో శరణాగతులగు సకలదేవతలకును భయాపనయనంబు గావించి యోదేవతలారా! విధినియోగవశంబున మీరందఱును యజ్ఞనిమంత్రితులై నాయెడల నపరాధంబు గావించితిరి. ఇప్పుడు మీరందఱును మదేకశరణ్యులై ప్రణతులై యుంటిరి గావున మీయపరాధంబు లన్నియును విస్మృతంబులై పోయెను. కావున నిఁక మీరందఱును భయవిరహితులై యిప్పటిపరాభవంబును విస్మరించియుండుఁడు. ఓహరివిరించిసురేంద్రప్రముఖదేవగణులారా! మీరిప్పుడు యథాసుఖంబుగ మీమీపురంబులకుఁ బొండు. అని దక్షమఖధ్వంసకారియు, యజ్ఞవిరహితుండు నగుమహాదేవుం డిట్లానతిచ్చి యనుచరగణంబులతోఁ బార్వతీసహితంబుగఁ జూచుచుండఁగనే గగనతలంబునుండి యంతర్హితుం డయ్యెను.

పిమ్మట మహేంద్రప్రభృతిదేవగణంబులు వ్యథావిరహితులై వీరభద్రునియద్భుతపరాక్రమచరిత్రమును గీర్తించుచు నాక్షణమునందే యాకాశంబున వివిధమార్గముల నవలంబించి సుఖగమనంబు గావించిరి.

## మందరగిరివర్ణనము.

శ్రీమంతంబును, విచిత్రకందరయుతంబు నగుమందరపర్వతము తనతపఃప్రభావముచే మహేశ్వరునకుఁ బ్రియనివాసమందిర మయ్యెను. ఆశైలరాజ మంబికాశంకరులను శిరంబునఁ దాల్చియుండవలయు నను కోరికతో మహాతపంబు గావించెను. చిరకాలమునకాతనికిఁ బార్వతీప రమేశ్వరులపాదకమలస్పర్శసుఖానుభవంబు లభించెను. సహస్రవదన ములుగలవారు శతకోటివత్సరములు వర్ణించినను సంపూర్ణముగ నాప ర్వతసౌందర్యమును వర్ణింపఁజాలరు. లోకు లాపర్వతము నితరభూధరం బులవంటిసౌందర్యముగలదే యని భావింతురేమో యనుసంశయము చే నేను సమర్థుండనయ్యు నిప్పుడు దానిని వర్ణింపఁబూనుకొనలేదు. కాని సర్వసమృద్ధం బగునాధరాధరము తనసౌందర్యప్రభావముచేతనే పార్వతీపరమేశ్వరులకు నిత్యనివాసయోగ్యం బయ్యె నని చెప్పఁగలను. అందుచేతనే పరమేశ్వరుం డంబికాదేవిప్రియంబుకొఱ కాసుందరశైల ము నంతఃపురముగాఁ జేసికొనియెను. విశాలశిలాఫలకంబులచేతను, సాంద్రమహీరుహషండంబులచేతను విరాజితంబులగునాగిరిమేఖలాప్రదే శములు గౌరీశంకరులనిత్యసాన్నిధ్యసౌభాగ్యముం గాంచుచు సమస్త జగద్భాగ్యమును దృణీకరించుచుండును. నిరంతరము నుమామహేశ్వ రుల స్నానాదిక్రియలచేఁ బవిత్రీకృతంబులును, లఘుతరంబులును, సు రభిశీతలంబులు, నిర్మలంబులు నగునిర్ఝరజలధారలచే నాసుందరశైల రాజము శైలసామ్రాజ్యపదంబున కభిషేకింపఁబడుచున్నట్లు విద్యోతి మానం బగుచుండును. ఆపర్వతశిఖరంబున రాత్రులయందు విహరిం చుచుండు చంద్రుం డాపర్వతోత్తమాంగంబున సామ్రాజ్యచిహ్నంబు గాఁ బట్టఁబడిన శ్వేతచ్ఛత్రముం బోలియుండును.

ఆపర్వతేంద్రమునకుఁ బ్రాంతంబులయందు విహరించు చమరీమృగంబులవాలంబులు చామరంబులుగను, ప్రభాతకాలంబున నుదితుండగుసూర్యభగవానుండు నిలువుటద్దముగను దోఁచుచుండును. సమీపస్థలంబులలతావేష్టితపాదపంబులు తపోధనులంబోలి బాహురూపలతలచేఁ బుష్పమోచనంబు సేయుచు విహంగకలాలాపంబులచేనమ్మహీధరవరేణ్యు నాశీర్వదించుచున్నట్లుండును. అధోముఖంబులు, నూర్ధ్వముఖంబులు, తిర్యఙ్ముఖంబులు నగుశృంగంబులచే విరాజిల్లు నయ్యద్రిరాజమొకప్పుడు పాతాళంబునకుఁ బతితంబగుచున్నట్లును, ఒకప్పు డాకాశమున కెగయుచున్నట్లును, సకలదిశలను వ్యాపించి యాకసమునఁ బరిభ్రమించుచున్నట్లును, జగంబంతయును దర్శించుచున్నట్లును, నృత్యము సేయుచున్నట్లును గానవచ్చుచుండును.

మఱియు నాభూధరేంద్రము నిత్యాభినవరమణీయంబై, యంతగ్గభీరంబులును, విశాలంబులు నగుగుహాముఖంబులచే నావులించి సకలజగంబులను గ్రసింపఁజూచుచున్నట్లును, సకలసముద్రజలంబులఁ బానముచేయఁ దలఁచుచున్నట్లును, అంతస్థం బగునంధకారమును వెడలఁగ్రక్కనెంచుచున్నట్లును, మేఘసహితంబుగ నాకాశమును భక్షింప నుద్యమించుచున్నట్లును దోఁచుచుండును. ఆపర్వతాభ్యంతరప్రదేశములందలినివాసభూములు దర్పణంబులంబోలి మెఱయుచుండును. సమీపాశ్రమస్థితంబులగుమహీరుహంబులు సాంద్రచ్ఛాయలచే నాతపనివారణంబు గావించుచుండ నాపవిత్రప్రదేశములు సుస్నిగ్ధంబులును, సరిత్సరోవరతటాకంబులనుండివీతెంచు మందపవనంబులచే శీతలంబులునై యుండును. ఆపర్వతరామణీయకమంతయు గిరిజాశంకరుల స్వేచ్ఛావిహారంబులచేఁ జరితార్థం బగుచుండును.

## —♦ గౌరీదేహధారణము. ♦—

రైభ్యాశ్రమస్థితుండగుపరమేశ్వరుం డప్పు డంబికాసహితంబుగ సంతుష్టాత్ముండై మరల మందరశైలంబునకుఁబోయి యచ్చటియుద్యాన మునందు దేవీసహితుండై విహరించుచుండెను. ఇట్లు బహుకాలంబు గడచుటయుఁ గ్రమంబుగఁ బ్రజావృద్ధియగుచుండ దైత్యకులంబున శుంభనిశుంభు లనునిరువురు సోదరు లుదయించి మహాతపంబుచేఁ బరమేష్ఠిం బ్రసన్నుని గావించుకొని జగంబునందెట్టిపురుషుండును దమ్ము వధింపఁజాలకుండునట్టివరంబును సంపాదించుకొని యుండిరి. అంబికాంశసముద్భూతయుఁ, బరాక్రమవతియు, నయోనిజయు, పురుషసంయోగవివర్జితయు నగుకన్యయందు వారు మోహాసక్తులైనప్పు డామెరణరంగమున వారిని వధించునట్లుగా నెడ పెట్టి విరించి వారికి వరప్రదానంబు గావించెను.

అంతనాదైత్యు లిరువురును మదోద్ధతులై రణరంగమునం దింద్రాదిదేవతలను బరాజితులం గావించి యొక్కసారిగా నిఖిలజగంబును స్వాధ్యాయవషట్కారశూన్యంబుగాఁ జేసివైచిరి. అప్పుడు బ్రహ్మదేవుండు వారిసంహారముకొఱకు స్వయముగా మహేశ్వరునిపాలికిం బోయి మహాత్మా! ఏకాంతముగా జగదంబను నిందించినవైనను, మఱియొకవిధముగా నామెకుఁ గోపమును గల్పించినవైనను నామెవర్ణకోశమునుండి, కామభావవిరహితయు, శుంభనిశుంభసంహారిణియు నగు నొకకన్య యుదయించునట్లు చేసి యాకన్యను దేవతలకుఁ బ్రసాదింపవలయు నని ప్రార్థించెను.

భగవానుండును, నీలలోహితుండు నగుమహాదేవుం డిట్లు విరంచిచే నభ్యర్థితుండై మందహాసంబుతో నట్లే చేయుదు నని యనుగ్రహించి యొకప్పు డేకాంతసమయంబున నంబికాదేవిని గాంచి నవ్వుచు

"నీవు కాళివి" అని పరిహాసించెను. అట్లు మహాదేవుండు తనశరీరచ్ఛాయంగూర్చి నిందించుటం గాంచి పార్వతీదేవి క్రోధావిష్టయై గర్వముతో భర్తంగాంచి కఠోరవచనంబుల నిట్లనియెను.

స్వామీ! నేను నల్లనిదాన నగుటవలన మీమానంబున కప్రియంబుగాఁ దోఁచుచున్నచో మీరింతకాలమువఱకును నన్నేల కట్టుకొని యుంటిరి? ఈనారూపము మీకసహ్యముగాఁ దోఁచుచున్నను, మీరిన్నాళ్లును నాతో నెట్లు విహరించుచుంటిరి? ప్రభూ! మీరీశ్వరులు. మీకసాధ్యం బగునదియేదియును లేదు. ఆత్మారాము లగుమీకు సామాన్యసంభోగము సుఖసాధనంబు గాఁజాలదు. కావుననే మీరు పూర్వము గందర్పుని భస్మీభూతునింగావింపఁగలిగితిరి. పతిమనోహారిణిగానిసతి యెంతసుందరీమణియైనను, నెంతటిసద్గుణమణియైనను నేమి లాభము? కేవలము భర్తలయుపభోగంబుకొఱకే స్త్రీలు సృష్టింపఁబడిరి. అట్లు గాకున్నచో స్త్రీజాతివలనఁ బ్రయోజనం బేమున్నది? కావున నేకాంతసమయమున వినిందితంబగు నాయీశరీరవర్ణమును బరిత్యజించి మఱియొకవర్ణమును బరిగ్రహింపవలయును. అట్లు చేయఁజాలకున్నచో నేనీశరీరమునే పరిత్యజించెదను. అనిపల్కుచు నంబికాదేవి చటాలునఁ బర్యంకమునుండి లేచి నిలువఁబడి తపశ్చరణంబునకు స్థిరసంకల్పయై భర్తం గాంచి గద్గదస్వరంబున ననుమతిం గోరుకొనియెను.

ఈవిధంబుగాఁ బ్రణయభంగం బగుటయు, భూతపతి యగు మహాదేవుండు భీతుండై దేవీచరణకమలంబులకుఁ బ్రణామంబు గావించియిట్లనియెను. ప్రియా! ఇది పరిహాసవచనం బనియెఱుంగనిదానివలె నాపై నింతగాఁ గోపపడియెదవేల? నాకునీయెడలనే యనురక్తి గలిగినచో నిఁక నాసక్తి యెక్కడఁ గలుగును? నాకు నీయందరతియే కలిగి

యున్నచో నీవు జగంబులకుఁ దల్లివి, నేను దండ్రిని నగుటయెట్లు సంభ
వించును ? మఱియిరువురకును గలరతికామములు కేవలకామకృతంబు
లనుకొంటివా ? కందర్పునిజననముకంటెఁ జిరకాలముక్రిందటనే యీ
జగదుత్పత్తి యైనది. సామాన్యజనంబుల కభిరతినిమిత్తమే నేను గంద
ర్పుని సృజించితిని. కామదహనం బేల గావించితి నని నీవునన్నుఁ దిర
స్కరించితివి. అక్కాముండు నన్ను సామాన్యునిగ భావించి పరాభవిం
చుటకుఁ బ్రయత్నించెను. అందుచేఁ గోపించి నేనాతనిభస్మీభూతుని
గాఁ జేసినైచితిని. మనవిహారం బంతయును లోకరక్షణంబుకొఱకేగ
దా ! అందుచేతనే నిన్నునేనిట్లు పరిహసించితిని. దీనికిఁ బ్రయోజనం
బచిరకాలంబునఁ దనంతనే నీకు బోధపడఁగలదు. దేవీ ! నీవిఁక నీవ్యా
ధాక్రోధమును బరిత్యజింపుము. నేను నీయేకాంతభక్తుండ ననియెఱుం
గవా ?

అని యిట్లు సదాశివునిచేఁ ననునయింపఁబడియును బర్వతరాజ
తనయ తనహృదయంబున "గాళి" యనునప్రియవచనము వేధించు
టయు మహాదేవునుద్దేశించి యిట్లనియెను. పరమేశ్వరా ! ఇంతకుఁబూ
ర్వముకూడ నేఁనేకపర్యాయములు నీచాటూక్తులను వినియుంటిని.
వానియందలిమోహినీశక్తిప్రభావముచే నెన్నియోసారులు నాకోపము
వంచింపఁబడిపోయెను. స్వామి కప్రియయయ్యును బ్రాణపరిత్యాగం
బు సేయఁజాలనికులాంగనను బండితులు కుత్సితనుగాఁ బరిగణింతురు.
నేను నట్టిదాననను. అందుచేతనే నీకు సంపూర్ణముగ నప్రియురాల నైతి
నని యనుకొనుచున్నాను. కానున్నచో నన్నుఁ గాళి యనిపరిహసిం
చుటయేల రటస్థించును? రమణీమణులకృష్ణవర్ణము పండితప్రశంసనీయ
ము గానేరదు. కేవలతపోబలంబుచే నేనీయనావృతం బగుకాలవర్ణ
మును బరిత్యజించెదను. అట్లు గాదేని నిశ్చయముగా మరణించెదను.

ఈకృష్ణవర్ణశరీరముతో నేనిఁక జీవింపఁజాలను.

అని దృఢనిశ్చయముతో దేవి వచించుటయు మహాదేవుండు ప్రియా! నీకిట్టిదృఢసంకల్పమే యున్నయెడల వేఱుగఁ దపంబు గావించు టెందులకు? నేను దలంచినను, నీవుదలంచినను నిమిషములో వర్ణాంతరముం గాంచవచ్చునుగదా! యనియెను. ఆమాటవిని దేవి నీమూలమునఁగాని, నామూలమునఁగాని నేను వర్ణాంతరముం దాల్చుట కిచ్చగించుటలేదు. నేను స్వయముగాఁ దపంబు గావించి బ్రహ్మదేవునియనుగ్రహంబు సంపాదించుకొని యామూలమున గౌరి నయ్యెదను. అని దేవినిశ్చయించుటయు మహాదేవుండు దేవీ! పూర్వము బ్రహ్మదేవుండు నాయనుగ్రహంబుచేతనే బ్రహ్మత్వముం గాంచియుండెను. అట్టివానిని దపోమూలంబున మరల నారాధించుటవలన విశేషలాభ మేమున్నది? అని బోధించెను.

మహాదేవి యిట్లనియెను. బ్రహ్మాదిసకలదేవతాగణంబులును, మీయనుగ్రహంబుచేతనే తమతమపదంబులం గాంచియున్నను, నేను మీయాజ్ఞానుసారముగనే మహాతపంబు గావించి బ్రహ్మదేవు నారాధించి పూర్వము సతీరూపంబునఁ దక్షతనయనై యుదయించితిని. మఱియు జగన్నాథుండవగునిన్నుఁ బతిగాఁ బడసితిని. అట్లే యిప్పుడును దపశ్చరణంబుచేఁ బద్మసంభవుని సంతుష్టుం గావించి గౌరం గావలయు నని యిచ్చగించుచున్నదానను. ఇందు దోష మేమున్నది? అని మహాదేవిదృఢస్వరంబునఁబలుకుటయు మహాదేవుం డొక్కమందహాసంబు గావించి యూరకుండెను. కాని దేవకార్యార్థమై యామెను నిరోధింపఁడయ్యెను.

అనంతరము మహాపతివ్రత యగునంబికాదేవి పతియగుజగత్పతికిఁ బ్రదక్షిణంబు గావించి దుస్సహావియోగదుఃఖమును హృదయము

సందేశయుతంబుకొని హిమాలయపర్వతమునకుం బోయి పూర్వపశ్రిణ
యవకాశంబున నిదివరకు సఖీజనసహితనై తపంబుగావించినప్రదేశంబు
నందే మరలం దపశ్చరణంబునకు సంకల్పించుకొనియెను. అంత నామె
తల్లిదండ్రులనువర్శించి ప్రణామంబులం గావించి సకలవృత్తాంతంబును
వారికి నివేదించి వారియనుమతింగూడం గాంచి తపోవనంబునకుం బోయి
యచ్చట సకలాలంకారములను బరిత్యజించి స్నానము చేసి పవిత్రయై
తపోవేషముందాల్చి దుష్కరతపంబు గావింప సంకల్పించి మనోవ
ధ్యంబున స్వామిపదారవిందంబుల నిలుపుకొని సర్వదా ధ్యానించుచుం
డెను. బాహ్యంబున సర్వరంబగు మృణ్మయలింగంబునందును మహా
దేవభావముం జూపుచుం ద్రిసంధ్యలయందును బుష్పఫలాదుల నర్పిం
చియారాధించుచుండెను. నాస్వామియే బ్రహ్మస్వరూపుండై సాక్షా
త్కరించి నాతపఃఫలంబును బ్రసాదించుంగాక యని నిరంతరమును
భావించుచు నాదేవి యాతినియమంబులం దపోనుష్ఠానముం గావించు
చుండెను.

ఇట్లు తపంబు సేయుచుండ బహుకాలంబు చనుటయు నొక్క
నాం డొకవ్యాఘ్రము దుష్టభావముతో నామెను సమీపించెను. కాని
యూపార్వతీదేవిసమీపమును జేరినంతనె యామదుష్టభావాలమునకు సకల
శరీరమును లిఖించిచిత్రముంబోలి స్తంభించిపోయెను. మహాదేవి యగు
పార్వతి యూహింపరానంతగా గాంచియుం దనప్రభావమువలనవిశ్వా
సముచే నించుకంతయును జలింపదయ్యెను. స్తంభితంబగువ్యాఘ్ర
మప్పుడు తనశరీరంబంతయు నట్లు స్తంభించిపోవుటకుం జింతించుచు నా
కింతకంటె నామిషంబేదియును లేదని దుఃఖించుచు నాదేవిని విడువజా
లక యాసమీపమునందే యుపాసకునింబోలి నిరంతరము నామెను ద
ర్శించుచు శిలావిగ్రహమువలె నిలుచుండిపోయెను. పార్వతీదేవియు

దానిం గాంచి "ఇది నిత్యము నన్నే యుపాసించుచున్నది. మఱియు దుష్టసత్వంబులనుండి నన్ను రక్షించుటకై యిది నాచెంతకు వచ్చియున్నది" అని భావించుకొనుచు నామస్తశార్దూలము నెడలం గృపావతియై యుండెను. అందుచే దానికిం గాయిక, వాచిక, మానసికంబు లగుదోషములన్నియును క్రమముగా నశించి దేవీతత్త్వము విజ్ఞాతంబు గాంజొచ్చెను. దానియాకలియు, అంగస్తంభనమును, దౌరాత్మ్యమును నివృత్తి యగుటయు మనంబునకు సంతుష్టి గలుగుచుండెను. అప్పుడు దానికిం బశుభావోదయంబగుటయుం దనజీవితంబు చరితార్థంబయ్యె ననితలంచుకొని యాదుష్టవ్యాఘ్రమప్పు డుత్తమోపాసకునింబోలి పరమేశ్వరిని సేవింప నారంభించెను. అది తనదుష్టభావమును దూరీభూతముగాం జేసి శాంతముతోం దపోవనంబున విహరించుచుండెను.

క్రమముగా మహాదేవితపంబును నతితీవ్రం బగుచుండెను. అప్పుడు దైత్యపీడితు లగుసకలదేవతలును విరించిపాలికిం బోయి, రక్షణంబు గోరుటయు స్వయముగ దైత్యసంహారంబునకువేచియున్న పితామహుండు దేవతలవలన సకలవృత్తాంతము నాకర్ణించి సత్వరంబుగ నమరసహితుండై దేవితపోవనంబునకుం బోయి యచ్చట శ్రేష్ఠతపోనిరతయై విశ్వవిఖ్యాతరూపంబున వెలయుచున్న మహాదేవిం దర్శించెను. సకలజగంబులకును దల్లియుం, దండ్రియగు రుద్రదేవునకు సతీమణియుం, బర్వతరాజదుహితయు, ఆర్యస్వభావయు నగునాదేవదేవికి బ్రహ్మదేవుండు ప్రణామంబు గావించెను. దేవియు, సకలదేవతాసహితుండై యున్న విచ్చేసిన లోకపితామహుం గాంచి సముచితవిధానంబున స్వాగతం బడిగి యర్ఘ్యపాద్యాదులచే నర్చించెను.

అప్పుడంబుజాసనుం డద్దేవి నుచితవచనంబులచే నభినందించు

మ నేమియు నెఱుంగనివానివలె, దేవీ! నీవెట్టిఫలంబును సాధించుటకై యిట్టిఘోరతపంబును గావించుచుంటివి? సకలజగన్నాథుం డగు పరమేశ్వరుఁడే నీస్వామి యగుటం జేసి సర్వతపఃఫలంబులును నీకరగతంబులై యున్నవి. మఱియు నీసకలజగంబును నీవిలాసమాత్రమేకదా! మహాదేవవిరహంబును సహించి నీవింతకాలము నెట్లు తపంబు చేయఁగలిగితివో యదియే యాశ్చర్యముగా నున్నదని వచించెను. ఆమాటలాకర్ణించి దేవదేవి యిట్లనియెను. దేవా! సృష్ట్యాదియందు నీవలన సకలజగంబులు నుత్పన్నంబులగు సమయంబున సర్వంబునకు నాదిభూతుండ వగునీవే నాకుఁ బ్రథమపుత్త్రుండవై యుంటివి. మఱియుఁ బ్రజాభివృద్ధికొఱకు నీలలాటదేశమునుండి మహాదేవుం డుదయించుటం జేసి యప్పటినుండి నీవు నాకు మామవును, గురుండవు నైతివిగదా! ఇంతేకాక నాతండ్రియగు హిమాచలేంద్రుండు నీతనయుం డగుటచే లోకపితామహుండ వగునీవు నాకు సాక్షాత్పితామహుండవు. ఇట్టి వివిధసంబంధములచే నాకు బంధుండవును, లోకయాత్రానిర్వాహకుండవునగునీయెదుట నాకును, నాభర్తకును నేకాంతమందిరంబున జరిగిన సమాచారము నెట్లు ప్రకటింపఁగలను? ఇన్నిమాటలతోఁ బ్రయోజనంబు లేదు. ఇదిగో! నాశరీర మిప్పుడు కృష్ణవర్ణంబై యున్నది. ఈ దేహనీలచ్ఛాయను త్యజించి గౌరవర్ణముం దాల్పవలయు నని నే నభిలషించుచున్నాను.

అని దేవి తెలుపుటయుఁ బితామహుం డో దేవీ! ఈసామాన్యప్రయోజనంబుకొఱ కింతటిఘోరతపంబు గావింపవలయునా? నీవు నిజముగఁ దలంచినచో నిది యెంతపాటిపని! కావుననే యిదియింతయును గేవలము నీవిలాసమాత్రమని భావించుచున్నాను. ఓజగన్మాతా! ఇది నీవిలాసమైనను, లోకహితంబుకొఱకు నీవిట్లు గావించితి వనుటకు

సంశయము లేదు. కావున నిట్టిలీలచేతనే నాయభిమతము నొకదానిని సిద్ధింపఁజేయుము. శుంభనిశుంభు లనునిరువురుదైత్యులు నావలన వరలాభంబు నంది యతిగర్వితులై విజృంభించి సకలదేవతలను బీడించుచున్నారు. వారికి నీమూలముననే వినాశంబు గలుగవలసియుండెను. ఇఁక నాలసించుటవలనఁ బ్రయోజనము లేదు. నీవేదో మిషపెట్టుకొనియుండె నిలిచి యుండుము. నచే సృష్టింపఁబడినదివ్యశక్తియే వారిరువురికిని మృత్యుస్వరూపిణి గాఁగలదు.

అని బ్రహ్మదేవుండు ప్రార్థించుటయు సంప్రీతయ యగు పార్వతి యాక్షణమునందే తనచర్మకోశమును బరిత్యజించి గౌరవర్ణ యయ్యెను. ఉత్సృష్టంబగునాదేవిచర్మకోశమునుండి కౌశికినామంబున నీలమేఘసదృశశరీరిణి యగునొకకన్య యుదయించెను. మాయామయియు, వైష్ణవియు, యోగనిద్రాస్వరూపిణియు నగునాదివ్యశక్తి శంఖచక్రత్రిశూలాద్యాయుధంబులచే విభూషితంబు లగునెనిమిదిబాహువులచే విరాజిల్లుచుండెను. ఆదేవిమూర్తి సౌమ్యంబును, ఘోరంబు నై యుండెను. మఱియు నామె నేత్రత్రయశోభితయు, బాలచంద్రవిభూషితపురుషసంసర్గవర్జితయు, ఆతృప్తయు, నతిమనోహరాకారిణియు నై యుండెను.

అప్పుడు పార్వతీదేవి శుంభనిశుంభసంహారిణియైన యానూతనదివ్యశక్తిని బ్రహ్మదేవునకు సమర్పించెను. పితామహుండును బ్రహృష్టహృదయుండై యాదివ్యశక్తికి వాహనంబుగా మహాబలపరాక్రాంతం బగునొకసింహమును సృజించి యొసగి మద్య, మత్స్య, మాంస, పిష్టకాద్యుపచారంబులచే నద్దేవిని బూజించి వింధ్యాచలం బామెకు నివాసస్థానముగాఁ గల్పించెను. విశ్వస్రష్టయగు బ్రహ్మచే నద్దేవి యిట్లు సత్కృతయై యథాక్రమంబుగఁ దనజనని యగుగౌరికిని బ్రహ్మకు

ను బ్రణామంబు లాచరించి సెలవు లందికొని వింధ్యాచలంబునకుం
బోయి శుంభనిశుంభసంహారంబు సేయుటకై సంకల్పించి తనశరీరము
నుండి మహావీర్యసమన్విత లగు నేకదివ్యశక్తులను సృజించి వారిచేఁ
బరివేష్టితయై విహరించుచుండెను. అనంతరము కందర్పబాణాభిన్నహృ
దయులగు శుంభనిశుంభు లనుదుష్టదైత్యు లిరువురును నమ్మహాదేవి
శరాఘాతంబులచేఁ బంచత్వంబు నొందిరి.

— వ్యాఘ్రమునకుగాణపత్యప్రాప్తి. —

గౌరీదేవి దివ్యశక్తి యగుకౌశికిని బుట్టించి బ్రహ్మకు సమర్పించి
నప్పుడు పితామహుంగాంచి దేవా! నన్నాశ్రయించి యున్నయీవ్యా
ఘ్రము నెఱుంగుదువా? ఇది దుష్టసత్వంబులనుండి తపస్సమయంబున
నన్నుఁ గాపాడినది. మఱియు నీశైలశృంగాలము తనమతంబంతయు నా
యందే నిలిపి యితరచింతలంబులఁ బరిత్యజించి నన్నేభజించినది.
కేవలమును దీనిని బ్రీతిపాలించుటకంటె నాకుఁ బ్రియంబగునితరాభి
మతం బేదియును లేదు. కావున నిది యెప్పుడును మాయంతఃపురం
బున నివసించుచున్నను, శంకరునకు బ్రియుండై దీనికిఁ గాణపత్యపదంబుఁ
బ్రసాదింపఁబడినట్లు గావింపవలయును. ఇది నాముందు నడచుచుండ
నిరంతరమును సఖీజనసహితంబుగ విహరించుచుండవలయు నని నేనభి
లషించుచున్నాను. ఓప్రజాపతీ! యీవిషయంబున ననుజ్ఞాప్రదానంబు
గావింపవలయును.

అని యిట్లు ముగ్ధయుంబోలి గౌరీదేవి యర్థించుటం గాంచి వి
రించి విస్మితుండై నవ్వుచుఁ గఠోరం బగువ్యాఘ్రపూర్వవృత్తాంత
ము నిట్లు వర్ణింపదొడంగెను. దేవీ! ఈక్రూరజంతు వెక్కడ? మంగళ
మయం బగునీయనుగ్రహం బెక్కడ? నీవు సాధుద్విషధరముఖంబున
నమృతసేచనంబు గావింపఁజూచుచుంటివి. ఇది కేవలవ్యాఘ్రంబు

గాదు. ఏ ఘోరకర్మరనిశాచరుఁడు ఈదుష్టుఁ డనేకతపోధనులగుబ్రా హ్మణులను భక్షించి యున్నాఁడు. కామరూపి యగునీరక్కసుఁడు తనయిచ్ఛవచ్చినరూపంబులం దాల్చి స్వేచ్ఛావిహారముం గావించు చుండును. ఇట్టి సకలపాపకర్మంబులకును దగినఫలము నీతఁ డవశ్యము గ ననుభవింపవలయును. ఈదురాత్మునియెడలఁ దయదలఁచుటవలన నేమిలాభము? దేవీ! స్వభావముచేతనే కలుషాత్ముం డగునీతనితో నీ కేమిప్రయోజనము? అని చెప్పుటయు దేవి మహాత్మా! నీవచనంబు లన్నియు నిక్కంబులే యగును. కాని యీతఁడు నన్నాశ్రయించి యుండెను. ఆశ్రితు లెట్టివారైనను నేను వారిని బరిత్యజింపఁజాలను. అని నిశ్చయముగా వచియించెను.

అంత బ్రహ్మదేవుండు శాంతవచనంబులతో నిట్లనియెను. దేవీ! ఈతఁడు నీభక్తుండనుసంగతి నెఱుంగక యీతనిపూర్వవృత్తము నెఱింగించితిని. నీయెడల భక్తి గలిగియున్నచోఁ బాపము లీతని నేమి చేయఁగలవు? నీభక్తుల కెన్నటికిని వినాశంబు లేదు. నీయాజ్ఞ లేకు న్నచోఁ బుణ్యకర్మంబులకైనను ఫలం బెట్లు గలుగును? పరమేశ్వరీ! నీయాజ్ఞయుఁ, బ్రజ్ఞయుఁ బురాతనము లైనవి. సకలజీవబంధమో క్షంబులును నీయధీనమునందే యుండును. పరమశక్తిస్వరూపిణి వగు నీదయ లేకున్నచో నెట్టికర్మంబును సిద్ధింపదు. నీవు స్వయముగా భవవి రహితవయ్యును సకలసృష్టిపదార్థములకు వివిధశక్తిస్వరూపిణివై యుందు వు. శక్తిశూన్యుం డగువాఁ డేమిచేయఁగలఁడు? విష్ణుదేవుండును, నేనును, సకలదేవదానవరాక్షసులును, సకలజీవులును దమదమశ్రైశ్వర్యములం గాంచుటకు నీయాజ్ఞయే యేకమాత్రాధారమై యున్నది. ఇంతవఱ కెందఱో బ్రహ్మవిష్ణుమహేశ్వరు లతీతులై పోయిరి. ఇంకను నెందఱో రానున్నవారు. అట్టిబ్రహ్మాదు లందఱును నీయాజ్ఞానువర్తులే గదా

అస్మదాదులకును, శ్రేష్ఠులగు దేవగణంబులకును బురుషార్థచతుష్టయ సంపత్తి లభించుటకు నీయారాధనంబుకంటె నితరోపాయం బేమున్నది? నీమూలమునఁ దక్షణమందే బ్రహ్మాస్థావరత్వములకు విపర్యంబు గలుగుచుండును. సుకృతదుష్కృతములకు నీయిచ్ఛానుసారముగనే ఫలసిద్ధి యగుచుండును. జగత్పతియు, పరమాత్మయు నగుమహాదేవున కాదిశక్తివగు నీవు సనాతనివై, యాదిమధ్యాంతరహితవై లోకయాత్రానిర్వాహణంబుకొఱకు కొకానొకమూర్తిం దాల్చి ప్రవేశించి యనేకవిధంబుల ననుగ్రహించుచుందువు. నీయథార్థస్వరూపము నెఱుంగంగలవారెవ్వరున్నారు? కావున నీవ్యాఘ్రము దురాచారుం డగుదుష్టరాక్షసుండైనను నీయనుగ్రహంబుచేఁ బరమసిద్ధిం గాంచెను. దీనికిఁ బ్రతిబంధకు లెవ్వరుందురు?

అని యీవిధముగా సముచితవచనంబులచే సద్దేవి యాత్మమహాత్మ్యంబును స్మృతికిఁ దెచ్చుటయు సప్పుడు గౌరీదేవి బ్రహ్మప్రార్థనంబుచేఁ దపంబునుండి నివృత్తి యయ్యెను. బ్రహ్మదేవుండును దేవి యొద్ద సెలవుగైకొని యంతర్హితుం డయ్యెను. అనంతరము పార్వతీదేవి తనతల్లి యగుమేనకను సందర్శించి, తనవియోగఖేదంబున నవసియున్న యాజననీజనకులకుఁ బ్రజ్ఞానంబు లాచరించి యనేకవిధంబులగుప్రియవచనంబులతో వారల వారల నూఱడించెను. పిమ్మటఁ బార్వతీవిరహదుఃఖంబుచేఁ బుష్పహాసంబున బాష్పమోచనంబు సేయుచు, శాఖారూఢంబు లగువిహంగకూజితంబులచే దీనభావంబున విలపించుచు వ్యాకులభావంబున మార్గనుపడియున్న యాశ్రమమహీరుహంబులను సఖీమణుల కొప్పగించి యమ్మహాదేవి భర్తృదర్శనకుతూహలంబున నతిత్వరితముగ బయలుదేఱెను. అప్పు డామె యావ్యాఘ్రమును దనకన్నబిడ్డవలెనే ముందిడుకొని తనదేహకాంతులచే దశ

దిశల వెలుఁగఁ జేయుచు మహేశ్వరనిత్యనివాసం బగుమందరపర్వతము
నకుఁ బ్రయాణమై పోయెను.

## ఉమామహేశ్వరసల్లాపము.

సహ్యాదయులహ్యాదయుంబులు నాకస్మికముగఁ గిరఁగించుచు
పరమోత్కృష్టంబగుపరిణామరసంబును వర్షించుట యసాధ్యము. దే
వ్యాగమనంబునకై కుతూహలపడుచున్నమహాదేవుఁ డప్పుడు ద్వారపా
లికాసహితయై ససంభ్రమంబున నేతెంచియున్నగౌరీదేవిం గాంచి యిం
చుక సంశయించి నానివలెఁ గానవచ్చెను. అప్పటియాపరమేశ్వరుని
భావమును బార్వతీదేవియు గ్రహించెను. అంతరంగము పూర్వానుభూ
తం బగుప్రేమభావన వల్లను, నదంబులవల ను నామె యాగ్రహ
యగుటచే గృహముఖ ... నాథుని పాదములు లేచి యామె
కుఁ బ్రణామంబు గావించెను. ఆదేవియు మహాదేవునిచరణంబులకు
సాష్టాంగప్రణామంబు గావించెను. అప్పు డామె లేచియు లేవకుండఁగ
నే మహాదేవుండు తనబాహువులచే నామెను గ్రహించి పరమానంద
ముతో గాఢాలింగనముం గావించుకొని యంకభాగంబునఁ జేర్చుకొ
నుటకుఁ బ్రవృత్తుం డగుటయు నామె చటాలునఁ బ్రక్కనుం జేరి
కూర్చుండెను.

అప్పుడు మహాదేవుండు మందహాసవదనారవింద యగుదేవిని
బలవంతముగఁ దనయంకతలంబునం జేర్చుకొని చిఱునవ్వునవ్వుచు వి
స్ఫారితనయనంబులతో నామెవదనమండలసౌందర్యామృతమును బా
నము చేయుచు నామెను బలుకరింపఁ దలంచి ముందుగ నేను మా
టాడుట యుచితమో యేవిధముగనే యిట్లనియెను. ఓసర్వాంగసుం
దరీ! ఆనీయవస్థ మాఱిపోయినదా? అప్పుడు నీకోపము నుపసంహరింపఁ
జేయుటకై నాకేయుపాయమును దోఁచినది కాదు. నీవు స్వేచ్ఛా

వశంబున నితరవర్ణమును గ్రహింపక కాళీరూపమునే ధరించి యుంటివి. దేవీ! నీస్వభావము నందు నాహృదయము విముగ్ధంబగుటచే నదియొక చింతాకారిణి యయ్యెను. నీయూపరమభావము నేవిధముగా విస్మరించితివి? తలంచుకొన్నచో సర్వవస్తువులను ధరింపఁగలనీ కీవిధముగా మనసు గలఁగించుకొనుటకుఁ గారణంబెంతమాత్రమును లేదు. సామాన్యదంపతులకువలెనే మనయిరువురకునుగూడఁ బరస్పరవిద్వేషంబు తటస్థించినచో నిఁక నీచరాచరప్రపంచంబంతయు నిలుచుట యెట్లు?

దేవీ! నే నగ్నిమస్తకస్థితుండను. నీవు సోమమస్తకస్థితవు. మనమిరువురమే యగ్నిసోమాత్మకం బగునీవిశ్వమంతయును బరిపాలించుచున్నారము. లోకహితార్థముగాను మనము స్వసంకల్పానుసారంబుగా శరీరధారణంబు గావించి విహరించుచున్నారము. మనయిద్దఱిలో విచ్ఛేదంబు సంఘటిల్లినచో నప్పుడు నిక్కముగా నీజగంబంతయు నిరాధారంబై పోవును. ఈవిషయంబున శాస్త్రయుక్తిచే సిద్ధాంతంబైన కారణంబొకటి గలదు. స్థావరజంగమాత్మకం బగునీజగంబంతయు (వాగర్థ) నామరూపాత్మకంబై యున్నది. నీవు సాక్షాదమృతమయంబగువాక్యస్వరూపము గలదానవు. నేనును సుధామయంబగునర్థస్వరూపము గలవాఁడను. ఇట్లు మనమిరువురము సమ్మతులమైయుండునపుడు మనకు విచ్ఛేదమెట్లు సంభవించును? నీవు మద్బోధకారణంబగువిద్యాస్వరూపిణివి. నేను తదీయంబగుజ్ఞానమునకు జ్ఞేయస్వరూపుఁడను. విద్యావేద్యంబులకు విశ్లేషంబు లేనప్పుడు విద్యావేద్యస్వరూపులము మనకు విచ్ఛేదంబెట్లు తటస్థించును. నే నాత్మవ్యాపారముచే నీజగత్సృష్టిసంహారములు గావించుటలేదు. ఆజ్ఞావశంబుననే యవి జరుగుచుండును. మహత్తరంబగునట్టియాజ్ఞవు నీవే. నాకుఁగల స్వాతంత్ర్యరూపంబగునైశ్వర్యంబున కంతకును నాజ్ఞయే యేకమాత్రసాధనమై యున్నది. ఆజ్ఞారూపిణ్యండ

నైనచో నాకీయైశ్వర్యమంతయు నిలుచు నెట్లు? మనమిద్దఱమును వియుక్తులమై యెన్నఁటికి నుండఁజాలము. అయినను మనకు వియోగము సంఘటిల్లినది. ఇంతకంటె నాశ్చర్యకరమగువిషయ మేమున్నది?

దేవీ! ఈప్రపంచమునందు మనప్రవృత్తులకు లోకానుగ్రహంబుకంటె నితరప్రయోజనం బేదియును లేదు. కావుననే మనక్రీడాకౌతుకంబులుగూడ నిరర్థకములు గానేరవు. దేవకార్యమునుద్దేశించి నేను నిన్నుఁ బరిహాసించితిని. అదియును నీవెఱుంగనిది గాదు. కాని కోపపడితివేల? త్రిలోకరక్షార్థమే నీవును నాపైఁ గోపించితివి. లోకార్థకంబగుకార్యం బెన్నఁటికిని నీవు చేయఁజాలవు. అని మహాదేవుండిట్లు ప్రియవాక్యంబులచే ననులాలించుటయు శృంగారభావసారంబున కుత్తమజన్మభూమి యగుపరమేశ్వరి « స్వామి వచియించినదంతయు సత్యమే " అని తనమనంబున భావించుకొని మందహాసంబు సేయుచు సిగ్గుచేఁ గౌశికీవృత్తాంతముకంటె మఱియేమియు మాటాడఁజాలకపోయెను.

దేవి యిట్లనియెను. స్వామీ! నేను కౌశికి యనునొకకన్యను సృజించితిని. నీవామెను జూడలేదుగదా! ఈప్రపంచమునం దట్టికన్య యెందును జనించియుండలేదు. ఇఁక నెన్నఁటికిని జనింపఁబోదు. ఆమె పరాక్రమము, బలము, వింధ్యాచలనివాసము, విజయము, శుంభనిశుంభసంహారము, సేవకప్రత్యక్షఫలదానము, సకలదేవతానిత్యపరిత్రాణము మొదలగువిషయములంగూర్చి బ్రహ్మదేవుండు సవిస్తరముగా నీకు నివేదింపఁగలఁడు. అని చెప్పుచు సఖీజనంబులచే నావ్యాఘ్రము నచ్చటికిఁ దెప్పించి మహాదేవున కుపాయనరూపంబున నివేదించి స్వామీ! ఈవ్యాఘ్రమును దిలకింపుము. నాయుపాసకులలో నింతటివా రెవ్వరును లేరు. తపోవనంబున దుష్టసత్వంబులనుండి యిది నన్నుఁ గాపాడినది. అందుచే నిది నావిశ్వాసమునకుఁ బాత్రమైనది. అది మనయ

నుగ్రహముం గోరి స్వదేశమును విడచి వచ్చినది. నావలన నీకుం బ్రియంబుగావించుట నీకవశ్యకర్తవ్యం బగునేని దీనిని మనద్వారరక్షకవర్గమునం జేర్పవలయు నని నందీశ్వరునకు నియోగింపుము.

అని ప్రణయమధురంబులును, శ్రవణామృతంబులునగుమృదువచనంబులతో దేవి యిట్లు కోరుటయు మహాదేవుండు ప్రియా! నీమధురవచనంబులకు నేను ప్రీతుండనైతినని చెప్పినంతనే యావ్యాఘ్రము సువర్ణవేత్రంబును, రత్నకంచుకంబును, కాలకాకోదరసన్నిభంబగు ఖడ్గంబును దాల్చి ద్వారరక్షకగణనాయకరూపముతోఁ బొడసూపెను. సోమరూపిణియగుదేవియు, మహాదేవుండును, నందీశ్వరుండును గూడ దానికార్యంబున కానందించుచుండుటం జేసి యావ్యాఘ్రమునకు సోమనంది యనునామంబు గలిగెను. అర్ధేందుభూషణుం డగుమహాదేవుం డిట్లు దేవీప్రియంబు గావించి యామెను బహువిధరత్నఖచితదివ్యాలంకారములచే నలంకరించి మనోహారిణియగు పర్వతరాజకన్యను దనయంకతలంబునం జేర్చుకొని నానావిధప్రియసంభాషణంబులచేతను, సల్లాపంబులచేతను నుపలాలించెను.

## — అగ్నిషోమాదివివరణము. —

మునులిట్లనిరి. వాయుదేవా! మహాదేవుండు దేవితో నీవిశ్వంబంతయు నగ్నిషోమాత్మకం బనియు, వాగర్థాత్మకంబనియు నిర్దేశించియుండెనుగదా! మఱియు నాతఁ డంబికం గాంచి నీవునకైశ్వర్యంబునను నేకమాత్రసారంబ వని కూడఁ జెప్పియుండెను. ఆవాక్యంబులతాత్పర్యంబు యథారూపంబుగ వినవలయు నని మేమందఱమును గుతూహలపడుచున్నారము. దయతో నంతయు నెఱింగింపుమని ప్రార్థించిరి.

వాయుదేవుం డిట్లనియెను. రౌద్రంబును, ఘోరంబును, తేజోమయంబు నగునీశ్వరునిదేహ మగ్నిస్వరూపం బనియును, అమృతమ

యంబును, శక్తిమంతంబును, శాంతిదాయకంబు నగు దేవిశరీరము సో
మస్వరూపంబనియును బ్రసిద్ధంబులు. అమృతమునందే విశ్వమంత
యును బ్రతిష్ఠితమైయున్నది. తేజము సాక్షాద్విద్యాకళాస్వరూపము.
నిఖిలసూక్ష్మభూతంబులును రసతేజోమయంబులై యుండును. సూ
ర్యానలాదిరూపంబులచేఁ దేజంబునకును, సోమజలాదిరూపంబులచే
రసంబునకును వివిధవృత్తులు గలవు. తేజము వైద్యుతాదిమయంబై
నది. రసము మధురాదిమయంబైనది. ఈ తేజోరసవివిధభేదంబులచేత
నే జరాచరంబగు నీవిశ్వమంతయు ధరింపఁబడియున్నది. అగ్నినుండి
యే యమృత ముదయించును. మరల నాయమృతమువలననే యగ్ని
వర్ధిల్లుచుండును. కావుననే యగ్ని, సోముఁడు ననునీయిరువురు దేవతల
నుద్దేశించియు హోమముచేయఁబడినయాజ్యము లోకహితకరంబని ప్ర
శంసితం బయ్యెను.

హవిస్సుకొఱకు సస్యంబును, సస్యాభివృద్ధికొఱకు వర్షంబును,
మరల వర్షాభివృద్ధికొఱకు హవిస్సును గారణంబు లగుటంజేసి యీజగం
బంతయు నగ్నిషోమభృతంబని ప్రసిద్ధం బయ్యెను. సౌమ్యం బగు
నమృతముతోడిసంబంధము గలుగనంతవఱకు నగ్ని యూర్ధ్వముఖంబు
గాఁ బ్రజ్వలించుచుండును. అయ్యమృత మగ్నిసమ్మిళితం బైనప్పు
డది యధోభాగమునకు బ్రవహించుచుండును. అందుచేతనే కాలాగ్ని
యధోభాగమునుండియే యూర్ధ్వమునకుఁ బ్రజ్వలించుచుండును. అగ్ని
యూర్ధ్వగతం బగునంతవఱకే దహించుచుండును. అది యధోగతం
బైనంతనే జలప్లావితం బగును. ఈయూర్ధ్వజ్వలనం బగుకాలాగ్ని
యాధారశక్తిచే ధృతంబై యుండును. నిమ్నగతుం డగునాధారశక్తి
స్వరూపసోముఁడు శివశక్త్యాశ్రయుండై యుండును. శివునకు శక్తియు,
శక్తికి శివుఁడు నాధారులై యుందురు. కావుననే యీజగంబున శివ

శక్తివిభిన్నం బగుపదార్థం బేదియును లేకుండును.

ఈజగం బనేకపర్యాయము లగ్నిచే దగ్ధమై భస్మ మగుటం జేసి భస్మ మగ్నివీర్యంబుగా నిర్దిష్టం బయ్యెను. ఈభస్మతత్త్వము నెఱింగి "అగ్ని" ఇత్యాదిమంత్రంబులను బఠించుచు భస్మస్నానము సేయువాఁడు సకలబంధవిముక్తుం డగును. అగ్నివీర్యంబగునట్టిభస్మము యోగవిముక్తిచేఁ బ్రకృతి కధికారమును గల్పించుచు మరల నది శాక్తామృతముచేఁ బ్లావితమై యోగయుక్తిచేఁ బ్రకృతి నధికారమునుండి మరలించుచుండును.

ఇందుచేతనే మృత్యువిజయంబును గోరుసాధువు లమృతముచే నభిషిక్తులగుచుందురు. శివశక్తిస్వరూపం బగునమృతస్పర్శనము లభించినతరువాత నిఁక మృత్యు వెట్లు సంభవించును? ఈమహాస్నాపనవిషయంబులతత్త్వము నెఱింగినమహాత్ముఁడు కేవలము నగ్నిసోమపుటంబును బరిత్యజించి భవవిముక్తుండు గాఁగలుగును. ఎవ్వఁడు శివరూపానలంబుచే శరీరమును దగ్ధముగాఁ జేసి యోగమార్గానుసారంబుగా శక్తిరూపామృతంబుచేఁ బ్లావితంబుగాఁ జేయునో యాతఁడు మోక్షపదంబు నందుటకు సమర్థుం డగును. ఈయర్థము మనసునందుంచుకొని యే మహాదేవుం డీజగమంతయు నగ్నిసోమాత్మకంబని యానతిచ్చియుండెను.

## —♦షడధ్వవివరణము.♦—

వాయుదేవుం డిట్లనియెను. ఈజగం బంతయును వాగర్థమయంబనువిషయముం గూర్చి చెప్పెదను. అందువలన సవిస్తరంబుగఁ గాకపోయినను సంక్షేపముగ నైన షడధ్వంబులవిధంబు బోధపడఁగలదు. ఈప్రపంచమునందు శబ్దము లేనియర్థము గా[illegible] శబ్దము గాని యొక్కటియును లేదు. [illegible]ములూహారం

బంతయు సర్వవిధంబుల సర్థబోధకంబై యుండును. ఈప్రకృతిపరిణా మం బంతయును శబ్దార్థభావితంబై యుండును. ఈప్రకృతి పరమాత్మ లగుశివశక్తుల నైశ్వర్యం బని చెప్పుదురు. అందు శబ్దస్వరూపం బగు విభూతి స్థూలం బనియు, సూక్ష్మం బనియు, తద్భిన్నం బనియు మూఁడువిధంబులు గలిగి యుండును. శ్రవణగోచరం బగుశబ్దము స్థూల విభూతియు, చింతామయం బగుశబ్దము సూక్ష్మవిభూతియనియు, చింతాశూన్యం బగుశబ్దము పరావిభూతి యనియుఁ జెప్పంబడును.

ఈపరావిభూతియే శివతత్త్వము నాశ్రయించిన క్రియాశక్తి. జ్ఞానశక్తిసంయోగంబుచేతను, నీశ్వరేచ్ఛానుసారంబు చేతను బూర్వోక్తసకలశక్తులుం జేరినసమష్టియే శక్తితత్త్వము. అదియే సమస్తకార్యంబులకును మూలప్రకృతిత్వముం గాంచి యుండును. అది సాధ్వియు, కుండలినియు, మాయయు, విశుద్ధకర్మమార్గస్వరూపిణియు నై విరాజిల్లుచుండును. అది విభక్తరూపంబులచే షడధ్వాత్మకతుల వర్ధిల్లుచుండును. అందు శబ్దము త్రివిధాధ్వరూపంబును, అర్థము త్రివిధాధ్వరూపంబును గలిగి యుండును. ఈషడధ్వంబులును జీవులకు వారివారి చిత్తశుద్ధుల ననుసరించి భోగమోక్షంబులఁ గల్పించుటకు సమర్థములై యుండును. మంత్రాధ్వము, పదాధ్వము, వర్ణాధ్వము నను నీమూఁడును శబ్దసంబంధములై నవి. భువనాధ్వము, తత్త్వాధ్వము, కాలాధ్వము ననునీమూఁడు నర్థాంతర్గతములైనవి. ఈషడధ్వములును బరస్పరవ్యాప్యవ్యాపకంబులై యుండును.

మంత్రము లన్నియును వాక్యస్వరూపములు. అవి పదసమూహంబుచే వ్యాప్తములై యుండును. పదసమూహమంతయు వర్ణవ్యాప్తమై యుండును. వర్ణసమూహమే పదం బనిపండితులు నిర్దేశించి యుండిరి. సకలవర్ణంబులును జతుర్దశభువనంబులచే వ్యాప్తములై

యుండును. భువనమధ్యమునందే వర్ణవిజ్ఞానం బగుచున్నది. భువనం
బు లన్నియును బ్రహ్మాండమునకు బహిరంతరములం గలమహదాది
తత్త్వసమూహముచే వ్యాప్తములై యుండును. తత్త్వస్వరూపంబులగు
కారణంబులవలననే యనేకవిధంబు లగుకార్యారంభములగుచుండును.
బ్రహ్మాండాంతర్గతంబు లగుకొన్నిభువనములుమాత్రమే పురాణముల
యందు వర్ణితంబు లై యుండెను. తద్భిన్నంబులగుశివాగమంబుల
యందు మఱియు ననేకభువనంబులు ప్రశంసితంబులై యుండెను.
సాంఖ్యయోగశాస్త్రంబులు మహదాదితత్త్వంబులలోఁ గొన్నింటిని
మాత్రమే పేర్కొని యుండెను. కాని శివశాస్త్రమునం దింకను ననేక
తత్త్వములు సవిస్తరముగా వర్ణింపఁబడియును. సకలతత్త్వంబులును
స్వోపయోగకరంబులగుకళలచే వ్యాప్తములై యుండును. ప్రథమ
మందే మూలప్రకృతి పంచవిధంబులగుపరిణామములం గాంచియుండె
ను. ఆపంచపరిణామములే నివృత్త్యాదిపంచకళలు. అవియును బరస్పర
వ్యాప్తంబులై యుండును. షడధ్వంబుల కభిన్న యగుపరాశక్తియే
వానికి వ్యాపికయై యుండును.

ప్రకృతి శివతత్త్వస్వరూపమునందలి యీషడధ్వములందును
నిలిచి యుండుటవలన శక్తినుండి పృథ్వీపర్యంతమునుగల సమస్తమును
శివతత్త్వమునుండి సముద్భూతం బయ్యెను. కుంభాది నానావిధమృ
ణ్మయపదార్థములకు మృత్తిక వ్యాపకమైనట్లు, సమస్తజగంబునకును
శివతత్త్వము వ్యాపకం బగుచున్నది. ఈషడధ్వంబులమూలమునే పర
మశివధామమును బడయవలయును. సర్వవ్యాపిక యగుశక్తి పంచ
తత్త్వశోధనమువలన శివధామప్రాపక యగును. నివృత్తిచే రుద్రప
ర్యంతం బగుబ్రహ్మాండం బంతయును, ప్రతిష్ఠచే నవ్యక్తపర్యంతం
బగుబ్రహ్మాండోపరిభాగంబును, విద్యచే విశ్వేశ్వరపర్యంతం బగునవ్య

క్రోధ్వభాగం బంతయును, శాంతిచే దాని కూర్ధ్వభాగం బంతయును విశుద్ధంబు లగును. శాంత్యతీతకళచే సథ్వాంతసర్వాంతం బగుసద్మార్గం బంతయును శోధితం బగును. ఈశాంత్యతీతకళ [illegible] యోగంబుచేం బాశము [illegible]

నివృత్త్యాదు లగుసపంచకళలచేతను జగం బంతయు వ్యాప్తంబై యున్నది. కావునసే సాధకు లీపంచకళలయందును సమస్తప్రపంచమును సందర్శింపవలయును. ఈషడధ్వవ్యాప్తి నెఱుంగక శుద్ధి గావింపం బ్రయత్నించుటవలన నెంతమాత్రమును లాభము లేదు. అట్టివృథాశ్రమం బంతయు నరకభోగంబునకుం గారణం బగును. శక్తిజ్ఞానంబు లేనిచో సకలతత్త్వంబులును, వానివ్యాప్తియు, వానిశుద్ధియుం గూడ నవిదితంబులై యుండును. ఆశక్తి శివునిపరమజ్ఞానస్వరూపిణియు, చిత్స్వరూపిణియు, పరమేశ్వరియు నై విరాజిల్లుచుండును. అఖిలకారణభూతయగునయ్యాదిశక్తిమూలమునసే పరమేశ్వరుం డఖిలజగదధిష్ఠితుండై యుండెను.

వాస్తవికముగాం బరిశీలించినచో నీశక్తి యాత్మసంబంధమగు మాయయును గాదు; వికారమును గాదు. దీనికి బంధమోక్షంబులు లేవు. ఇది తనకుం దానే బంధమోక్షవిధాయినియై, సర్వేశ్వరియై, పరాకాష్ఠయై, పరమేశ్వరునితో నిత్యసంబంధము గలిగి యుండును. విశేషించి శివగుణసంపర్కముగలది గావున నిదియును శివసమానధర్మములు గలిగియుండును. ఈమెవలన శివుండు గృహస్థుండును, శివునివలన నీమె గృహిణియు నైరి. కార్యరూపంబును, బరప్రకృతిజంబును నగు నీజగం బంతయును వారిసంతానమే.

శివుండు కర్త. శక్తి కారణము. శివశక్తులయందు గలభేద మింతమాత్రమే. శివుండే స్త్రీపురుషరూపంబులతో నుండు నని కొందఱు

చెప్పుదురు. ఆయిరువురకును గలభేద మింతమాత్రమే. సూర్యుండు ను, నాతనిప్రభయును బరస్పరము వస్తుత్వముచే భిన్నత్వముం గాంచి యున్నను సూర్యసమవాయిని యగుప్రభ సూర్యుఁడు లేకుండ వేఱుగ నిలువఁజాలనివిధంబుగనే చిత్స్వరూపిణి యగుపరాశక్తియు శివునికంటె భిన్నయయ్యును శివవ్యతిరిక్తయై యుండఁజాలదని కొందఱు చెప్పుదురు.

కావున శివుం డీసమస్తజగదుత్పత్తికిని గారణుఁడై యున్నాఁడు. పరమేశ్వరి యగునాదిశక్తి యామహేశ్వరునియాజ్ఞాస్వరూపిణియై యుండును. ఆశక్తిమూలమునసే త్రిగుణాత్మికయు, నవ్యయయు, శైవియు నగుమూలప్రకృతి జగత్కార్యనిర్వహణంబుకొఱకుఁ బ్రవర్తిల్లుచుండు ను. తత్తత్కార్యభేదంబులచే, నీదివ్యశక్తి మహామాయ యనియు, మాయయనియు, త్రిగుణాత్మికప్రకృతి యనియు మూఁడువిధంబులు గాఁ బరిణమించి పూర్వోక్తంబు లగుషడధ్వంబులను గల్పించుచుండు ను. వాగర్థమయంబు లగునట్టిషడధ్వములో యీసమస్తప్రపంచస్వ రూపమునను బరిణమించుచున్నవి. శాస్త్రంబులన్నియు నీషడధ్వము లంగూర్చి సవిస్తరంబుగా ననేకవిధంబులఁ బ్రశంసించుచుండును.



శ్రీదేవాయనమః.

# పురాణగ్రంథమాలిక,

## పిఠాపురము.

మనపూర్వులమహామహిమలు, సత్యచారిత్రములు, భగవన్మహిమలు, ధర్మములు, నీతులు, నీతిబోధకములగు కథలు, దేవతల చరిత్రములు, రాక్షసులచర్యలు, భగవంతునియనుగ్రహము—ఇత్యాదివిషయములతో నిండియున్న యిహపరసాధకంబులగుమనపురాణోపపురాణములు, ఇతిహాసములు మొదలగునుత్తమగ్రంథములను సులభశైలిని వచనరూపమున నాంధ్రీకరించి యాంధ్రమహాజనులహస్తముల కందించుటకై స్థాపింపఁబడినది. రెండేసినెలల కొక్కొక్కసంపుటము చొప్పున 200—250 పుటలవంతున డెమ్మీసైజునఁ బ్రకటింపఁబడుచుండును. ఆంధ్రమహాజనులందఱును మాయుద్యమమునకుఁ దోడ్పడి గీర్వాణభాషయందున్న యామహాపురాణాదులను మనతెలుఁగువారికిఁ దెలియునట్లుగా నొనర్చుచున్న మాకుఁ బ్రోత్సాహముఁ గలిగింతురు గావుత మని వేఁడికొనుచున్నాము.

నిబంధనలు.

(1) ఇందు చందాదారులగువారు రు 0-4-0 ప్రవేశరుసుము చెల్లింపవలయును.

(2) చందాదారులకు పోస్టేజి మనియార్డరుకర్చులు మేమే భరించి ఒక్కొక్కసంపుట మొకరూపాయకుమాత్రమే పంపుచుందుము. (చందాదారులుకానివారికి పోస్టేజిగాక రు 1-8-0 లు.)

(3) నైజాము ఇలాకా గ్రామములు [illegible]

వున నట్టివారు ప్రవేశరుసుముసహా రు 5-4-0 ముందుగాఁ జెల్లించి నచో వారికి ఆయుసంపుటములు ప్రకటింపఁబడి నపుడెల్ల రిజస్టర్డు బుక్కుపోష్టుగాఁ బంపుచుందుము.

సహాయులు.

సంవత్సరమునకు ముందుగ రు 10 ల నొసగువారిని సహాయులుగాఁ జేర్చుకొని వారినామములను సహాయులపట్టిలోఁ బ్రకటించుచు వత్సరమున వెలువడు ఆయుసంపుటములను రిజస్టర్డుపార్సెలుగాఁ బంపుచుందుము.

పోషకులు.

ఒక్కసారిగ నూటపదియాఱునూప్యములుగ్రంథమాలికకువిరాళముగనొసగిన భాషాభిమానులను బోషకులుగాఁ జేర్చుకొని వారి నామములను గ్రంథములలోఁ బ్రకటించుచు నీగ్రంథమాలికనుండి వెలువడు గ్రంథములన్నిటి నెప్పటి కప్పుడు అన్‌రిజస్టర్డుపార్సెలుగాఁ బంపుచుందుము.

రాజపోషకులు.

ఒక్కసారిగ రెండునూటపద్నాలుగాని అంతకుఁబైఁగ వారియు దారహృదయమునకుఁ దోఁచుసంతటిద్రవ్యముఁగానిదయచేయుశ్రీమంతులను జమీందారులను రాజపోషకులుగాఁజేర్చుకొనియిందుఁ బ్రకటింపఁబడుగ్రంథములన్నిటిని రిజస్టర్డుబుక్కుపోష్టుగా నందించుచుందుము.

పురాణగ్రంథమాలిక,
పిఠాపురము.
తూర్పుగోదావరిజిల్లా.

సడకుటి వీరరాజు పంతులు
సంపాదకుఁడు.

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము చందాదారులను, వారుకోరినయెడల, అడ్మిషన్ ఫీజు 0-4-0 అక్కఱలేకుండ, చందాదారులుగాఁ జేర్చుకొని మాగ్రంథములు [illegible]డలినపుడెల్ల ఒక్కొక్కరూపాయాకు వి. పి. గాఁ[illegible]ంపుదుము.

